# 'కరుణకుమార' కథలు

## (మొదటి సంపుటము)



ప్రకాశకులు :

ఆధునిక వాఙ్మయ కుటీరము

౧౯-ఏ, గెంగురెడ్డి వీధి, ఎగ్మోరు,

మద్రాసు.

# విషయ సూచిక

# ప్రకాశకుల మనవి.

ఆధునిక విజ్ఞానానికి సంబంధించిన అన్ని విధములయిన గ్రంథాలనూ ప్రకటించే ఉద్దేశంతో ఈ 'ఆధునిక వాఙ్మయ కుటీరము' స్థాపించాము.

మా మొదటి గ్రంథమే ఈ 'కరుణకుమార' కథలు. వీటిని ప్రకటించుటకు అనుమతి యీయవలసిందని కోరిన వెంటనే, ఎట్టి ప్రతిఫలమూ ఆశింపకుండా ఉచితంగా ఇచ్చిన శ్రీ 'కరుణ కుమార' గారికి మా కృతజ్ఞతాభివందనములు. ఈ కథలకు పాఠకలోకం ఇచ్చే ఆదరప్రోత్సాహాలను చూచుకొని, 'కరుణ కుమార'గారి మిగతా కథలనుకూడా త్వరలోనే ప్రకటించాలని వున్నది.

పాఠకలోకం మాయీ ఉద్యమానికి తగిన ప్రోత్సాహమిచ్చి ఆదరించాలని కోరుతున్నాము.

# పరిచయ వాక్యాలు.

'కరుణకుమార' అనే పేరుతో ఈ కథలు వ్రాసిన వారు నాకు చాలా ఆప్తబంధువులు. వారికి కథలు వ్రాయడం ఇదే క్రొత్త. ఇప్పటికి వారు పదిహేనో, పదహారో వ్రాశారు. ఈ పుస్తకంలో పడ్డవన్నీ ఇదివరకు పత్రికలలో వచ్చినవే.

కథావస్తువు తెలుగునాటి గ్రామజీవనానికి సంబంధించింది అవడమే ఈ కథలలోని క్రొత్తదనమూ, గొప్పదనమూను.

నేడు తెలుగులో చాలా కథలు వస్తున్నాయి. కాని సాధారణంగా అవన్నీ పట్నవాసజీవితాన్నే వర్ణిస్తున్నాయి; పల్లెటూరి పొరుగునకైనా పోవడం లేదు. ఈ విధంగా పట్టణానికే ప్రాధాన్యం కలిగి, రాజకీయ కారణాలచేత వెనుక బడిపోయిన గ్రామమూ, గ్రామస్థులూ సాహిత్యరంగంలోకూడా వెలిఅయిపోయినారు. నోరుమాలిన పల్లెటూరి కష్టజీవిని గమనించేవారే అరుదు. నగరవాసులకూ, గ్రామవాసులకూ అందూ పొందూ కలియక, సాహిత్యరంగంలోకూడా వారిద్దరిమధ్యా పెద్ద అంతరం ఏర్పడుతున్నది.

నేటి మన కథాసాహిత్యం సాధారణంగా పట్నవాస సభ్యతనే ప్రోదిచేసి, దాన్నే చిన్నెలూ వన్నెలూ పెట్టి

చిత్రిస్తూవుంది. ఈ స్థితి కొంత మారాలి. సాహిత్య సీమలోకూడా కళాపరంగా గ్రామవాసికష్టాలకు సుఖాలకు, దుఃఖానుభవాలకు ఆనందానుభవాలకు, ఆటలకు పాటలకు తావిచ్చి, అతని పరిపూర్ణజీవితాన్ని చవులూరేటట్లు, కళ్లు చెదిరేటట్టు నిండుజీవముతో, ఉజ్వలమయిన శోభతో తీర్చి దిద్దగలిగినప్పుడే మనం వ్రాసేగ్రంథాలకు విలువా వ్యాప్తీ హెచ్చుతుంది. అప్పుడే అవి గ్రామవాసికి సాహిత్యంమీద కొంత అభిరుచి గలిగించి, అతనిలో కొంత సంస్కారాన్ని కలిగించగలుగుతాయి.

ఈ పుస్తకంలో పడ్డ కథల కన్నిటికీ గ్రామమే రంగం అవడంచేత ఇప్పుడు సాధారణంగా వచ్చే కథలన్నిటిలోకి ఇవి కొంత విలక్షణంగానూ, విశిష్టంగానూ ఉండి, చిరకాలం పట్నవాసం చేసినవాడు జీవనం మార్పుకోసం పల్లెటూరికి వెడితే మనస్సుకి ఎట్టి ఆనందకరమైన హాయి కలుగుతుందో అట్టిహాయిని కలిగిస్తాయి. ఈ కథలు చదువుతూవుంటే మన తెలుగుగడ్డే, మన పచ్చని పల్లెటూరే, మన పంటపొలాలే, మన పల్లెటూరి కష్టజీవనమే ప్రతిపుటలోనూ గోచరిస్తుంది. ఈ కారణంచేతనే ఈ రచయిత వ్రాసి ప్రకటించినవి కొద్దికథలే అయినా అవి చాలామంది పాఠకులహృదయాన్ని రంజింపజేసి వారి ప్రశంసను చూరగొన్నాయి. వీటిని పుస్తకరూపంగా ప్రకటించవలసిందని చాలామంది మిత్రులు అడుగుతూవుండడంవల్ల ఈ రూపంగా ప్రకటించడం గలిగింది.

ఇందలికథలకు తగ్గదే భాషాను. మూడుమూర్తులా తెలుగుదనం ఉట్టిపడే శుద్ధ పల్లెటూరిభాష. ఈపుస్తకంలో కథకంటెనూ ముందుగా భాషే మనస్సును ఆకడుతుంది. పదజాలం అంతా శుద్ధపల్లెటూరివారు వాడుకచేసే దవడంచేత పల్లెటూళ్లతో సంబంధం అంతగాలేని పట్న వాసస్థులకు కొన్నికొన్నిమాటలు అర్థంకావడంకూడా కష్టమే. అందులోనూ గ్రంథకర్తకు పరిపాటయినది నెల్లూరుమండల వ్యావహారికభాష కాబట్టి ఇతరమండ లాలవారికి కొన్నికొన్నిపదాలూ, ప్రయోగాలూ కొత్త గాను, ఎబ్బెట్టుగాను కనబడవచ్చు; కాని క్రమక్రమంగా వ్యావహారికంలో సాహిత్యం అభివృద్ధిపొందుతూవున్న, వ్యావహారికానికి సాహిత్యంలో స్థాయి కుదురుతూవున్న ఈరోజుల్లో అటువంటి మాండలికాలను పరిగ్రహించి వాడడం, వాటిని నిఘంటువులోనికికూడా ఎక్కించి భద్రపరచడం చాలా అవసరం. ఈ విధంగా పల్లెటూ ళ్లలో మణిగిపోతూవున్న చక్కని జాను తెనుగుమాట లను బయటికి తీసి సాహిత్యంలో కెక్కించి ఈరచయిత తెలుగుబాసకు గొప్పసేవ చేశాడని నా ఉద్దేశం. ఈ విధమయిన వ్యావహారిక పదాలచేతనే ఈ కథారచనకు మాధుర్యమూ ప్రసాదమూ అలవడింది.

శైలి ధారాళమయినది. దానిలో నట్టులేదు; సొట్టలేదు. కథ మొదలుపెడితే చివరవరకూ వెళ్లేదాకా ఆగ బుద్ధిపుట్టదు.

రచనలో ఏలోపము లున్నా రచయిత కిది ప్రథమ ప్రయత్నమనీ, అతడు సాహిత్యరంగంలోకి ఆరాధనా కుతూహలంతో క్రొత్తగా వచ్చిన కళోపాసకుడనీ జ్ఞాపకముంచుకొని అతనికి ప్రోత్సాహ మిస్తే అతనినుంచి ముందు ముందు మంచికళారచనల కాశింపవచ్చునని నా విశ్వాసం.

మల్లంపల్లి సోమశేఖర శర్మ.

# అంజలి

ఈ పుస్తకంలో చేర్చబడ్డ ఆరు కథలూ ఇదివరలో 'భారతి', 'ఉదయిని', 'గృహలక్ష్మి' పత్రికలలో ప్రకటన అయినవే. నా యీ కథలను ఆదరించి తమ పత్రికలలో ప్రకటించి నాకు ప్రోత్సాహ మిచ్చిన ఆ పత్రికాధిపతులకు నా హృదయపూర్వక వందనములు.

మన గ్రామ జీవనమును అందాలు చిందేటట్టు, మనస్సును ఆకట్టేటట్టు సాహిత్యంలో చిత్రించడానికి అవకాశం ఉన్నదనే విషయం నాకు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి 'మాలపల్లి' చదివే వరకూ తెలియదు. నా హృదయాన్ని 'మాలపల్లి' లాగ అంత తీవ్రంగా ఆకర్షించిన గ్రంథం నే నింతవరకూ మరొకటి చూడలేను. అటువంటి ఉత్తమ గ్రంథాన్ని తెలుగు సాహిత్యానికి ప్రసాదించి శాశ్వతకీర్తి గడించిన శ్రీ పంతులుగారి జీవితం ఎంతటి ధన్యమైనది!

'మాలపల్లి' చదివిన తరువాతనే ముఖ్యంగా తెలుగునాటి గ్రామజీవనాన్ని కథలలో చిత్రించాలనే ఉబలాటం కలిగింది నాకు. ఆకుతూహలంతోనే వ్రాసిన కథ లివి. కథలు వ్రాయడంలో నా కిదే తొలియత్నం.

నా యీ కథారచనోత్సాహాన్ని పెంపొందించిన వారు నాకు చాలా సన్నిహిత బంధువులైన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు.

నాకీ విధమైన సాహిత్యాభిరుచీ, రచనాభిలాషా కలిగించిన శ్రీ పంతులుగారికీ, శ్రీ శర్మగారికీ నా కృతజ్ఞతాపూర్వక వందనాలు అర్పించుకోవడం తప్ప ఏమి చేయగలను ?

ముందుకు వచ్చి 'ఆధునిక వాఙ్మయ కుటీరం' వారు ఈ కథలను పుస్తకరూపంగా ప్రకటించినందుకు వారికి కృతజ్ఞుడను.

పుస్తకరూపంగా ప్రచురించే సందర్భంలో అవసరమని తోచి ఈ కథలలో అక్కడక్కడ చిన్న సవరణలూ, మార్పులూ చేశాను. ఇదివరకు 'లంఘనం పరమౌషధం' అన్న పేరుతో పడ్డ కథకు 'ఆకలి మంటలు' అనీ, 'అయ్యవారిని చేయబోతే కోతయింది' అన్నదానికి 'సన్మానం' అనీ పేర్లు మార్చాను.

'కరుణకుమార'

# అంకితము

కేవలం చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయిన
సోదరుల అభివృద్ధికోసరం కష్టించి త్యాగంచేసిన
నా జ్యేష్ఠ సోదరునికి.

# ఆకలి మంటలు

## ౧

"వంకాయలున్నై, పచ్చిమిరపకాయలున్నై, అరటిపళ్లున్నై."

"అరటి పళ్లెట్లా ఇస్తావు?"

"అణాకు పదిస్తుండానమ్మా."

"ఆ! బజారులో పదహారువంతున దిబ్బలుదిబ్బలుగా ఇస్తుంటే!"

"లేదమ్మా."

"మొన్న మేం తెప్పించుకోలేదూ?"

"అవ్వేవో జబ్బురకం తల్లీ."

"నీవి మేలురకం కాబోలు, అన్నీ ఒకటేరకం."

"లేదు తల్లీ! పొద్దున్నే తమతో బేరంఎందుకు, పదకొండుచేసి తీసుకో అమ్మా."

"పధ్నాలుగు చేసి యిస్తేఇయ్యి; లేకుంటేవెళ్లు."

"మే మేంతినేది తల్లీ?"

"అన్నం.—"

"మీ బోటిగొప్పవారే ఇట్లా బేరంచేస్తే మాకు అన్నం ఎట్లా వస్తుంది తల్లీ."

"ఊళ్లోవాళ్ళ కందరికీ మేం అన్నం పెట్టలేమయ్యా! నీ కిష్టమైతే ఇయ్యి.—"

"నేను కొన్నదే పన్నెండువంతున కొంటే నీకు పధ్నాలు గెట్లా గిచ్చేది తల్లీ."

"నా కదంతా తెలియను.—"

"లేదమ్మా: పన్నెండుకాడికి కొన్నాను: అణాకు ఒక్కపండు లాభం. నీకుగాబట్టి పదకొండుచేసి యిస్తుండా. దయఉంచు."

"లేనులేదు: పధ్నాలుగుకు ఒక్కటి తక్కువైనా నా కవసరంలేదు.—"

"సరే: తల్లీ! నేకొన్నకాడికే ఇస్తా: పన్నెండు చేసి తీసుకో.—"

"ఆరి నీ పంతం పాడుగాను."

"లేదమ్మా: దణ్ణంపెడతా పొద్దన్నే నీకు. ఎప్పుడూ వచ్చే ఇల్లుకదా అని — పోగొట్టుకోలేక లాభంలేకపోయినా యిస్తుండా — తీసుకో అమ్మా."

"అణావి వద్దు. ఓ అర్ధణాపళ్లు చాలు."

"అయ్యో తల్లీ: ఓ అణావి ఉంచుకో అమ్మా. మళ్ళా నేను నాలుగురోజులుదాకా రాను."

"మాఇంట్లో తినేవారే లేరు; ఖర్చుకావు."

"అర్ధణాపళ్లు ఎన్నాళ్ళుంటాయి తల్లీ.—"

"అర్థణాకయితే ఇవ్వవాపమిటి చెప్పు. నాకు పొద్దెక్కుతోంది. నీతో కూర్చోలేను."

"సరే: తీసుకోతల్లీ. నీచలవఉంటే అంతేచాల్లే."

"మంచి వియ్యావోయ్."

"నీకాడనే దాచుకొంటానా తల్లీ."

"చూడు. ఆకాయ డాగుపడింది."

"డాగు కాదమ్మా: పైతొక్కు కొంచెం -"

"కుళ్లిందేమో?"

"కుళ్లితే నాకు డబ్బులివ్వబోకండి: చెడిపోయిన సరుకు అమ్ముకొని, నే నెంతకాలం బదికి ఉండాలమ్మా ఈలోకంలో ——."

"కాయలు గట్టిగా ఉన్నాయి ఏమిటోయ్."

"లేదు తల్లీ: భోంచేసుకొని మరీ డబ్బులియ్యండమ్మా నాకు. ఇప్పుడు తొందర లేదు."

"......................"

"వంకాయ లక్కరలే తల్లీ?"

"ఎందుకు పాడువంకాయలు, తినితిని మొఖం కొట్టింది."

"వెన్నపూసలా గుండాయి తల్లీ: ఇవ్వేళే కోసుకొచ్చాను."

"...................."

"ఓ వీశకాయలు తూస్తా."

"ఎందుకు? నీ కెక్కడా అమ్ముడుపోలేదా ఏమిటి?"

"అరవీశ వేసేదా?"

"అసలు ఎట్లా ఇస్తున్నావు?"

"నీ ఋష్టంకాడికి మీరిపోనులే తల్లీ."

"నిన్న వీశ అర్ధణాకి తీసుకో అని తోటపల్లి గొల్లది కాళ్ళమీద పడేసింది. ఖర్చు కావని వద్దన్నా."

"అయ్యో తల్లీ: అన్నిటికీ ఇట్లా బేరం చేస్తే మాకు ఈ ఎండల్లో తిరిగిన కూలయినా గిట్టక్కరలేదా తల్లీ. ఈ కాయ లట్లాంటివి కావులే, అణాచేసి యిస్తుండా. ఓ అరవీశతూస్తా.

"అణానా? సడేలే. పొద్దున్నే బేరం బాగానే ఉంది."

"వీశకు చిన్నడబ్బుంచాలు తల్లీ. నాలుగు వీశలు తెచ్చాను. ఒక్కఅణాడబ్బులు వంకాయల్లో మిగిలితే చాలనుకొని తెచ్చా. మా కేమైనా స్వంతతోటలుండాయా తల్లీ! మారాజులు మీరు. మావంటివాళ్లని పూటకి పదిమందిని పోషించగల మారాజులు. మీరే ఇట్లా బేరంచేస్తే మేం బతికేది ఎట్లా తల్లీ?"

"సరేలెద్దూ. నీతులకేమి? అర్ధణా కిచ్చేటట్ట యితే ఓ అరవీశ ఇచ్చిపో. లేకుంటే నీదారిన నీవు దయ చెయ్యి.—"

"సరే. నీ యిష్టమేకానియ్యమ్మా: ముక్కాని చేసుకొని తీసుకో: ఓ వీశ ఇమ్మంటావా?"

"ఎందుకూ వీశా అరవీశాను. సంతర్పణ చేయమంటావా ఏమిటి? ఓ ఏబులం తూచు.—"

"ఏబులం ఎట్లాగమ్మా? లెక్క సరిపడదే: ఏబులం చిన్నడబ్బుకాడిక తీసుకో.—"

"సరేలే ఏబులానికో బేరం, వీశకో బేరమూనా? నీదంతా ఎగతాళిగా ఉందే—"

"వీశ ముక్కానయితే ఏబులం ఎట్లామ్మా గిట్టేది? రెండు దమ్మిడీలకు కొంచెం ఎక్కుందే—"

"నీ ఏడుపు మండిపోనూ. ఏబులానికి ఇంకా నాలుగుకాయలు అదనంగా వేసి చిన్నడబ్బు తీసుకొని పోరా. ప్రాణాలు కొరికేస్తున్నావు."

"అయ్యో మాలక్ష్మి: నీకు దణ్ణం పెట్టుకోవాలమ్మా. సరే తీసుకో."

"నీకు అరటిపళ్లకూ, వంకాయలకూ ముక్కాని ఇవ్వాలి."

"పొద్దున్నే బోణీచేస్తే నీచేతిచలవ చల్లంగా ఉంటుందమ్మా."

"ఇప్పుడు చెయ్యితీరలేదురా. ఇంటికిపోయ్యేటపుడు రా."

"సరే తల్లీ: పచ్చిమిరపకాయ లక్కారలేదా అమ్మా?"

"పచ్చిమిరపకాయలూ వద్దూ, పండుమిరపకాయలూ వద్దు.—"

అరటిపళ్లూ వంకాయలూ ఒడిలో వేసుకొని సరోజిని వాకిట్లోనుండి ఇంట్లోకి పోయింది. కూరలవాడు, తట్టను నెత్తిమీది కెత్తేవాళ్లులేక, తనే కష్టంమీద నెత్తి కెక్కించుకొని – అసలే అప్పళించుకొని వెన్నుకు అంటిపెట్టుకొనిఉన్న కడుపును చెవిపట్టుకొని వెనుకకు తనలోనికి లాగుతూఉండేనడుము జవజవలాడుతుండగ అడుగులు వేసుకొంటూ – "ముక్కాని బేరం: మూడు జాములయింది. పిల్ల ల్నెట్టాగబ్బా బతికించేది. ఇంటికాడ వోపలేనిమనిషి. కూడయినా వొండుకుందో లేదో" అని అనుకుంటూ నడవదిగి బయటి ప్రాకారం దాటి వీధినబడి "వంకాయలు, పచ్చిమిరపకాయలు –" అని అరుచుకొంటూ పూర్వజన్మంలో పెట్టిపుట్టిన సంపన్నగృహస్థుల సౌధరాజములతో శోభించే బజారున బడిపోయినాడు.

# ఆకలి మంటలు

## ౧

“ అమ్మా కూరలేవీ అక్కరలే?—”

“ ఏం తెచ్చావే?”

“ పొన్నగంటాకూ: దేవదారాకూ.—”

“ దేవదారాకేమిటే?”

“ ఇట్లా వచ్చి చూచిపో అమ్మా: నెయ్యేసి వండుకొంటే కమ్మంగా ఉంటది.”

“ దేవదారాకా? ఏంచిత్రమే! కాలం మారినకొద్దీ కూరలుగూడా మారుతున్నాయి కాబోలు.—”

“ దేవదారాకే తినలేదా తల్లీ. మావూరుకు తూర్పుతట్టు నల్లబోడుకు పోయి కోసుకొచ్చా.”

“ ఈ కూర ఉడుకుతుందా?”

“ అయ్యో! పొయ్యిమీద పెట్టేవరకు వెన్నముద్దయిపోతుంది తల్లీ. తెల్లవారుజామున కోళ్లు కూసినపుడు లేచి పోయి తెచ్చా. ఇయ్యేళ వొండి చూడు.”

“ ఏమండీ దేవదారాకట. కొనమంటారా? ఆకుకూరలంటే మీకిష్టమేగా.”

“ ఆకుకూర లేవి తిన్నా విరేచనబంధం ఉండదు. తీసుకో.”

"ఈ రాగిగింజలు పుచ్చుకోని కాస్త దేవదారాకూ, కాస్త పొన్నగంటాకూ పెట్టవే, నాకు పొద్దెక్కింది."

"............................"

"ఆ గింజల కిదేనాఏమిటి కూర."

"నా బంగారుతల్లి, ఎప్పుడొచ్చినా బేరం ఆడందే తీసుకోదు. ఊ— తీసుకెళ్లు."

"అయ్యో, నీ చెయ్యి పడిపోనుగదే. చేతిలోకి ఏమైనా వచ్చిందటే."

"............................"

"గింజలు ఊరికేనే ఒళ్లో పోసేవరకు – వీళ్లకేమీ లెఖలేకుండా ఉంది. గోసిగిత్తో దోసెడుగింజలు తెచ్చిపోశాను దీని మొఖాన్ని."

"లేదులే తల్లీ, శానాపెట్టాను."

"ఏమిటే? ముష్టిపెట్టినట్టు పెట్టుతున్నావు. చాల్లే. నీకూర నీవు తీసుకోని నాగింజ లిల్లా నాకియ్యి."

"లేదులే అమ్మా. కోపం చేయబోకమ్మా."

"ఏం నడమంతర పాడుదానివే. నీదగ్గరే ఇంత శాణీతనం ఉంటే ఇక మాబోటివాళ్లదగ్గ రెంత ఉండాలో అనుకొంటా. ఇందాకటినుంచి చూస్తూన్నా. — వేస్తున్నట్టుగానే వట్టిచెయ్యి దులుపుతుందిగాని చేతులోకి ఆకేరాదు. దీనిశాణీతనం మండిపోను."

"అబ్బబ్బ. మాఅమ్మ పొద్దస్తమానులూ కొసురు తూనే ఉంటుంది. దిక్కులేనిముండ ఎట్లా బతకాలో అనేనా లేదు మా అమ్మకు."

"నీ నవ్వు నిర్మాలంగానూ. న వ్వేందుకే?"

"అమ్మా, తొడుక్కోను రవికె లేదు. నీ చెమటకు మాసింది ఓ పాతరవికె పారెయ్యమ్మా. నీకు రోజూ కరివేపాకు తెచ్చిపెడతా. అమ్మ అమ్మ."

"మీకు చీరెలూ, రవికెలూ సారి పంచిపెట్ట డానికి మాకేమీ జమీలు లేవు."

"అమ్మ! అమ్మ! మొన్ననే బిడ్డను కన్నా. బాలింతరాలిని. వీధినబడిపోవాలంటే సిగ్గవుతోంది. నీకు దణ్ణంపెడతా. ఒక్కపాతరవికె పారెయ్యమ్మా. చూడు, నీకు రోజూ కరివేపాకూ, పొన్నగంటాకూ తెచ్చిపెడతా తల్లీ."

"ఇప్పుడు నాదగ్గర ఏమీ లేవే. న న్నెట్టి వాగించకు."

"ఎన్నాళ్లనుంచి అడుగుతుండా తల్లీ?"

"అడిగితే ఇక్కడ సిద్ధంగా ఉండొద్దూ?"

"నీ దయ తల్లీ. ఏంచేసేది. మమ్మ ల్నిట్లా పుట్టించినందు కనుకోవాలి."

అని అనుకొంటూ ఆకుకూరలవ్యాపారంలో ఆర్జించి జీవించే ఆ ఆడపడుచు వెళ్లిపోయింది.

## 3

"అమ్మా! ఉట్లూ గంపలూ బుట్టలూ కావాలా?"

"......................"

"ఉట్లు అమ్మా ఉట్లు. గంప లక్కరలే?"

"ఎట్లా ఇస్తావు?"

"నీ ఇష్టంకాడికి తీసుకో అమ్మా, అడిగే దేముంది. గంప తవ్వెడుగింజల కిస్తా."

"ఇక నేం, సంసారాలు చేయనక్కర్లేదు. చాల్లే ఇక వెళ్ళండి. ఈ ఎరకలముండలికి దురాశ."

"అమ్మా, పోబోకమ్మా, ఎట్లా తీసుకొం టావో చెప్పరాదా అమ్మా."

"గింజలంటే మీా కేం లెఖలేకుండా ఉందే."

"ఈ గంప కావాలా? ఆ గంప కావాలా?"

"నా కిదే కావాలి. ఎద్దుకు దాణా పెట్టుకోను గంపలేక ఇబ్బందిగా ఉంది. ఇదే తీసుకొంటా."

"దీన్ని తవ్వెడుగింజల కడిగితే ఇవ్వలేదమ్మా."

"సరే: ఇంకా ఇక్కడ జాస్తీ పెడతారని వచ్చావుకాబోలు పాపం."

"నువ్వెంతకు తీసుకొంటావు చెప్పమ్మా?"

"సోలెడు గింజల కిచ్చి పో."

"కడుపు నిండదు తల్లీ.—"

"అయితే పో. ఉట్లు ఎట్లా ఇస్తావు?"

"ఒక్కొక్కటి మూడుసోలల గింజలకి తక్కువ లేదు."

"మీకేం లోకం కిందూమీదూ తెలియడం లేదే. నోటికి వచ్చినంత ఖరీదులు చెప్తున్నారు."

"ఎన్ని తీసుకొంటావమ్మా?"

"బేరం కుదిరితే ఒక ఉట్టీ, ఒకగంపా తీసుకోవాలనే ఉంది: అయినా మీ ఎరకలవాళ్లతో బేరం, ఎముకలు కొరుక్కు తింటారు."

"అయ్యో: తల్లీ, అడుక్కోను వస్తే ఆసాములు ముష్టి పెట్టకుంటే. ఇట్లాంటివేనా చేసుకొనకపోతే ఎట్లాగమ్మా కడుపులోకి గంజి వచ్చేది? — మీరు మా రాజులు."

"సరేలే: గంప సోలెడుకూ, ఉట్టి మూడు అర సోలలకూ ఇస్తావా ఇవ్వవా?"

"కడుపు నిండదు తల్లీ."

"సరే పొండి, ముష్టిముండల్లారా! మీతోనే ఊరేగుతోందా ఏమిటి లోకం.— పనిలేదులే పొండి."

"పోబోకమ్మా, కోపంచేస్తే ఎట్లాగమ్మా?"

"మీతో సమానంగా నే నీ గుంజిళ్లు పెట్టలేను. ఆకాడి కిస్తే ఇవ్వండి లేకుంటే పొండి."

"సరే: తీసుకో అమ్మా: నీకసువు చల్లంగా ఉంటే అంతేచాలు మాకు."

"..................."

"అదేందమ్మా: గింజల నిండా ఇంతదుమ్మూ, ఇంతపొల్లూ ఉంది: మంచిగింజలు పెట్టమ్మా."

"అయ్యో: ఇదేం పొయ్యేకాలమే మీకు. ముత్యాలవంటి గింజలు తెచ్చి పోస్తే — నమ్మింటావు: ఛీ! మీతో బేరంచేయడమే బుద్ధితక్కువ."

"అమ్మా: నువ్వు కొలిచేది సరిఅయినదో లేనా?"

"ఇదిగో, నా కాట్టే కోపం తెప్పించబోకు. నేను సరిఅయిన దాన్ని కాను: మీకేమైనా కళ్లు దించుకొని పోయినాయా ఏమిటి? ఈనాడు మీకే కొత్తగా కొలుస్తున్నానా? పిచ్చసోలలతోనూ, పిచ్చతవ్వలతోనూ కొలవడం నాకు చేతగాదు.—"

"సరే: ఇయ్యమ్మా."

"..................."

"అమ్మా! చంటిబిడ్డ ఒడిలో ఉండాడు.— నిన్నటినుంచి కూడులేక పా లెండిపోయినై. వీణ్ణి

మెడలో తగిలించుకొని తిరగలేకుండా ఉన్నాను. శోష వస్తోంది. ఒక్కపిడచ అన్నంపెట్టమ్మా: చచ్చి నీకడుపున పుట్టుతా.''

"సరే: పుట్టక పుట్టక నీవంటివాళ్లే పుట్టితే మేం తరిస్తాం.— ఇప్పుడు నీకోసం మేం అన్నాలు వండి పొయ్యలేను. వెళ్లండి.''

"అమ్మా, అమ్మా, దణ్ణంపడతా తల్లీ. నీకు పున్నెం ఉంటుంది.''

"ఈవెధవగోడు నే పడలేను. కూటికిలేని వెధవలకీ సంతానం ఎందుకో. పొండి పొండి.''

"చంటిబిడ్డమాడున పెట్టుకొంటా — ఇంత ఆముదంచుక్క చేతులో వెయ్యమ్మా. పోతాం.—''

"అబ్బబ్బ: ఈ ఎరకలముండలు మొండి ముండలు. పట్టుకొంటే పిశాచాల్లా వదలరు. ఇప్పుడు నీకోసం చము రెక్కణ్ణుంచి తెచ్చేదే?''

"అమ్మా, అమ్మా, చంటిబిడ్డ. చూడమ్మా మాడు ఎండిపోతోంది — ఒక్కబొట్టు పెట్టమ్మా.''

"ఇప్పుడు నాకు చెయ్యి ఖాళీలేదే. పొండే'' అంటూ చేతిలో గంపా, ఉట్టీ తీసుకొని వీథితలుపు దగ్గరగా నెట్టి — లోపలికి చిటచిట లాడుతూ వెళ్లిపోయింది సరోజనమ్మ.

"అయ్యో : ధర్మాత్మురాలు — మా అమ్మ — నూరేళ్లు నిండాలి." అని దీవిస్తూ ఎరుక లమ్మలు వచ్చిన దారినే పోయినారు.

౪

శేషశాయికి బీదాసాదా అంటే అపరిమితమైన జాలీ, దయాను. తిర్యగ్జంతువులయిన పశుపక్ష్యాదులకే గాక, అచరములైన వృక్షాలకయినప్పటికీ చీమకాటంత బాధ కలుగగా చూచి విలవిల్లాడే కుసుమకోమలమైన హృదయం అతనిది. ఇక మానవజన్మ ఎత్తిన ప్రజలయొక్క — అందులోనూ దరిద్రులయొక్క — కష్టపరంపరలు చూచినప్పు డతనిమన స్సెటులు క్షోభించునో అది ఊహింపదగిన విషయమేగాని వర్ణించవలసినదిగాదు.

తలిదండ్రులిద్దరూ గతించిన పిదప, తమ అభిరుచులకీ, ఆశయాలకీ పొత్తు కుదరనందున, శేషశాయీ, అతని అన్నా వెంటనే వీభాగాలు చేసుకొని స్థిరచరాస్తులు చెరొక ఇరవైవేలరూపాయల కిమ్మతుగల ఆస్తిని పంచుకొన్నారు. ఇల్లుమాత్రం అంతా అన్నభాగానికే వదలి శేషశాయి విడిగా మరొక ఇల్లు క్రొత్తగా కట్టించుకొన్నాడు ఓ మూడువేల రూపాయలతో.

అంత ద్రొల్లాడి సంపాదించుకొంటేనేగాని జరగదన్న దిగులు లేదు. అదిగాక ఇంట్లో మట్టసమైన

సంసారం — తనూ, సరోజినీ, ఓపదేళ్లకుర్రాడు రంగ శాయీని. రంగశాయితర్వాత ఓ ఆడపిల్ల పుట్టి రెండేళ్లు పెరిగిందిగాని నష్టమైపోయింది పాపం. మళ్లా సరోజిని నీళ్లు పోసుకోలే దింతవరకు. తండ్రి సంపాదించిపోయిన ఆస్తి ఎంతవున్నా, ఉద్యోగం పురుషలక్షణంకాబట్టి ఊరికే కూర్చునిచేసే దేముంది అని అనుకొని తనకంత ఇష్టంలేక పోయినా కట్టినబోర్డు విప్పకుండా జన్మస్థానమైన నెల్లూరు లోనే రోజూ కోర్టుకు పోతూ వస్తూఉన్నాడు - ప్రాం గ్నాడు నియోగివంశంలో ప్రభవించిన మన శేషశాయి.

నిజంలో తన తెలివికీ, తన చదువుకీ, తన చాక చక్యానికీ నెలకు రెండువందల రూపాయల సంపాదన ఓ లెఖలోది కాదు. రెండువందలు రొఖంగా చేతికొచ్చి ఇంకా ఓ వందరూపాయలుదాకా వసూలు కావలసిన పద్దులు అక్కౌంటుమీద ఉంటే ఏంగాక - కాంగ్రె స్సనీ, సోషలిజమనీ, ఉపన్యాసాలనీ, హరిజనులనీ, మహానాడులనీ - ఇట్లాంటి ఇతర వ్యాసంగాల్లో దిగకుండా నలుగురులాగా, తనూ, అంగడిలో కోమటి గల్లాపెట్టె నంటిపెట్టుకొని కూర్చున్నట్లు అంటిపెట్టుకొని నిలబడ్తే ఉంటే ఈపాటికి లీడింగు అడ్వొకేటు అని అనిపించు కోక పోయాడా? కాని చిన్నప్పటినుంచీ అతనిమతమే వేరు - అబద్ధం సోకిన అలజడి తగిలితే ఆ కేసు అట్లా అంటుకోడు - లక్షవచ్చుగాక, లక్ష పోనుగాక. భగవంతు డిచ్చినదానితోనే తృప్తి, ఆనందమూనూ. అందువల్ల

ఇంకా ముప్ఫైఅయిదు ఏళ్లయినా పూర్తిగా నిండని పిన్న వయస్సు అయినప్పటికీ, ఇతని విముఖత్వానికి తోడి ప్లీడర్లలో కొంతమంది ఆశ్చర్యపడుతూ ఉన్నా, మరి కొంతమందిమాత్రం సంతోషిస్తూ, ఇతనిని ప్రోత్సాహ పరుస్తూ, బారులో మట్టుకు తాము లీడర్లు అని అనిపించు కొంటున్నారు.

తా నెంతవిజ్ఞానవంతుడైతేమాత్రం ఏం - సహో జని కాతని హృదయంలోని జ్యోతి దృగ్గోచరంగా లేదింకా. ఇంగ్లీషు చదువు లేకపోయినా తెలుగులో చక్కని పాం డిత్యంమాత్రం కద్దు ఆమెకు. భార్యాభర్త లిరువురూ అఖండమైనప్రేమతో ఒండొరులను ప్రేమించుకొం టారు. అదిగాక ఈశ్వరసృష్టిలో ప్రతిమానవునికీ, ప్రతి జీవికీ - మృగానికీ పక్షికీగూడా స్వేచ్ఛ ఉండితీరాలని వాదించే శేషశాయి తనభార్యకుగూడా ఆమె కోరిన స్వేచ్ఛ ఇవ్వడంలో ఆశ్చర్యం ఏముంటుందిగనుక! కాకపోయినా ఎంతస్వల్ప విషయాల్లో అయినప్పటికీ,— సంసారానికి సంబంధించిన విషయాల్లో ఆమెకత్తి కెదురు తగిలిందంటే ఓర్చుకొనేఘటం కాదు ఆమె. కొంచెం ముక్కుమీదకోపం ఆమెకు. అందులోనూ మొదటినుంచీ ఇంట్లో అత్తగారి పోరూ, ఆడబిడ్డలపోరూ లేనిసంసార మేమో, ఆమె అవిచ్ఛిన్నంగా స్వారాజ్యం ఏలుతోంది తనఇంట్లో.

అట్లాఅని ఓదూబరామనిషికూడాకాదు పాపం. పొద్దుపొద్దు చెప్పొచ్చినపుడు ఆమెను చెప్పి మరొకరిని చెప్పాలి. తనభర్త ఇంతస్వేచ్ఛ ఇచ్చాడుగదా అని ఈ కాలపువాళ్లలాగ నెత్తి నెక్కి తొక్కేరకమూ కాదు: భర్తఅంటే పంచప్రాణాలు ఇస్తుంది - అస్థులూ మాంసమూ అరిగిపోయేటట్టు చాకిరీ చేసి భర్తను సుఖపెట్టుతుంది. కాని——

౫

ఆదినం ఆదివారం. కోర్టు లేకపోబట్టి ఉదయాన్నే స్నానంఅయినతర్వాత కాఫీ తీసుకొని, బయట తన ఆఫీసుగదిలో పడకకుర్చీలో పండుకొని శేషశాయి 'స్వరాజ్య' పేపరు చదువుకొంటున్నాడు. ఆదివారం అయినందువల్ల గుమాస్తాగాని, పార్టీలుగాని అప్పటికింకా రాలేదు.

తనగదికెదురుగానే వీధివసారా. తను పడుకొన్న చోటునుండి చూస్తే వసారాలో వస్తూ పోతూఉన్న మనుష్యులు కనిపిస్తూనేవుంటారు. పేపరు చేతిలోకి తీసుకొన్నదిలగాయతు వసారాలో ఉదయంనుంచీ సరోజిని చేస్తున్న కూరగాయలబేరాలు శేషశాయి నిశ్చలమైన దృష్టితో గమనిస్తూనే ఉన్నాడు. చూచినకొద్దీ తనలో తాను క్రుంగిపోతున్నాడు. తాను అధిష్ఠించిన పడక కుర్చీ పాతాళంలోనికి పోతున్నట్టుగా అతనికి తోచింది.

పోనీ, ఆకూరగాయలబేరాల్లో తాను కలుగచేసుకో రాదా అని అనుకొంటే, సరోజిని స్వాతంత్ర్యభంగానికి ఓర్వదే! ఇదివరకొకటి రెండుసార్లు ఇట్లాగే "స్వల్పంలో బేరాలు చేయబోకు" అని సూక్ష్మంగా అనేవరకు "మీకు తెలియదు ఊరుకోందురూ. మీ కెందుకీ ఆడంగి గొడవ" లని కసురుకొంది. అప్పటినుండి తా నిట్టివిష యాల్లో చటుక్కున జోక్యంపుచ్చుకోవడానికి సందే హిస్తూఉంటాడు శేషశాయి. అదికాక అతనికోరిక వేరు. తాను బీదలయెడల ఏవిధంగా కరుణాసముద్రు డయి, ఆపన్నులై వచ్చినవారికి లేదనకుండా సాయప డుతూ సంతోషిస్తూ ఉంటాడో అట్లాగే సరోజిని కూడా — తనంతటతాను కరుణార్ద్రహృదయయై, బీదలయెడ సానుభూతి, కరుణ, దయ గలిగి వర్తిస్తూ, లోకోపకారంచేస్తూ జీవించుతూఉండగా, తాను చూచి సంతోషించవలెనని అతని ఆశయం. కాని ఆ భూత దయా, పశ్చాత్తాపమూ ఒకరు నూరిపోస్తే అలవడే సుగుణములా? ఆ ప్రేమ, ఆ కరుణ సహజంగా లోపలి నుండి పుట్టుకురావలె.

శేషశాయి కిదే దుఃఖం. ఎంత శ్రమపడినా తన భార్యమతములో మార్పు కలుగలేదు. మొగవాడు ఎన్నిటికని కూరగాయలదగ్గరకూడా భార్యను కాదని తాను కలుగజేసికొంటాడు? ఒకవేళ కలుగజేసు

కొన్నా "ఆయన ధర్మరాజు. ఆవిడే గయ్యాళి" అని లోకు లనుకొంటారేమో అని అతని భయం.

ఆ దినం జరిగిన చర్యలు సామాన్యంగా ప్రతి ఇంటా నిత్యమూ జరుగుతూనేఉంటాయి. భాగ్య వంతులకీ, దరిద్రులకీకూడా పరిపాటి అయిపోయింది. అయినప్పటికీ తనభార్య ఆ విధంగా ప్రవర్తించగా చూచి శేషశాయిమనస్సు వ్యాకులపడింది. పేపరు చదవాలని ఒకటి రెండు పర్యాయములు ప్రయత్నిం చాడుగాని మనస్సు నిలకడ చిక్కలేదు. "ముక్కాని బేరం మూడుజాము లయింది —", "అమ్మా బాలింత రాలిని. వీధినబడిపోవడానికి రవిక లేక సిగ్గవుతోంది", "అమ్మా అన్నంలేక పాలెండిపోయినవి. ఒక్కపిడచ అన్నం పెట్టమ్మా"— ఈ వాక్యాలే చెవుల్లో గింగురు మంటున్నవి అతనికి.

౬

"పదిగంట లయిందే సుబ్బీ. ఏంపనే నీది. ముందు లోపలిగదీ, సావిడీ తుడిచిరా. ఎబ్బే: వట్టి ఏ బ్రాసిముండ లీ యానాది ముండలు."

"వస్తుండా నమ్మా! అయిపోయింది వస్తుండా. ఇయ్యేళ పనే జరగడం లేదమ్మా!"

"కానీ కానీ. కోర్టులేకపోయినా భోజనానికి పొద్దోతే అయ్యా ఉండలేరు. ముందు నా కా బాణలి కడిగి ఇయ్యి."

"....................."

"తడిగుడ్డలు పిండి ఆరవేశావా?"

"వేస్తుండా నమ్మా."

"చూడు. పని అయింతర్వాత ఎద్దు తొక్కిన పేడ తీసి, ఇవ్వేళ, పిడకలుచేసి మరీపో."

"....................."

యానాదిసుబ్బి సరోజినిదగ్గర పనికి కుదిరి ఆరునెల్లయింది. ఏడో నెల జరుగుతోంది. సరోజిని కాపురానికి వచ్చింతర్వాత ఇంతకాలం అతుక్కొని నిలిచిన యానాది ఈసుబ్బి ఒకతే ఇంతవరకు. సరోజిని పెట్టే పోరూ, కష్టమూ పడలేక వచ్చిన యానాదులు ఓ రెండు మూడునెల లుండేవరకు నిభాయించుకోలేక వెళ్ళిపోవడమూ, కట్టుకోను గుడ్డ లిస్తానని, రవికె లిస్తానని, అన్నం పెడతానని కొండంత ఆశలుపెట్టి పిలిచి ఏర్పాటు చేయడమూ, ఈమెరవ్వారట్టూ పడలేక వాళ్ళు పారిపోతూఉంటే వాళ్ళని పిలిపించి, చెడదిట్టి, వాళ్ళ కదివరకే రవికేనా, ఏ గుడ్డయినా ఇచ్చిఉంటే దాన్ని మళ్లీ గూబలు నులిపి తీసుకొని – ఇంట్లోపెట్టి – మళ్లీ రాబొయ్యే యానాదిదాని కివ్వడమూ – ఇట్లా జరుగు

తోంది ఇంట్లో యానాదిదాని వ్యవహారం. సుబ్బి కొంత పెద్దవరసలో మనిషి కాబట్టి పాపం మొదటినుంచీ వాళ్లు వంచి పనిచేసుకొని పొయ్యే అలవాటుకొద్దీ ఎవ్వరూ మెప్పించలేని సరోజన్ని తానుమాత్రం మెప్పించి, రోజూ అన్నంపెట్టే బదనాయం లేకపోయినా - నెల కాగూపా యిపావలా ఉద్యోగంతోనే తృప్తిపొంది కాలం గడుపు కొంటోంది పాపం.

ఉదయం సరిగా 7 గంట అయ్యేవరకు వస్తుంది. పదిన్నరగంటదాకా పనిచేస్తుంది. ఇంటికి పోయి మళ్లీ మధ్యాహ్నం 3 గంటలకల్లా వస్తుంది. సాయంత్రం 6 గంటలవరకూ పనులుచేసి పోతుంది. చదువుకోక పోయినా, గంటలు తెలియకపోయినా అలవాటు చొప్పునగాబోలు పిడుగులుపడే వర్షం కురుస్తున్నాసరే, ఇంటికాడ తనపిల్లలకి జబ్బులుచేసి తలక్రిందులైనాసరే, ఎన్ని ఆటంకాలున్నాసరే, ఉదయం 7 గంటగున కొట్టగా నే సుబ్బి తనడ్యూటీకి హాజరు కావలసిందీ, తనపని చేయ వలసిందీని. తాను వచ్చేటప్పటికి అసలు తలుపు లింకా తెరవకుండా నిద్రమంచంమీాదే ఉంటారు సరోజినీ శేషశాయిలు. బయట వాకిలి చిమ్ముతూండే సుబ్బి చేతిలోని పొరకకట్టధ్వనులతోనే తరచు శేషశాయికి మెలుకువరావడం. "దీని తస్సాగొయ్యా. ఏరోజు చూచినా, ఇది ఇంత కరక్టుగా వేళ కెట్లా వస్తుందిరా.

ఎంత తంటాలు పడ్డా పదకొండుగంటలకి మేం కోర్టుకు సరిగ్గా అందుకోలేమే" అని శేషశాయి ఆశ్చర్య పడుతూ నిద్ర లేవడమూ, కాలకృత్యాలు తీర్చు కోవడమూ జరుగుతూ ఉంటుంది. ఇట్లా కంటి సంజ్ఞ తోనే ఇంటిపనులన్నీ అతిజాగరూకతతో చేస్తూ ఉన్నప్ప టికీ సరోజిని సుబ్బినిగూడా తరచు ఏవో వంకలు పెడుతూ ఇగ్గులాడిస్తూనే ఉంటుంది. అయినా కడుపార పదిమందినిగన్న బిడ్డలతల్లికాబట్టి తనజవాబుదారీ చక్కగా గ్రహించుకొని, తనపని మెలకువతోనూ, తెలివితేటలతోనూ చేసుకొంటూ కాలం గడుపుతోంది సుబ్బి.

పదిన్నరగంట అయింది. రోజూ చేయవలసిన పనులన్నీ పూర్తిచేసుకొంది సుబ్బి. ఇంటికి పోతూ,

"అమ్మా!"

"ఏమే?"

"ఒక్కసారి బయటికి రా అమ్మా!"

"ఏమే?"

"నాలుగురోజులు కాస్త ఇబ్బంది పడాల సొచ్చిందే."

"ఎమిటే, ఏవూరైనా పోతావా ఏమిటి?"

"నీవుగనక దయఉంచితే నీపుణ్యాన్న ఇంత అన్నం తింటాం."

"ఏం వచ్చింది ?"

"వరికోతలమ్మా."

"అయితే?"

"పైరు పంటకొచ్చింది. కోతలు పట్టారు. కూలి వాళ్లకోసరం రెళ్లు తిరుగుతున్నారమ్మా."

"అయితే ఇంటిపనులన్నీ విడిపించి వరికోతకు పోతానంటావా ఏమిటి ఇప్పుడు ?"

"అమ్మా, రోజుకు శేరుబియ్యం, అరణాలు డబ్బులూ ఇస్తారమ్మా."

"ఇష్టంలేకపోతే మానుకొని లేచిపోరాదూ?"

"పదిరోజులకల్లా కోత లయిపోతాయమ్మా. మళ్లా వరినాటురోజులు, అయిదారు నెల్లదాకా అడగను తల్లీ."

"ఉద్ధరిస్తావు."

"ఏమో: పిల్లలూ మేమూ ఇంత బతుకుతాం. అదును తప్పితే మళ్లా వచ్చేదికాదుకదా అమ్మా."

"అయితే ఇంటిపనులు నీతాత చేస్తా డనుకొన్నావా, నీముత్తాత చేస్తా డనుకొన్నావా ?"

"పిల్లని పంపిస్తానమ్మా."

"ఏ పిల్లని ?"

"నా పిల్లనే."

"ఎవరు? ఆ బొడ్డూడని లంజెనా. సడేలే: మాకు పిల్లావద్దు జెల్లావద్దు."

"................"

"నాకు ఇంట్లో పనిచేసేమనిషి లేకుంటే క్షణం జరగదు. మీయానాదివాళ్లకున్న రోగం యిదేగా. ఉన్నన్నాళ్లూ, ముండలు చెడతినేదిన్నీ, ఒంటికి పొగ రెక్కొంతర్వాత ఉడాయించేదిన్నీ."

"నే నట్లాంటిదాన్ని కాదమ్మా. ఒక్క పది రోజులు గడుపుకో తల్లీ. పోనీ జీతం పట్టుకోలే."

"జీతం పట్టుకుంటే పను లెట్లా జరగాలెనే?"

"పిల్ల అన్నిపనులూ చేయగలదమ్మా. పోనీ రెండురోజులు చేయించుకొని చూడు. నీకు అందు బాటులేకుంటే అట్లాగే నేను వస్తాలే. పన్నెండే ళ్లుండయ్యమ్మా దానికి. మీదటికి దాన్నికూడా కూలి పనికి పంపించాలని ఉండా."

"పదిరోజులు కాదుగదా, పదినిమిషాలు కూడా నీకు శలవు ఇవ్వడానికి వీలులేదు. ఇష్టమైతే ఉండు, కష్టమైతే వెళ్లు."

కొంచెంసేపు ఏమీ జవాబు చెప్పలేక ఊరు కొంది సుబ్బి. అలవాటయిన ఇల్లు - చటుక్కున చిన్న పిల్లలా వదులుకొని ఎట్లా లేచిపోగలదు పాపం.—

"పోనీలే అమ్మా నీదయ. నీవు పొమ్మంటే నే పోతా. వద్దంటే పోనులే. కోప్పడబోకు. ఇంటికాడ మొగాడు నిన్నడిగి రమ్మంటే - పోనీ ఈ పదిరోజులూ చెరొక పావలాడబ్బులూ సంపాదించుకొంటే పిల్లలకి దిగులుండదని అనుకొని అడిగాను తల్లీ. కోపగించుకో బోకు."

"లేదులే. మళ్లా పెండలాడేరా. మధ్యాహ్నం ఎద్దుకి ఉలవలు విసరాలి. నిమ్మకాయ ఊరగాయలోకి మిరపకాయలు దంచాలి. చాలాపను లున్నాయి."

"వస్తాలే అమ్మా. ఒక్క బేడడబ్బు లుంటే పారెయ్యమ్మా, ఈ నెల జీతంలో పట్టుకొందువుగాని."

"డబ్బులా?"

"ఒక్క బేడ ఇయ్యమ్మా. ఈ నెలజీతం - కొరవ రూపాయిబేడే యిద్దువుగానిలే. ఇంటికాడ కూటికిలేవు. మా యానాదోడికి నిన్న రాత్రంతా జరంకాసిపోసింది. ఈ పొద్దు కూలికి పోలేదు. ఒక్క బేడ ఇస్తివా ఈ పూట రాగులు కొనుక్కొని ఇంతగంజి కాచి పోస్తా పిల్లలకి."

"నీకోసం నే నేం బేడలూ, మాడలూ మూట గట్టుకోలేదు, తెలుసునా, నీ ఉద్యోగానికితోడు అడ్వా న్సులుకూడానా? ఒకటోతేదీ వస్తేగాని డబ్బులమాట ఎత్తకు."

"అమ్మా! అమ్మా! రాత్రి ఇంటిల్లిపాదిమీ పస్తు పండుకొన్నాం. నీవు దయ ఉంచకుంటే పిల్లలు చస్తారు."

"నమ్మారికే పదే పదే వాగించకే. పొయ్యి మీద కూర మాడిపోతోంది."

"అమ్మా! ఇవ్వేళ ఇంత అన్నమేనా వేశావు కాదు తల్లీ అంటల్లో."

"రాత్రి అన్నం మిగలందే ఏంచేయమంటావు? నీకోసం ప్రతిరోజూ సమారాధనలు జరపమంటావా ఏమిటి? అదిగాక నీకు రోజూ అన్నం పెట్టే ఏర్పాటు లేదే? నెలకు రూపాయి పావలాడబ్బులు మాత్రం ఇచ్చేది ఖరారు. అన్నం మిగిలినరోజు పెడతా, లేనిరోజు లేదు. అన్నంబదనాయం లేదుగా."

అంటూ సరోజిని వంటఇంట్లోకి పోయింది.

సుబ్బి — అన్నంకోసం రోజూ తెచ్చుకొంటూ ఉన్న ముంత - తెచ్చిన ముంత తెచ్చినట్టుగానే కుడి చేత పట్టుకొని ఎడంచేత్తో తల గోక్కుంటూ, ఇంటికి పోయింతర్వాత తన దృష్టిలో పడే దృశ్యం అక్కడనే దృగ్గోచరంకాగా, అడుగుసాగక ఏమి చేయడానికీ తోచక ఒక్కక్షణం నిలబడి నిట్టూర్పువుచ్చి ఇంకో రెండడుగులు ముందుకు బలవంతాన్న వేసి - దొడ్డిలో నుండి పడమటితట్టు సందుగుండా వీధివాకిట్లోకి పోతూ -

ఆఫీసుగది కాడికి వచ్చేవరకు - కిటికీగుండా పంతులు శేష శాయి 'పడకకుర్చీ శాయి'యై ఏదో చదువుకుంటూ ఉండగా చూచి, పోనీ తన బాధ పంతులుతో చెప్పకొందునా అని అనుకొని రెండడుగులు వేసేవరకు - "అమ్మ య్యో! అమ్మ బతకనియ్యదే - ఎప్పుడూ పంతులుతో నేను పలకనేలేదే - నావల్లగాదు" అని నిస్పృహ చెంది ఈ ప్రయత్నంలో పుట్టిన ఆవేదనతో గుండె కొట్టు కోవడంలో గలిగిన వేడివల్ల - అదివరకే ఏకాదశీవ్రతా చరణదీక్షలో సత్తువ తగ్గిన తన అవయవములు మరింత పటుత్వం తప్పినందున బలహీనురాలై పదిమంది బిడ్డల్ని కని ఏభయ్యోపడిలో వాడుకువలె రక్తమాంసాదు లెండిపోయి - ముడతలుపడిన చర్మంతోనూ, కట్టెవలె బిగుసుకున్న ఎముకలు కనుపించే దేహంతోనూ, తిని పారేసిన తాటిముంజెలోని కళ్ళవలె గుంటలుపడ్డ కళ్ళ తోనూ, స్నానసౌభాగ్యముగాని రాచుకోను చమురు లేనందున తైలలేపనముగాని, నెలలతరబడిగా ఎరగ నందువల్ల అట్టకట్టిన తలవెంట్రుకల చుట్టతోనూ చూసే వాళ్ళకి దరిద్రదేవతవలె ప్రకాశిస్తూ - అదొక విధమైన స్థితిలో ప్రాణాలు ఉగ్గబట్టి - పంచభూతాత్మకమైన తన దేహాన్ని బలవంతాన్న ఈడ్చుకొంటూ, ఈడ్చుకుంటూ సుబ్బి నాలుగుఫర్లాంగుల దూరంలో ఉన్న తనగుడిసె కాడికి ఒక అరగంటసేపటికి ఘటం చేరవేసింది.

# ౭

అతనిబాధ అతనిది: శేషశాయి కీగొడవ ఏమీ తెలియదు పాపం. ఉదయం తాను చూచిన దృశ్యమే చిత్తములో హత్తుకోగా - అమూలాన్న గలిగిన విచారం వల్ల ఓగంటా గంటన్నరసేపు దుఃఖించి, కొంత ప్రయత్నం మీద ఊరట కల్పించుకొని నిట్టూర్పువిడిచి - మరల పేపరు చదువుకొంటూ కుర్చీలోనే కూర్చొనిఉన్నాడు శేషశాయి. ఈలోపల గుమస్తా ఓసారి వచ్చి ఏవో కొన్ని కాగితాలమీద సంతకం చేయించుకొని వెళ్ళి పోయాడు.

ఇంట్లో వున్న శేషశాయికే సుబ్బిబాధ తెలియనప్పుడు ఇక వీధిలోవారికి తెలియకపోవడంలో ఆశ్చర్యం ఏ ముంటుంది?

వంట అయిందని సరోజిని చెప్పడంతోనే శేషశాయి లేచి భోజనంచేసి, తాంబూలం వేసుకొని ఎండవేళ కాస్సేపు నిద్రపోయాడు. నిద్ర లేచింతర్వాత ఏవో కొన్ని జాబులు పోస్టుకు పోవలసినవి వ్రాసుకొంటూ ఆఫీసుగదిలో కూర్చున్నాడు. మూడుగంటలవేవరకు 'ఫలహారంచేతురుగాని ర'మ్మని సరోజిని పిలిచింది. సరేనని లేచి పడమటిసందుగుండా దొడ్లోకి కాలు ముడుచుకోను పోయేవరకు, ఉత్తరపుతట్టు వసారాలో ఎప్పుడు వచ్చిందో సుబ్బి వచ్చి క్రింద గోతం పరుచుకొని,

దానిమీద తిరగలి పెట్టుకొని వసారగోడకు ఓఅడుగు దూరంలో దక్షిణపుముఖంగా కూచుని, ఎడంకాలు ముడుచుకొని, కుడికాలు సాచుకొని ఎక్కుపెట్టిన ఉండీలుబద్దవలె ముందరికి వంగిపోయిన నడుముతో, ముందుకీ వెనక్కీ ఊగిసలాడుతూ, ఉలవలు విసురుతూ కూర్చుంది. "అరే! ఇంత కరక్టుగా ఇది డ్యూటీకి తప్ప కుండా వచ్చిందే" అని మనస్సులో ఆశ్చర్యము కలుగగా, ఒక్కక్షణం నిదానించి చూచేవరకు తిరగలి పైరాయి కొంతకష్టంమీద తిప్పుతూ ఉన్నట్టు అతని మనస్సుకు తట్టింది. అవశిష్టం తీర్చుకొని, బావిదగ్గర కాళ్లూ చేతులూ ప్రక్షాళనచేసుకొని పైతువాలుతో చేతులు తుడుచుకొంటూ వంటయింటిగడప ఎక్కి లోపలికి పోతూఉండగా సరోజిని అప్పుడే ఇల్లు చిమ్మి పీట వేయబోతోంది.

"ఇప్పటికి రెండుమూడు నెలల్నుంచి చూస్తున్నాను. ఎప్పుడు చూచినా సుబ్బి ఆ గుడ్డే కట్టుకొని ఉంటుంది. పాపం దానికి కట్టుకోను రెండోగుడ్డలేదు కాబోలు. దాన్ని చూస్తే నాకు దుఃఖంవస్తోంది. పాత చీరెల్లో ఏదో ఓగుడ్డ దానిమొఖాన్ని పారెయ్యగూడదటే."

"......................"

"అబ్బ! కళ్ళబడకపోయినా బాగుండును ఈ అవతారాలు. మళ్లా దానిచేతనే, ఆ మురికిగుడ్డలతోనే

ఇంటికి పాలూ, పెరుగూ, కూరలూ అన్నీ తెప్పిస్తావు. అసహ్యం అవుతోంది."

"........................."

"ఏదో పాతచీర ఒకటి చూచి దాని కిద్దూ."

"వచ్చి కూచుందురూ. దోసెలు చల్లారితే బాగుండవు."

"దానికో పాతచీర ఇస్తేనేగాని నా కేమీ సయించదు."

"ఇది మరీబాగుంది. తలచినపుడే తాతపెళ్ళిలా ఉంది."

"దీని కేమైనా లగ్నం కుదరాలా ఏమిటి?"

"అయితే మీ ఇష్టం వచ్చినట్టు చేసుకోండి. నన్నడగడ మెందుకు? మీకు తెలియనిచీర లేమున్నై? మీరే తీసి యిచ్చుకోండి, పాతదో, క్రొత్తదో నాకు తెలియదు."

"అంతేగాని నీవుమాత్రం నీచేత్తో యివ్వ లేవన్న మాట."

"ఇప్పు డంత తొందరేమి వచ్చిందండీ? మొన్ననే - ఆరునెల్లయింది - రాయివంటి చీర ఇచ్చాను. మళ్లా ఇంతలోనే ఇం కొకటా? దానికి లేకపోయినా మీకెందు కీ అనవసరపు గొడవలూ?"

అని ఏమేమో చెప్పబోయేవరకు వీధిలోనుండి "శేష శాయీ!" అని పిలుపు.

"ఎవరువారు?"

"ఏం చేస్తున్నావోయ్?"

"వస్తున్నా. రా, లోపలికి రా. ఇట్లా వచ్చి సావిట్లో కూర్చో."

అనేవరకు తోడి అడ్వొకేటు శ్యామలరావు చంకన టెన్నిసుబాటు పెట్టుకొని సావిట్లోకి వచ్చి కుర్చీలో కూచున్నాడు. సమయానికి వచ్చిన స్నేహితునికి భార్యాభర్తల తగవులు తెలియగూడదని - సరోజిని ఇచ్చిన జవాబులవల్ల లోపల కుతకుతలాడే హృదవేదనను - తెచ్చిపెట్టుకొన్న ముఖవిలాసంతో మరుగు పరుస్తూ, శేషశాయి శ్యామలరావు ప్రక్కనే కుర్చీలో కూచుని మాట్లాడుతూఉన్నాడు. ఇంతలో వీధిలోని ఆటలు చాలించి "అమ్మా! తినడానికే" అంటూ రంగశాయి వంటఇంట్లోకి పరుగుపెట్టేవరకు "పెడతానుండు" అని రెండుప్లేటుల్లో ఫలహారాలు పెట్టి శేషశాయికీ, శ్యామలరావుకూ చెరొకప్లేటూ ఇచ్చిరమ్మని లోపలినుండి సరోజిని రంగశాయిని పంపింది.

"ఇప్పుడే ఇంటిదగ్గర తిని వచ్చాను: ఆకలిలే" దంటూ విసుగుతోనే శ్యామలరావు బలవంతాన్న

లోపలి కెక్కిస్తున్నాడు ప్లేటులో ఫలహారాన్ని. కడుపు లోనూ మనస్సులోనూ బాగులేనందున శేషశాయి మాత్రం కొంచెం ఎంగిలిచేసి, సగంపైగానే ప్లేటులో దిగబెట్టాడు. టీ తీసుకొని అన్నాడు,

"ఇవ్వేళ క్లబ్బులో పాటకచ్చేరికి వస్తావా శేష శాయి?" అని.

"ఆహా."

"తప్పక రా: చాలాగొప్పపాట."

"ఎన్నిగంటలకేమిటి?"

"ఎట్లాలేదన్నా ఆరవుతుందిలే. ఆదివారం కాబట్టి నేను ముందుగా పోతేనేగాని టెన్నిసుసెట్టు దొరకదు: క్లబ్బులో కలుసుకొందాం" అంటూ శ్యామలరావు వెళ్లిపోయినాడు.

"ఏమండోయ్: ఇట్లా రండి: ఇట్లా రండి – తొందరగా రావాలి: అయ్యయ్యో!"

"......................"

"అయ్యయ్యో! తొందరగా రండీ: రావాలి, రావాలి."

"ఏమి?"

"ఏమిటండీ. సుబ్బి విసురుతూ విసురుతూ ఇట్లా విరుచుకొని కిందికి ఒరిగిపోయింది? ఇట్లా పడిపోయిం దేమిటండీ? పిలిస్తే పలకడంలేదు."

"అయ్యో పాపం! ఇట్లా పడిపోయిందే."

"ఏమిటో! ఇప్పుడు చూశానండీ. విసురుతూనే ఉంది."

"దీనికేమైనా జబ్బుందా ఏమిటి?"

"అబ్బే, లేదండీ! ఏడు నెలలుగా చూస్తున్నాను. ఎప్పుడూ ఇది ఇట్లా పడిపోలేదు. అయ్యో పాపం! ఎట్లాగండీ ఇప్పుడు?"

"డాక్టరును పిలుచుకొని వస్తానుండు."

"పిలిపించండి పాపం. చూడండీ, ముందు దాని మొగుడికి చెప్పి పంపండి. కాస్త పట్టుకోనైనా పట్టుకొంటాడు.—"

"నే పట్టుకుంటానులే."

"మీరు వద్దు. వాణ్ణి పిలిపిస్తురూ — అన్నట్టు మరిచిపోయాను. దీని మొగుడికికూడా నిన్నరాత్రి జ్వరం వచ్చి పడివున్నాడని చెప్పిందండి. పాపం. అయ్యో! ఎట్లాగండీ?"

"అయ్యో" అంటూ శేషశాయి సుబ్బికి సమీపంలోకి పోయి కూచున్నాడు. సుబ్బికుడిచేతిని బలవంతాన ఎత్తి నోటిదగ్గర పెట్టుకొని "దాహం దాహం" అని అర్థం అయ్యేటట్టు సంజ్ఞచేసింది.

"మంచినీళ్లు కావాలట. కాసినినీళ్లు తీసుకురా."

"అయ్యో పాపం! శోష వచ్చిందికాబోలునండీ. నిన్నటినుంచీ అన్నంలేదని పొద్దున చెప్పిందండీ పాపం. అడిగినపుడు ఆబేడ డబ్బులయినా పారేశానుగాను. పొద్దున్న అంట్లల్లో అన్నంకూడా మిగలలేదు ఇవ్వేళ. ఈపూటకూడా గంజిలేకుండా వచ్చిందిగాబోలు సన్నాసిముండ. చెప్పగూడదూ పోసీ, ఏమీ చెప్ప కుండా వచ్చి తిరగలి ముందేసుకొని కూర్చుంది."

"నీచదువు తర్వాత చదవొచ్చులే. ముందు ఇన్ని నీళ్లు తీసుకొచ్చి గొంతులో పోయి."

"చన్నీళ్లా, వేన్నీళ్లా?"

"గోరువెచ్చని నీళ్లయితే మంచిదే."

"తెస్తాగాని ముందు ఈలోటాలో చల్లనినీళ్లు దాని మొఖాన్న కొట్టండి. కొంత తెప్పిరిల్లుకుంటుంది."

"అయ్యో: మళ్లీ చూపుతోందే, దాహమట_ తొందరగా నీళ్లుతే_."

లోటాతో సరోజిని నీళ్లు తెచ్చేవరకు —— సుబ్బి నోరు తెరవగా శేషశాయి గొంతులో ఓ గుక్కెడు నీళ్లు పోశాడు. నోట్లో పోసిన రెండునిమిషాలవరకూ నీళ్లు గొంతుదిగలేదు. క్రమ క్రమంగా ఒక్కొక్క చుక్క దిగమింగుతూ ఆగుక్కెడునీళ్లూ అయిదు నిమి షాలకు మింగింది.

"చూడు — ఇక వట్టినీళ్లు వద్దుగాని — కాసిని చిట్టుడుకునీళ్లు తయారుచెయ్యి. — నేను పోయి దీని మొగుణ్ణయినా, కొడుకునయినా పిలుచుకొనివస్తా" అని సుబ్బిని సరోజిని కప్పగించి, శేషశాయి పరుగున సుబ్బి సంసారం ఉండే గుడిసెకాడికి పోయినాడు.

౮

శేషశాయిఇంటికి వాయవ్యమూలగా, రోడ్డుకు పడమటగా ఉంది సుబ్బిగుడిసె. నాలుగు ఫర్లాంగు లుం టుంది దూరం. ఆగుడిసె అట్లా ఆ పక్కగా ఉందని అనుకోవడమే గాని శేషశాయి ఎప్పుడైనా వాళ్ల గుడిసె కాడికి వెళ్లాడా, చేశాడా.

అక్కడ సుబ్బిగుడిసె ఒక్కటేగాక ఇంకా ఏడు గుడిసె లున్నై. ఏగుడిసెకాడికిపోతే సుబ్బిసంసారం కనిపిస్తుందో తెలియకపోయె శేషశాయికి. అన్ని గుడి సెలూ చుట్టు గుడిసెలే. ఒక్కఅడుగు ఎత్తునగాబోలు మట్టిగోడ పెట్టి, దానిమీద తాటిఆకులూ చిరిగిపోయిన ఈతచాపలూ కప్పివేసిన గుడిసెలు అవి. మనిషి కూర్చుని దేకుతూ లోపలికిపోగల సంపు గలది ముఖద్వా రం. మిగిలిన యానాదు లందరూ పనులకు పోబట్టి గాబోలు ఆ గుడిసెల్లో ఎక్కడా శబ్దంలేకుండా ఈతాకు తడికలతో మూయబడిన ముఖద్వారాలతో నిశ్శబ్దంగా

ఉన్నవి. ఒక్క గుడిసెకాడమాత్రం సందడిగా ఉంది. సుబ్బిపిల్లలు అప్పుడప్పుడు తల్లితో శేషశాయి ఇంటికి వస్తూ పోతూఉన్నవా ళ్లయినప్పటికీ — ఎందువల్లనో శేషశాయికి వాళ్లు గుర్తు చిక్కలేదు.

ఈయన పోయేవరకు సుబ్బిపిల్లలు — నలుగురు ఆడపిల్లలు, అయిదుగురు మొగపిల్లలూ — గుడిసెకాడ బయట గలభా చేస్తున్నారు. ముసలాడు - తండ్రి - గుడిసెలో కాళ్లు చాచుకొని తలకింద ఇటుకరాళ్లు ఎత్తుపెట్టుకొని నేలమీద వెల్లకిలాపండుకొని ఊఁ, ఊఁ, ఊఁ అని మూలుగుతున్నాడు. శేషశాయివచ్చినసంగతి బయట పిల్ల లెవ్వరూ గమనించలే దింకా. సుబ్బిపెద్దకొడుకు సుబ్బరాముడు ౧౭ ఏళ్లవాడు ఓ గోచీ పెట్టుకొని నడుంగా కూర్చున్నాడు. వాడిచుట్టూ మిగిలిన పిల్ల లందరూ కూచుని కొంతమందీ నిలుచొని కొంతమందీ గంతులేస్తూ కొంతమందీ మారాములు చేస్తున్నారు. సుబ్బరాముడికీ వాడిచెల్లెళ్ల కిద్దరికీ గుడ్డలన్నీ తడిసి ఒళ్లంతా బురద అంటుకొని ఎండిపోయి నల్లగా, బురదలో పొర్లివచ్చిన వరాహావతారాల్లాగ ఉన్నారు వాళ్లు.

సుబ్బరాముడు తనముందు దొకకుండబొచ్చె పెట్టుకొని మిగిలినవాళ్లు మారాముల్లుపడుతూ ఉంటే వాళ్లని నయానా, భయానా సమాధానపెడుతూ ఎవ్వరికీ లోపం లేకుండా పంచిపెట్టుతున్నాడు; కాని తనకంటె

చిన్నవాళ్లయినప్పటికీ – ఒకరిద్దరు ఆఘాయిత్యపు పిల్లలు సుబ్బరాముడిమీాది కెగబడి, బొచ్చెలోనిది బలవంతంగా ఊడబెరుక్కుని దూరంగా పారిపోయి మామిడి చెట్టుకింద నిలబడి ఆత్రంతో గతుక్కొంటూ నోట్లో కుక్కుకొంటున్నారు. "ఈ పాలిరా వెధవా పెడతాలే. అమ్మకీ అయ్యకీ మిగలపనిలే, అంతా మీా పొట్టనే పెట్టుకొంటే" అంటూ సుబ్బరాముడు చేయి జారిపోయిన వస్తువునుగురించి తమ్ముల దండగానికి ఆక్రోశపడుతున్నాడు. మరికొంతమంది అన్న ఇచ్చిన దానితోనే తృప్తిపడి మంచితనంగానే అన్నను బెల్లించుకొని తీసుకొని తింటున్నారు. పిల్లల్లోకల్లా ఎడపిల్లవాడు–శేషడు గాబోలు – నాలుగేళ్లకుంక ఈ మధ్య ఆడుకోవడంలో ఎక్కడనుంచో కాలుజారిపడి, ఎడంకాలు తొడలో విరిగినందున చచ్చినంత జబ్బుచేసి చికిత్స చేసేవాళ్లు లేక పోయినకాలు రానందున దేకుకొంటూనే త్రొక్కుళ్లాడుతున్న ఆ సంఘంలో ఎట్లాగో దూరి అన్నమీాది కెగబడ్డాడు. ప్రాణంమీాదికొచ్చి తిరిగీ జన్మ ఎత్తినంత జబ్బుచేసినందువల్ల శేషడికి బలహీనంవల్ల ఊదరపొట్ట పెరిగి కాళ్లూచేతులూ సన్నగిలి చూచే వాళ్లకి వీడెట్లా బతుకుతాడా అని అనిపించేటట్టున్నాడు పాపం. వాణ్ణి చూడంగనే సుబ్బరాముడికి దయ గలిగి ఉన్నవాటిలో లేతేవి మంచివిగా రెండు ఏరి దులిపి

"ఇదిగో తిను" అని చేతిలో పెట్టాడు. మిగిలిన వాళ్లు చేతికందినవి తొందరగా నోట్లో వేసుకొంటే అన్న మళ్లా ఇస్తాడని ఆశతో చేతిలోనివి తొందర తొందరగా బురదా బాడీ అనకుండానే నోట్లో వేసుకొని కసుకూ కసుకూ నమిలి మింగుతున్నారు.

ఈ చర్యలన్నీ గమనిస్తూనే శేషశాయి ఈ గుంపును సమీపించాడు. శేషశాయిని చూచి సుబ్బరాముడూ, వాని చెల్లెళ్లిద్దరూ కొంత జ్ఞానంకలిగిన ఈడు వచ్చినవాళ్లు కాబట్టి లేచి నిలబడ్డారు. మిగిలిన కుర్రకుంకలు గంతులేస్తూనే చేతిలోనివి తింటున్నారు. "ఒరే ఆబాచ్చెలోనివి ఏమిటిరా" అని శేషశాయి సుబ్బరాముణ్ని అడిగి, అడుగుతూనే పిల్లకాయల చేతుల్లో వున్నవాటిమీదికి అప్రయత్నంగా తన దృష్టిపోగా అవి పచ్చికప్పలు, పచ్చిచేపలు, పచ్చి ఎండ్రకాయలుగా వెంటనే తెలుసుకొని, ఆదృశ్యం చూడ్డంతోనే తనకు గలిగిన వికారానికి వాంతిఅవుతుందేమోనని భయపడి ఓక్షణం కళ్లుమూసుకొని "ఈ దినం దుర్దినం నా జన్మలో" అని అనుకొని కళ్లు తెరచేవరకు సుబ్బరాముడుబొచ్చెను చాటున దూరంగా దాచి పిల్లకాయల్ని బయటికి సాగనంపి గుడిసెకాడికి పోయి "అయ్యోయ్, పంతులు వచ్చిండు" అని గుడిసెలో ప్రాయోపవేశ దీక్షలో పరుండిఉన్న తండ్రితో చెప్పాడు.

"ఒరే! మీనాయన కెట్లాగుందిరా?"

"మొన్న పేళనుంచి బువ్వలేదండి. ఈపొద్దంతా జరం తగిలిందండి. — అయ్యా, బయటికి రావే ఓపాలి! పంతులు వచ్చిండు."

"నీకు జ్వరంగా వుంటే రావద్దు, పండుకో. నీకు మందు పంపుతాలే. ఒరే! నీపేరేమిటిరా?"

"నాపేరు సుబ్బరాముడండి."

"ఒరే సుబ్బరామా! నీతో పని ఉంది, ఇంటిదాకా రా."

అని శేషశాయి అనేవరకు 'వస్తుండా' అని సుబ్బ రాముడు దాచిపెట్టిన బొచ్చెమీద తాటాకు కప్పి పైన రాయి బరువుపెట్టి శేషశాయితోకూడా వెనకనే పోయాడు.

"ఇవ్వేళ మీరు కూడు తినలేదురా సుబ్బ రామా?"

"లేదు బాబు! గింజలు లేవు. మా అయ్య పని చెడ్డప్పటినుంచీ కూలికి పొయ్యేవాళ్లు లేక నిన్నా మొన్నా గింజలు చిక్కలేదు. నేను కోతకు కూలికి పోతానంటే ఇంటికాడ అయ్యకు బాగులేదని నన్నిడ ఉండమని చెప్పి మా అమ్మ మీ యింటికి వచ్చింది. పోనీ మా అమ్మయినా ఈ నాలుగురోజులు వరికోతకు పోవా

లనుకొంటే ఇంటికాడ అమ్మగోరు శలవివ్వడం లేదన్నా రట."

"మరి నిన్నటినుంచీ ఏం తిన్నారురా మీరు?"

"అవేనండి! ఆ పచ్చివే! నాలుగు తెచ్చుకొని తిన్నాం. మా అమ్మకి నిన్నటినుంచీ అవిగూడా లేవండి."

"మరి మీ అమ్మకెందు కివ్వలేదురా?"

"మా అమ్మ పచ్చివి తినదండి. పోనీ కాల్చుకొనేనా తింటుందని నిన్న మధ్యాహ్నం నాలుగు వేరేతీసి దాచిపెట్టితే ఎవ్వరూ చూడకుండా కుక్క వచ్చి మింగేసింది. మా అమ్మ నిన్నటినుంచీ పస్తేనండి.—"

"అట్లాగురాపాపం! చూడు, మీ అమ్మ కిందాక మా యింటికాడ జబ్బుచేసి పడిపోయిందిరా. ఇదిగో – అట్లా దొడ్లోకి పోయి చూడు –" అని అప్పుడే ఇంటికి చేరుకొన్న శేషశాయి సుబ్బరాముణ్ని సందుగుండా దొడ్లోకి పంపి తాను లోపలికి వెళ్లాడు. అప్పుడే చిట్టుడుకునీళ్లు తయారయినందున గిన్నెలో పోసుకొని, సరోజిని సుబ్బిదగ్గర తెచ్చిపెట్టింది. వాటిని సుబ్బరాముడు గొంతులో పోసిన ఓ అరగంటకి సుబ్బి తేరుకొని కళ్లు విప్పి కాస్త లేచి కూచున్నతర్వాత —

"ఒరే: ఇవ్వేళకు పనిచాలుగాని మీ అమ్మ నింటికి తీసుకొనిపోరా సుబ్బరామా! ఇదిగో ఈ రెండు

రూపాయలూ తీసుకొనిపోయి గింజలు తెచ్చుకొని తినండి. తర్వాత చూద్దాం" అని శేషశాయి సుబ్బరాముడి చేతిలో పెట్టేవరకు మేరుపుపర్వతం దొరికి, కష్టాలు గట్టెక్కినట్లు సంతోషిస్తూ సుబ్బరాముడు తల్లిని రెట్ట పట్టుకొని తిన్నగా నడిపించుకొంటూ ఇంటికి తీసుకొని పోయాడు.

ఏదో నెత్తిమీదిబరువు క్రిందికి దించుకోగా శరీరం తేలికయినట్లు ఆనందిస్తూ, శేషశాయి క్లబ్బుకు వెళ్లి పోయాడు.

"చేతి కెంత వస్తే అంతే. ముందూ వెనుకా ఆలోచన లేదు. ఒక్కసారే రెండురూపాయ లిస్తారా ఎక్కడైనా. అంతా బడాయి" అని సణుగుకుంటూ సరోజిని లోపలికి వెళ్లిపోయింది.

# కొత్త చెప్పులు

ఆదిగాడు ఆ గ్రామమాదిగవాళ్లకందరికీ కులపెద్ద. అనాదిగా వాడి పెద్దలలగాయతు ఈ గౌరవం వంశపారంపర్యంగా వస్తూఉండడంచేత ఆదిగాడుకూడా తనహయాంలో గౌరవంగానే కాలక్షేపంచేసి నిరుడుసంవత్సరము శ్రావణమాసంలో వచ్చిన దూముల్లో కలరా తగిలి పాపం వెళ్లిపోయాడు. ఇంట్లో వాడిభార్య నరిసీ, పన్నెండేళ్లకొడుకూ, ఓ యెనిమిదేళ్ళ కూతురూమాత్రం ఉన్నారు. నరిసి కూలికిపోయి రోజు కోముం తెడుగింజలు చెమట ఊడ్చి సంపాదించుకొని పొట్టపోసుకొంటూ పసిపిల్ల లెప్పుడు చేతి కందివస్తారా అని నిత్యమూ అంకాళమ్మకు దణ్ణాలుపెట్టుకొంటూ కాలక్షేపం చేస్తోంది. చిన్నపిల్ల లయినప్పటికీ యిద్దరు పిల్లలూ రోజూ పొద్దున్నే పొలంచాయ పోయి పొయ్యిలోకి ఇన్ని చితుకులూ, కంపా, కట్టా, పేడా పోగుచేసుకొని తల్లికి కాస్త వేన్నీళ్లకి చన్నీళ్లలాగ సహాయంచేస్తూ ఉన్నారు.

ఆదిగాడు బ్రతికిఉండంగా పెద్దమాదిగ కాబట్టి ఆ గ్రామంలో పదిమంది పెద్దఆసాముల యిళ్ళకూ ఉద్యోగంచేస్తూ ఏటా కుప్పనూర్పళ్లలో ఎట్లా లేదన్నా ఓపందుంగింజలు కళ్లచూస్తూ ఉండేవాడు. పైగా ఆసాములయిళ్లల్లో పసరం చచ్చినపుడల్లా వాడికి తోలు మిగులుతూఉండేది. తోలు కొంతభాగం ఆసాముల చెప్పులకిందా, తోలుబొక్కెనలకిందా, ఎద్దులకు మెడవారుల కిందా, మువ్వలపట్టెళ్లకిందా ఖర్చవుతూఉన్నప్పటికీ, మరికొంత మిగులుతూనే ఉండినందువల్ల తద్వారా వాడికి కొంతఆదాయం ఉండకుండా పోయేదికాదు: కాని ఆదిగాడు చనిపోయినతర్వాత ఇంట్లో సంతనలేక, నరిసి పూర్వంఉన్న అన్నియిళ్ళకూ ఉద్యోగం

చేయలేకపోయింది. అందువల్ల పూర్వం చేస్తూఉన్న పదియిళ్ళల్లోనూ, ముఖ్యమైన ఏనాలుగైదిళ్ళో తప్ప మిగిలినయిళ్ళను, తన కొడుకు చేతికెక్కివచ్చేవరకూ తనకు వల్లకాదని చెప్పి వదులుకొంది. తను మిగుల్చుకొన్న ఆనాలుగిళ్ళకైనా సరిసి సమయానికి మాదిగవాడలో ఎవరినో అన్నా, నాన్నా అని బ్రతిమలాడుకొని, ఆసాములకు ఏ లోపమూ లేకుండా ఉద్యోగంజరుపుకొంటూ జీవనం గడుపుకొంటోంది.



చిన్నపరెడ్డి గ్రామంలోఉన్న మోతుబరీ ఆసాములలో ఒకడు. అంతే కాదు, మోతుబరులలోకల్లా కొత్త ముఖ్యుడనికూడా చెప్పొచ్చు. ఆగ్రామంలో అందరూ పెద్దకాపులపుట్ట. అంతా ఒకరి కొకరు కావలసినవాళ్ళు; బీరకాయపీచు. అందువల్ల ఉన్నవాళ్ళల్లోకి మొదటినుంచీ చిన్నపరెడ్డిది కొత్త తలబిరుసుతత్వం అయినప్పటికీ అతను చేసేదుండగాలూ, బీదలను పెట్టే హింసా బయటికిరాకుండా సమయానికి గ్రామంలో నలుగురూ కమ్ముకొనిరావడంమూలాన్న పరిశపారిపోతూ వస్తున్నవి. పైగా గ్రామమునసబు వాళ్లవాడే అయినందువల్ల అతడు మరీపేట్రేగుతూవచ్చాడు. దీనికి తోడు ఏజన్మలో చేసుకొన్న పూజవల్లనో అతనికి ఈ జన్మలో లక్ష్మీదేవికూడా కటాక్షించడంవల్ల అంతా ఒకయేభై, అరవై యెకరాల మాగాణిసేద్యమూ, ఒక డెబ్భై యెకరాల మెట్టసేద్యమూ, ఇంట్లో కావలసి

నంత పాడీ పంటా లభ్యమయి, జీతగాళ్లూ నాతగాళ్లూ కలిగి, మొదటినుంచీ అతగాడికమతం కొంత అట్టహాసం గానే జరుగుతోంది. అదీకాక గ్రామంలో జరిగే చిల్లరతగవుల్లోనూ, ఇచ్చిపుచ్చుకోవడాల్లోనూ మాట కారికాబట్టి తరుచు చిన్నపరెడ్డికాడికే పార్టీలు వస్తూ వుండడం, అతడు పంచాయతీచేసి వ్యవహారాలు పరిష్కారంచేయడం జరుగుతూఉన్నందువల్ల, ఈవిధంగా కూడా అతనికి గ్రామంలో నలుగురిలోనూ కాస్త పెద్ద అనిపించుకోవడానికి హేతువైంది.

ఇక చిల్లరబాపతు అలగాజనానికి ఇతడంటే డొక్కలో మెదులుతూఉంటాడంటే విడ్డూర మేమిన్నీ లేదు. గ్రామమునసబూ, కరణమూ — ఇద్దరూకూడా ఒకరకం మనుషులైనందువల్లనో, లేక అతని జననకాల నక్షత్రబలిమివల్లనో కాలక్రమేణా గ్రామంలోని సివిల్, క్రిమినల్ అధికారాలన్నీ చిన్నపరెడ్డే స్వాధీనపెట్టుకొని అమలుజరుపుతూవచ్చాడు. అతని మాటంటే సుగ్రీవాజ్ఞా, అతడంటే సింహస్వప్నమూ అయింది అలగాజనానికి. ఆఖరుకు అతని పలుకుబడి - అతడు నందంటే నందీ, పందంటే పందీని. ఎప్పుడు ఏంతెచ్చి నెత్తిమీద పెడతాడో అని బీదలంతా హడలి జీవిస్తున్నారు.

నరిసి తనఉద్యోగంలో మిగుల్చుకొన్న యిళ్లల్లో చిన్నపరెడ్డియిల్లు ఒకటి. రెడ్డి చెప్పుల్లో ఒకచెప్పు ఈ

మధ్య కుక్క ఎత్తుకుపోయి కొరికి పాడుచేయడంవల్ల అతడు నరిసిని పిలిపించి ఒక కొత్తచెప్పులజోడు తయారు చేసి తీసుకురమ్మని చెప్పాడు. ఒకవారంరోజులు వెసిలిక యిస్తే తయారుచేయించి తీసుకొని వస్తానని చెప్పి నరిసి వెళ్లిపోయింది.

నరిసి కోరిన వారంరోజులగడువూ అంతకు పూర్వంరోజునే గడిచిపోయింది. కాని యింకా చెప్పుల జోడు రాలేదు. కాలికి జోడులేకుండా తిరగడానికి రెడ్డికి ఇబ్బందిగా ఉన్నది. ఈ వారంరోజులూ ఎట్లాగో కష్టం మీద గడుపుకుపోయినాడు. పోనీ ఆ రోజయినా తెస్తుం దేమో అని పొద్దుటినుంచీ చూచాడు. కాని నరిసి రాలేదు. ఉదయాన్నే ఒకసారి తన సేద్యగాణ్ని నరిసి యింటికి పంపాడు. అది యింటికి రాలేదని పోయినమనిషి చక్కా వచ్చాడు. ఆ రోజు తూర్పుచేలోకి — ఓ రెండు మైళ్లదూరం — రెడ్డి కుప్పనూర్పుకి పోవలసివచ్చింది. వైశాఖమాసం మధ్యాహ్నం పన్నెండుగంట లయింది. అప్పుడే భోంచేసి రెడ్డి బయిటికి వాకిట్లోకి వచ్చాడు. ఎండ తీక్షణంగా కాస్తోంది. జరూరుగా పోవలసినపని. కాలికి చెప్పులు లేవు. పోనీ ఎవరివైనా ఎరువు తీసుకు పోదామనుకొంటే సమయాని కెవరూ తటస్థపడలేదు. ఇంట్లోకి వెళ్లి పొగాకుకాడఒకటి తీసి చుట్టచుట్టి నోట్లో పెట్టాడు. అగ్గిపెట్టె తీసి ముట్టించాడు. శరీరంలో ఒకవిధ

మైన చురుకుదనం కలిగింది. నరిసి చెప్పులు తీసుకువస్తా నని చెప్పినగడువు దాటిపోయి సెకండ్లూ, నిముషాలూ, గంటలూ గడిచినకొద్దీ — గడిచిపోతూవున్నవని తలచు కున్నకొద్దీ — చిన్నపరెడ్డికి లోపల కుతకుతపుట్టి ఉడుకు ప్రజ్వలిస్తోంది. చిరుచెమటలు పోసినవి. ఆడదాని కింత నిర్లక్ష్యమా అనుకొన్నాడు. ఇట్లా ఆటలు సాగనిస్తే తన సంగ తేమికావా లనుకొన్నాడు. నిట్టూర్పు లధికమై నవి. నోటిలో పెట్టినచుట్ట బ్రహ్మాండంగా కాలిపోతూ ఉన్నది. నిట్టూర్పుతో పీల్చినగాలికి రెడ్డికి నోటిలోకీ ముక్కులోకీ ధూమసముదాయం ఎక్కిపోతున్నది. రెడ్డికి కళ్లెర్రబారినవి. పీల్చిన పొగ ముక్కుపుటాల గుండా, పళ్లసందులగుండా బయటికి మబ్బుతెరలల్లా వస్తూవుంది. నట్టనడిఆకాశాన్నుంచి భగవానుడు తన సహస్రకిరణాలతోనూ లోకాన్ని పొదిగి వేడెక్కి స్తున్నాడు. రెడ్డికి శరీరం వేడెక్కిపోతోంది. నరిసి యింకా రాలేదు. కాళ్ళ చెప్పులు లేకుండా పొలం పోవడమా? మానడమా? వెళ్ళక విధిలేదు. పైన ఉత్తరీయం వేసుకొన్నాడు. చేతిలో కర్ర పుచ్చు కొన్నాడు. సమయానికి గొడుగు అగుపడలేదు. దాన్ని వెతకడానికికూడా అతనికి స్థిమితం లేకపోయింది. ఇంట్లో ఆడవాళ్లు భోజనం చేస్తున్నారు. పొలం పోదా మనుకొని రెడ్డి నడవదాటి నాలుగడుగులు వేసి వీధి

గుమ్మంలోకి వచ్చేవరకు నరిసి ఒక చిన్న వెదురుపేళ్ళ బుట్టలో ఒకజత చెప్పులు కొత్తవి తీసుకువచ్చి గుమ్మంలో అతని కెదురుగా పెట్టింది.

"నిన్న తీసుకువస్తానని చెప్పి ఇంతవరకూ తీసుకు రాకుండా ఎందు కాలస్యంచేశావే రండా" అని రెడ్డి గ్రుడ్లు వురిమి అదలించాడు.

"సామీ! నాకింటికాడ సంతన లేదుగద ఏ అయ్యనో. కాళ్లూ కడుపూ పట్టుకొని ఉద్యో చేయించుకోవాలి. నేను బ్రతిమలాడిన మాద నిన్న మాపటికి తయారుచేసి తీసుకువచ్చాడు. చెప్పుల కాముదం రాసి తీసుకువద్దా మనుకొని నుంచి ఆముదంకొనడానికి చేతిలో డబ్బులేక, ఆవీధి కోమటాయన్ని బతిమలాడి ఇంత చుక్క పెట్టించుకొని చెప్పులకు పట్టిం ఆముదం పెట్టకుంటే తమరు కోపం పెట్టించేవరకు ఈయే లయింది సామీ" గడగడ వణుకుతూ తడబడుతూ జవాబు మునుపే చిన్నపరెడ్డికి ప్రపంచం తెలియలేదు అతనిస్వాధీనం తప్పిపోయింది. ముఖం ఎర్ర కోపంతో వళ్ళంతా కంపించిపోతోంది. పిడు టట్టుగా ఉరిమి, "ఊఁ! నీ కాముదం లేదుగా! తెస్తానన్నవేళకు తేక ఇంత అలక్ష్య

మాదిగదాని కింత కావరమా?" అంటూ పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం ప్రయోగించినట్టు, తనచేతికర్రతో ఈడ్చి నరిసిని మెడమీద కొట్టేవరకు 'చచ్చాను దేవుడా' అని అరుస్తూ, వాతం కమ్మిన కుక్కలాగ గిర గిర గిరగిర తనచుట్టూ తాను నాలుగుసార్లు తిరిగి నడివీధిలో కిందపడి కర్మసాక్షి సూర్యుడికేసి ముఖంపెట్టి ళ్ళు తేలేసింది.

చిన్నపరెడ్డి కుప్పనూర్పుకాడికి తూర్పుపాలం లనుకొని బయలుదేరి వాకిట్లో కొస్తే ఇంత గ్రంథం రిసిప్రాణం హరీఅంది. వాకిట్లో నడివీధిన పడి ం. వీధిలో ఇటూ అటూ పారజూచాడు రెడ్డి. హ్నాం, భోజనాలసమయం, వీధిలో అంతా ఉంది. జనసంచారం లేదు. కాని ఏమి రెడ్డికి తోచలేదు. కళ్ళకు కమ్మిన కావరం ట్టగించి ఆవుద్రేకంలో అంతపని చేశాడు అతనికి తలవేడి తగ్గింది. క్రోధం చల్లా మానవ ప్రపంచమని తెలిసింది. శవాన్ని ఆప్రకారం వాకిట్లో ఉంచడం? ఎవరి డకుండా ప్రస్తుతం దాన్ని దొడ్డిగుమ్మాన్న డ్లోకి చేర్పిస్తే, తర్వాతవిషయం నిదానంగా చుకోవచ్చు ననుకొన్నాడు. కాని శవం దొడ్లోకి పాయం ఏదీ? తన సేద్యగాండ్లందరూ కుప్ప

నూర్పులో ఉన్నారయ్యే. ఇంట్లోకి పరుగెత్తా డతడు. భార్యా, అతనితల్లీ అన్నం తింటున్నారు. దాసీపనిచేసే యానాది లక్ష్మి పడమటింటి వసారాలో కూర్చొని బియ్యం బాగుచేస్తోంది. ఖంగారులో ఏమీ తోచక భార్యను పిలిచి ఇట్టా జరిగిందని తడబడుతూ చెప్పాడు. తల్లి చెవినిబడింది విషయం. అమ్మయ్యో అని తల్లీ భార్యా గుండెలు బాదుకొన్నారు.

"ముందు శవాన్ని వాములదొడ్లోకి చేరుద్దాం రండి. ఆవిధాన వీధిలో ఉంచడానికి వీలులే" దన్నాడు రెడ్డి.

"సరే! యానాది లక్ష్మినికూడా పిలుస్తాను. ఉండు" అని భార్య లక్ష్మిని పిలిచింది; దానితో రహస్యంగా చెప్పింది విషయం. సంగతంతా వినేవరకు లక్ష్మికి హడలెత్తి "నావల్ల కాదమ్మా ఈపని" అని ఊరిబయట తనగుడిసెకాడికి పేరెంతీసిం దది. "ఆలస్యము అవుతోందర్రా" అనేవరకు, తల్లీ భార్యా రెడ్డీ ముగ్గురూ కలిసి వీధిలోకి వచ్చారు. రెడ్డి తిరిగి ఇటూ అటూ వీధిలో నాలుగువైపులూ పరకాయించి చూచాడు. జనసంచారం లేదు. ఇదే సమయం అనుకొని ముగ్గురూ చెయ్యిచేసుకొని శవాన్ని వాకిటగుండా వాములదొడ్లోకి చేర్చి ఎండుగడ్డివాములో, లోతుగా దూర్చి బయటికి కనిపించకుండా గడ్డి కప్పి వచ్చేశారు.

కాని రెడ్డికి మనస్సులో దిగులుగానే ఉంది. తాను చేసినపని ఎవరికంటా పడలేదని నమ్మకమేనా? లేక ఎవరికంటనైనా పడిందా అని అదే ఆలాపన అతనికి. గుండెలు కొట్టుకుంటూనే యున్నవి. తిన్నఅన్నం అంతా నీరైపోయింది. ముచ్చెమటలు పోసి శరీరం నిస్సత్తువయిపోయింది. మాదిగశవాన్ని తాకినందుకు ముగ్గురు వాహకులూ వీధితలుపూ, దొడ్డివాకిలీ గట్టిగా లోతట్టు బిగించి సందులోని బావిదగ్గర వెంటనే స్నానం చేసి గుడ్డలు మార్చి చలవమడతలు కట్టుకొన్నారు. "శుభంవలె ఇదేం ఖర్మం వచ్చిందర్రా నిండుయింట్లోనూ" అని తల్లి ముసలిది కంటనీ రెట్టుకొంది. "నోరు విప్పితే గొంతుక పిసుకతా" నని రెడ్డి గదమాయించాడు.

మధ్యాహ్నం ఒంటిగంటా రెండుగంటలు కావచ్చింది. సూర్యుడు కొద్దిగా పడమటికి జారుతున్నాడు. రెడ్డి మళ్లా చుట్ట ముట్టించి తూర్పువసారాలో ఇటూ అటూ పచార్లుచేస్తూ తడిసినతల విప్పుకొని జుట్టు ఆరబెట్టుకొంటున్నాడు. కర్తవ్యం ఏమీ స్ఫురించడంలేదు. అంతా చికాకుగానే వుంది. రిచ్చపాటుదశలోనే ఉన్నాడు.

ఇంతలో రెడ్డికి చెప్పు లిచ్చివస్తానని చెప్పి రేపవేళనంగా పోయినఅమ్మ యింటికాడ కూడయినా వండకుండా పొద్దు పడమటికి వాలినా రాలేదే అని పొద్దు

వేలనుంచీ కూడూ నీళ్ళూ లేక చూసిచూసి కళ్లు కాయలు కాసి ఆకలికి శోషవచ్చి, అయినా రెడ్డిగారింటికి పోయి విచారిస్తే మందల తెలుస్తుందని నరిసికొడుకూ, కూతురూ — ఇద్దరూ కలిసి రెడ్డి కెదురుగా వీధి గుమ్మంలో ప్రత్యక్షమైనారు.

"అయ్యా! మాఅమ్మ మీకాడికి చెప్పులు తెచ్చిందే. ఏడబోయిందీ?" అని పిల్ల లిద్దరూ రెడ్డి నడిగారు.

రెడ్డికి ప్రాణాలు నిలువునా ఎగిరిపోయినవి. నిలుచున్నమనిషి తటాలున కిందిచీడీమీద చతికిలబడ్డాడు. నోటిలోచుట్ట జారి కింద పడిపోయింది. కాళ్ళూ, చేతులూ పటుత్వం తప్పిపోయినవి. పసిపిల్లకాయ లిద్దరూ అతనికళ్లకు పెనుభూతాల్లాగ కనిపించారు. పిల్లలు వాకిట్లోనుంచి కదలలేదు. జవా బివ్వకుండా ఎంత సేపని ఊరుకోగలడు రెడ్డి? ఇంతమాత్రానికే యింత అధైర్యపడితే ఇక ముందు జరుగవలసినకథంతా ఎట్లాగ నడవడం? ధైర్యం చిక్కబట్టుకోవా లనుకున్నాడు. సకిలించాడు. గొంతు సవరించుకొన్నాడు. చాచుకొన్న కాళ్లు ముడుచుకొన్నాడు. మూతిమీద చేయి వేసుకొని మీసం సవరించుకొన్నాడు. జుట్టు దులిపి ముడిగట్టాడు. భార్యను పిలిచి మంచినీళ్లు తెప్పించుకొని ఓలోటానీళ్ళు తాగాడు. పిల్లకుంకల్ని క్షణంలో నమ్మించగలం అనుకొని,

"ఒరే మీఅమ్మ చెప్పు లిచ్చి అప్పుడే యింటికి పోయిందిరా, ఇక్కడ లేదు. అది ఇంటి కింకా రాలేదా?" అన్నాడు.

"లేదయ్యా! పొద్దుటేలనుండి మాకు బువ్వ లేదు. ఇంకా యింటికి రాలేదు. ఎక్కడకు పోయిందో" అని వాళ్ళన్నారు.

"పొండి, పొండి, ఇంటికి పొండి. మీఅమ్మ ఇక్కడ లేదు. ఎందు కెండలో తిరుగుతారు? పొండి" అని తొందరచేసి కూడులేక ఆకలికి మాడుతున్న పసి పిల్లకాయల కింత అన్నమైనా పెట్టిపంపితే బాగుండునన్న ఆలోచనైనా లేకుండా వాళ్లిద్దరూ తనదృష్టిపథంనుండి తొలగి బయటికి పోతేచాలు ననుకొని, ఆత్రంతో వాళ్ళను తొందరపెట్టి పంపివేశాడు. దిక్కూదెసాలేక, దారీతెన్నూ తోచక వచ్చిన కుర్రకుంకలు వచ్చినట్టు గానే యింటికి పోయారు.

౨

మధ్యాహ్నం మూడుగంట లయింది. కాలచక్రం గిర్రున తిరిగిపోతోంది. చీకటి పడితేనేగాని తను తల పెట్టినకార్యం సాగదని, ఎప్పుడు పొద్దుగుంకుతుందాఅని రెడ్డి కొంతసేపు ఆత్రపడ్డాడు. కాని అంతలోనే అతనికి

పొద్దు గుంకుతుందంటే భయంకూడా వేసింది. మొత్తానికి మనిషి కొంచెం జంకాడు. మొదటున్న ధైర్యం ఇప్పుడు లేదు. గుండెబిగువు జారింది. కాని బయటికట్లా కనిపించకూడదని మేకపోతుగాంభీర్యం తెచ్చిపెట్టుకొన్నాడు. ఆఖరుకు పొద్దు గుంకింది, చీకటిపడింది. రాత్రి ఎనిమిదిగంట లయింది. తొమ్మి దయింది. నెల యింకా పొడవలేదు. అతని సేద్యగాళ్లలో కొంతమంది యింటికి వచ్చారు. వాళ్ళలో ఇద్దరిని – జెబ్బపుష్టీ, పిక్కబలిమీ గలవాళ్లని – చాటుకు పిలిచాడు రెడ్డి. భయపడవద్దన్నాడు. ఇదిగో పదిరూపాయలనోటు, ఈనాం తీసుకోం డన్నాడు. జరిగినవిషయం అంతా చెప్పాడు.

"మీరు రెండోఆలోచన లేకుండా ఈశవాన్ని ఊరిబయట పొగడదొరువులో పారేసి రావాలి. ఇదిగో పదిరూపాయలనోటు. ఊఁ! రెండో ఆలోచన చెయ్యడానికి వీలులేదు. తొందరగా రావాలి. చూడండీ, ఈ రెండు ఈతచాపలలోనూ శవాన్ని చుట్టి తీసుకొనిపొండి. అయిదు నిముషాల్లో పని పూర్తిచేసుకు రావాలి" అన్నాడు రెడ్డి.

పదిరూపాయలనోటు చూచేవరకు ఇద్దరుముత రాచువాళ్లకూ మేరువు దొరికినట్లయింది. నడుంకట్టారు వాళ్లు. వామికాడికి పోయారు. దీపం తెచ్చేదాఅని రెడ్డి అనేవరకు వద్దన్నారు. శవాన్ని చాపలో చుట్టారు.

కాళ్లతట్టు ఒకరూ, తలతట్టు ఒకరూ ఎత్తుకొన్నారు. దొడ్డిగుమ్మంకాడికి వచ్చారు.

"ఉండండి! ఉండండి" అని రెడ్డి వాళ్లను అదలించాడు. తాను తలుపు వోరవాకిలిగా తీసి ముందు వీధిలోకి పోయాడు. రాత్రి పదిగంటలు దాటివుంటుం దనుకొన్నాడు. వీధిలో నిశ్శబ్దం గమనించాడు. ఇక వెళ్ళం డన్నాడు. ముతరాచు లిద్దరూ కళేబరాన్ని వీధి దాటించారు.

ఇక రెడ్డికి కాస్త స్థిమితం ఏర్పడుతూ ఏర్పడుతూ వుంది కాని పోయినమనుష్యులు తిరిగి తన కళ్ళపడేవరకూ అతనికి పూర్తిశాంతి చిక్కేటట్టు కనపడలేదు. ఇంతలో వెళ్లినవాళ్లు పావుగంటలో వచ్చి జయభేరీ మోగించారు. రెడ్డి 'అమ్మయ్యా!' అనుకొని భోజనానికి లేచాడు.

నరిసిపిల్ల లిద్దరూ ఆ పగలూ, ఆ రాత్రీ పక్కయింటి మాదిగయింట్లో కూడు తిని దిగులుతోనే ఆ రాత్రంతా గడిపారు. తెల్లవారింది. సూర్యుడు తిరిగీ తనధర్మం నిర్వర్తించడానికి ప్రాక్పీఠాన్ని అధిష్ఠించి ఈ విశ్వప్రపంచంలో జరిగే సమస్తకర్మలూ వీక్షిస్తూ, వాటికి సాక్షీభూతుడైన ప్రత్యక్షదేవతవలె ప్రకాశించి పోతున్నాడు. బారెడు పొద్దెక్కేసరికి ఎవరిదో ఆడదాని శవం ఊరిగమిడి పొగడదొర్వులో పైకి తేలిందని గ్రామంలో పుకారు పుట్టింది. గ్రామమునసబు వెట్టి

నౌకర్లను పిలిపించి శవాన్ని బయటికి తీయించి చూచి మాదిగ నరిసి శవంగా గుర్తించి మాదిగవాడకు కబురు చేశాడు. మాదిగవాళ్లంతా చుట్టబెట్టుకొని నరిసిపిల్ల కాయలతోసహా దొరువుకాడికి వచ్చారు. శవాన్ని చూచారు. నరిసి పసిపిల్ల లిద్దరూ ముందుకు వచ్చి శవం మీదపడి గొల్లుమన్నారు. "అయ్యో! పసిపిల్లకాయ లిద్దరినీ అన్యాయంచేసి పోయిందే" అని పిన్నాపెద్దా అందరూ దుఃఖించారు. కూడా వచ్చినవాళ్లు పిల్లవాళ్లని ఇవతలికి తీసి ఓదార్చారు.

పిమ్మట గ్రామమునసబు పోలీసువారికి రిపోర్టుచే యడంతోటే పదకొండుగంటలికి వచ్చి వాలారు వారు. ఈలోపల ఎట్లా పొక్కిందో ఆనోటా ఆనోటాబడి అస లువిషయం — చిన్నపరెడ్డి నరిసిని కర్రతో కొట్టి చంపి రాత్రివేళ శవాన్ని దొరువులో తోయించాడని — ఊరూ వాడా పొక్కిపోయింది. లోకంనోరు మూయడా నికి మూకు డేది? సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చేకొద్దీ గ్రామంలో పుకార్లు బలమైపోతున్నవి. కాని ప్రత్యక్షసా క్ష్యంమాత్రం రాలేదు.

ఒక సబిన్స్పెక్టరూ, ఒక సార్జెంటూ, ఇద్దరు కని ష్టీబులూ వచ్చారు. గ్రామంలో అడుగు పెట్టీ పెట్టంగనే పసికట్టారు సంగతి. వారిముక్కుకి కమ్మంగా తగిలింది వాసన. అసలే పాముచెవులయ్యె వాళ్లవి. అందులోనూ

ఇసుకలోనుంచికూడా నూనె పిండగల చాతురీధురీణులు వాళ్లు, ఘటనాఘటన సమర్థులు. ఇక నేం, రొట్టె విరిగి నేతిలో పడినట్టయింది. ఇక సవాలక్ష గ్రంథం జరిగించ వచ్చు. సబినస్పెక్టరు బాగా సార్వీసుగలచెయ్యి. బహు బింకంగానూ, బెట్టుగానూ నడిపాడు గ్రంథం.

చిన్నపరెడ్డి పట్టూవిడుపూగలమనిషి; ప్రవాహం పొంగి అలలు మీదికి వచ్చినపుడు క్రిందికి వంగి తాకుడు తప్పించుకొనే నేర్పరి. అలవాటులేనిపని చేసినందుకు మొదట్లో కొంత అధైర్యపడి కలగదొక్కుకొన్నా రెడ్డి క్రమేణా గంటలు గడిచినకొద్దీ ఆంతరంగికులైన ఒకరిద్దరు కావలసినవాళ్ళతోనూ, మునసబుతోనూ సంప్రదిం చుకొని ఎటు వచ్చి ఎట్లా తిరుగుతుందో వ్యవహారం అని తనజాగ్రత్తలో తాను ఉన్నాడు. త్రినేత్రుడికి తెలియ కుండా పోలీసువారికీ వీరికీ సంధానం జరిగిపోయింది. చిన్నపరెడ్డి ఇనపపెట్టికాడికి పోయి లక్ష్మీదేవిని స్తవం చేశాడు. ప్రత్యక్షమై, ముల్లోకాలూ సవరించుకొని వస్తానని బయలుదేరింది దేవి. పోలీసు లెవ్వరూ చిన్నప రెడ్డి యింటివైపుకూడా మెదలలేదు పాపం. దక్షిణపు గమిడిలోవున్న గ్రామమునసబుయింట్లోనే భోజనం వగైరాలకు పోలీసులకు బస. కర్మకాండ యావత్తూ సహస్ర నామార్చనతో అక్కడనే ఓ పావుగంటలో పూర్తయి పోయింది.

అయిదుగురు పంచాయతీదార్లు మధ్యాహ్నం ఒంటిగంటకు వెలిశారు. "కడుపులో నొప్పివల్ల బాధ పడుతూ, ఆ బాధ భరించుకోలేక నరిసి నిన్నటిరాత్రి ఉరిగమిడి దొర్వులో పడి ఆత్మహత్య చేసుకొన్నదిగాని ఇతర అనుమానాస్పదమైన కారణము లేమిన్నీ లేవని పంచాయతీదార్లమైన మా అభిప్రాయం" అని తీర్పిచ్చి సంతకాలు పెట్టారు పంచాయతీదార్లు. అనుమానా లేమిన్నీ లేనందున శవాన్ని డాక్టరుపరీక్షకు పంపవలసిన అవసరం లేదని పోలీసువారు శవాన్ని మాదిగెలవశం చేయగా దాన్ని తగురీతిని దహనం చేశారు.

ఎవరిదారిన వారు వెళ్లారు. మాదిగెలకు సమాచారం యావత్తు తెలిసి వాళ్లు మనస్సుకి తెచ్చుకొని బలవంతు డైనప్పటికీ చిన్నపరెడ్డిచేసిన దురంతానికి కోపం పట్టజాలక అక్కసం వెళ్లగక్కుతూ, వాళ్లల్లో వాళ్లు మీటింగులు పెట్టుకొని అప్పటిలో ఏమీ బహిరంగంగా చేయదలపెట్టకుండా, సమయంవచ్చినపుడు ఈరెడ్డిని ముప్పతిప్పలాపెట్టి మూడు చెరువులనీళ్లూ తాగించాలని తీర్మానాలుచేసుకొని నివురుగప్పిననిప్పులా గమ్మునని పలక్కుండా ఊరుకొన్నారు.

## 3

ఆరోజు కారోజు వ్యవహారం అంతా పరిశ పారిపోయి చిన్నపరెడ్డిమనస్సు స్థిమితపడింది. యథా

ప్రకారం అతను తనకార్యాలన్నీ చక్కపెట్టుకొంటూ మామూలుగా వీధిలో నలుగురులోకీ రావడం చేయడం జరుగుతోంది. అంత హడావుడిలోనూకూడా నరిసి తెచ్చినచెప్పులు మరచిపోకుండా అప్పుడే లోపల పోబు ట్టలో భద్రపరిచివుంచాడు. కాని కథంతా తలక్రిం దయేవరకు ఈగొడవలో పడి చెప్పులసంగతే మరిచాడు. పోలీసువారు వెళ్లిన మూడోరోజున తనకి బయటికి పోవడానికీ చేయడానికీ ఎండల్లో కష్టంగా ఉన్నందువల్ల అతను కొత్తచెప్పుల్ని బయటకు తీశాడు. తీసి కాలు పెట్టబోయేవరకు అతనికి నరిసి తేగాలున జ్ఞప్తికి వచ్చింది. కాలు చెప్పులో దూరడానికి జంకింది. ఒక్క నిమిషం నిదానించి ధైర్యంతెచ్చుకొని రెండుచెప్పులూ కాళ్లకు తొడిగాడు. రెండు మూడురోజులు ఆచెప్పుల తోనే పొలంఅంతా తిరిగాడు. చెప్పులు కుట్టడంతీరూ అంతా షోకుగానే వున్నది. కిర్రుకూడా ఉంది. కుట్టడం మొగవాడు కుట్టాడుకాబట్టి లోపంలేకుండానే తయారు చేశాడు. కాని కొత్తచెప్పులకి ఆముదంవేయడంమాత్రం ఆడది నరిసి అవడంవల్ల చమురు అంతబాగా పట్టలేదు చెప్పులకు. అందులో మండు వేసవికాలం అవడంచేత ఎండలకి చర్మం బహుబిరుసెక్కి కొయ్యబారిపోయివుంది. అవసరంకొద్దీ చెప్పులకు చమురు బాగా పట్టిందా లేదా అనేఆలోచన లేకుండా తెచ్చినచెప్పులు తెచ్చినట్టుగానే

తగిలించి చిన్నపరెడ్డి పరధ్యానంతో ఇతరపనులమీద తిరుగుతూవచ్చాడు. కాని మూడోరోజుకి, కుడికాలు చెప్పు ఒరుసుకొని పాదంమీద రెండుచోట్ల కరిచింది. దానితో రెండు చిన్నపుళ్ళు యినవి. దీనితల్లి కడుపుకాల చెప్పుకరిస్తే తగనిబాధ! అయినా ఇ దేంచేస్తుందని పాపం లెక్క పెట్టకుండా మొండికెత్తి తిరిగాడు రెడ్డి. పాదం మీద లేచినపుల్లు నీళ్లల్లో తడిసినవి. చెప్పులు కరిచిన పుండు నీళ్లల్లో తడవకూడ దంటారు మరి. తడవడంతో అవి నీరుపోసి బొబ్బలెక్కినవి. అదే పోతుందని లెక్క పెట్టకుండా చిన్నపరెడ్డి ఆపుళ్లమీదనే మళ్ళా చెప్పులు తొడిగి మొండికెత్తి, బండతనంతో మరిరెండురోజులు తిరుగుతూవచ్చాడు. మళ్ళా యథాప్రకారం కాలు తడుస్తూనేవుంది. దీనికితోడు భోజనంలో పెసరా శనగా మొదలయిన పప్పుదినుసులు తగులుతూవచ్చినందున పుళ్లురెండూ చీముపోసినవి. దానితో కాలు కొంచెం బలువుచేసింది. పోటు జాస్తీఅయిరిది ఆగోజు కారోజు. కొంచెం పులకరంకూడా తగిలింది. పూర్వపు మొండి తనంతో తిరగడానికి వీలులేకపోయింది. కాని చెప్పులు తిరిగి తొడగకపోయినా పుళ్లకి వెంటనే తగిన చికిత్స చేయడానికిమాత్రం అత డుపేక్షచేసి, పైగా భోజనంలో మామూలుప్రకారం మజ్జిగా పెరుగూవగైరాలు యావత్తూ వేసుకొని తింటూవచ్చాడు. అందువల్ల

కాలిమీద రెండుపుళ్లూ క్రమేణా వృద్ధిఅయి బాధ ఎక్కువైంది. మంచం ఎక్కేస్థితికి వచ్చింది. అప్పటి కప్పుడే పదిరోజులైంది. కాలిపోటువల్ల రాత్రిళ్ళు నిద్ర లేదు. కూచోనివ్వదు, నిలవనివ్వదు, పడుకోనివ్వదు కాలు. అప్పటికి గ్రామంలో చిట్కారివైద్యాలు కొన్ని చేయించాడు. ప్రయోజనం లేకపోయింది. పదిహేను రోజులైంది. అన్నహితవు తగ్గింది. శరీరం నీరసించింది. బాధ జాస్తిఅయింది. మనిషి సగమయిపోయాడు. ఏమిచేయడానికీ తోచలేదు. అందులో చైత్ర వైశాఖమాసాలు — మండువేసవి. తగనిదాహం — రోజుకు ముప్పై, నలభై సార్లు అల్పాచమానం — నిస్సత్తువ — లేవలేని స్థితి వచ్చింది. మంచంమీదనే సమస్తమూ జరుగుతున్నవి. ఏమేమి వైద్యాలో చేశారు. ఎందరెందరికో మొక్కుకొన్నారు. కాని రెడ్డికి నయంలేదు. ఇరవై రోజులైంది. నెల్లాళ్లుకూడా అయింది. సేద్యం నాద్యం విచారణంతా తలమనిషికే వదిలేశాడు రెడ్డి. ఇంట్లో ఇతరసంతన లేకపోయె. తల్లీ భార్యా అస్థు లరిగిపోయేటట్లు చాకిరీ చేస్తున్నారు.

ఇంట్లోస్థితి ఈవిధంగా ఉండగా మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్లు చిన్నపరెడ్డి ఎద్దుల్లో ఏనుగు పిల్లలాంటి మూడువందల రూపాయల ఖరీదుచేసే ఎద్దుకు ఇపిరివాపువల్ల జబ్బుచేసి మూడోనాటికల్లా తాఁ అని

నల్లరాయి బద్దలైనట్లు బద్దలయి పశువులదొడ్లో చచ్చి పోయింది. ఆసంగతి వినేవరకు చిన్నపరెడ్డికి నవనాళ్ళూ కుంగిపోయినవి. దొడ్లోఉన్న ఎద్దును చూడాలని కోరిక పుట్టి అత డొకటిరెండుసార్లు లేచాడుగాని కాలు కింద పెట్టలేకపోయాడు. ఆఖరుకు అతని బలవంతంమీద ఆతను పడుకొన్న నులకమంచాన్ని నలుగురు సేద్య గాండ్లు సాయంపట్టి మంచంపళంగా అతన్ని దొడ్లోకి తీసుకుపోయి చచ్చినయెద్దును చూపించారు. ఎద్దును చూచేవరకు చిన్నపరెడ్డి బారుమని ఏడ్చాడు. బెంబేలు పడవద్దని ధైర్యంచెప్పి యింట్లోవాండ్లు తిరిగి మంచాన్ని లోపలికి సాయంపట్టించారు.

ఉదయం పదిగంటలకు చచ్చింది ఎద్దు. సామాన్య మైన ఎద్దుకాదు. పిల్లయేనుగవలె మంచిబలంమీద ఉన్నది. దాన్ని బయటికి తీయాలంటే ఏనలభైమందో కావాలి. చిన్నపరెడ్డి మాదిగవాళ్ళకి కబురంపాడు. దొరికింది సమయం అనుకొన్నారు మాదిగలు. నరిసి వాళ్లకడుపులో పెట్టిపోయినచిచ్చు చల్లారలే దింకా. ఆనాటి కానాడు నిజం పూసగుచ్చినట్టు ఒక్కొక్కసంగతే చెవినిపడేవరకు వాళ్లకు రగిలిపోతోంది కడుపులో. అందులో పట్టు పట్టారంటే అతి మూర్ఖపుపట్టు వాళ్లది. హఠంపట్టితే త్రిమూర్తులు దిగివచ్చినా ససేమిరా అనే రకం. అదిగాక ఇప్పటికి ఎన్నితరాలనుంచో గ్రామంలో

కల్లా పెద్దమాదిగ అని గౌరవంతో బహుచాకచక్యము తోనూ తెలివితేటలతోనూ మాదిగవాడలో అనాది కట్టుబాటులు చెడకుండా జరుపుకొన్నారు నరిసిమొగుడు ఆదిగాడూ, వాడితాతముత్తాతలూను. అట్లాంటి గౌర వంగల కులపెద్దకుటుంబానికి నేటికి చిన్నపరెడ్డి సాయా ములో ఇన్ని కడగండ్లు వచ్చినందుకు మాదిగ లందరూ శివమెత్తి పరవళ్ళుతొక్కుతున్నారు. ఏమైనాసరే ఆరు మూడైనా మూడారైనాసరే చిన్నపరెడ్డియింటికి ఉద్యో గానికిమాత్రం మాదిగవాడయినవా డెవ్వడూ పోగూడ దని ప్రమాణాలుచేసుకొన్నారు. చుట్టుప్రక్కల పదిమైళ్ళ దూరంలోగల అన్నిపల్లెల్లోనూ మాదిగవాళ్ళందరికీ వీళ్లే పురెక్కించి సమ్మెకట్టించారు. చిన్నపరెడ్డికి ఈసంగతి తెలియనే తెలియదు.

మాదిగ లెవ్వరూ రానన్నారన్నసంగతి పోయిన మునిషి వాపసు వచ్చి చిన్నపరెడ్డితో చెప్పాడు. రెడ్డి మంచంమీద ఉన్నాడు. పుల్లు రెండూ క్రమేణా పెరిగి కాలంతా వ్యాపించి పాదమంతా అలుముకొని ఒక పెద్ద వ్రణమైంది. పొద్దు గూకవచ్చింది. ఉదయం పదిగంట లకు వచ్చినయెద్దు సాయంత్రంవరకూ అట్లాగే వున్నది దొడ్లో. దేనికని తాపత్రయపడగలడు, పాపం, చిన్నప రెడ్డి? ఇంట్లో ఆడసంతన తప్ప మగసంతన లేకపోయె. జీతగాళ్లూ సేద్యగాళ్లూ వోయే డెనమండుగు రున్నప్పటికీ

వాళ్ళవల్ల అయ్యేపని కాదయ్యె ఇది. వ్యవహారమంతా అడ్డం తిరిగినట్లు కనిపించింది. రెడ్డి తాను స్వయంగా పోయి చూచుకొంటేనేగాని చక్కపడేటట్లు లేదు వ్యవహారం. స్వయంగా వెళ్లినప్పటికీ లాభం వుండేటట్టుగా లేదు. ఏమిచేయడానికీ తోచక గ్రామమునసబును పిలిపించి సంగతి యావత్తూ చెప్పాడు రెడ్డి. ఆరోజు చీకటి పడినందున మరునా డుదయాన్నే తాను మాదిగలను పిలిపించి విచారిస్తానని చెప్పి మునసబు వెళ్లిపోయినాడు.

మరునాడు ఉదయాన్నే మాదిగవాళ్లను పిలిపించి సంగతేమిటని విచారించి పరిష్కారంచేద్దా మనుకొన్నాడు మునసబు. కాని అప్పటి కప్పుడే చాలాగాథ పెరిగి అనేకవిషయాలు అతని చెవికి వచ్చినవి. మాదిగలందరూ సభచేసి సమ్మెకట్టినారనీ, ఒకటి కాదు లక్ష యిచ్చినా సరే, ఈదెబ్బతోమట్టుకు చిన్నపరెడ్డిగుమ్మం తొక్కడానికి వీల్లేదనీ, ఆసాము లెంతహింసించినా వాళ్లు అన్నింటికీ తెగించివున్నారనీ యిట్లాంటివార్త లనేకం బయలుదేరాయి. తెల్లవారేవరకు గ్రామం అట్టుడికినట్లు ఉడికిపోతోంది. "అంత మదించి కిందూ మీదూ తెలుసుకోకుండా ఆడదాన్ని హత్యచేస్తే ఊరికేపోతుందా" అని కొందరూ, "పాపం నెల తిరగకుండానే చిన్నపరెడ్డి కన్ని కష్టాలు వచ్చిపడ్డ" వని కొందరూ, "డబ్బుచూపితే వాళ్లే వస్తారు. రా కేం చేస్తారు మాదిగ" లని కొందరూ

అంటున్నారు. చిన్నపరెడ్డికి కావలసిన బంధువు లందరూ మాదిగవాళ్ళుచేసే ఆలోచనలకి ఆగ్రహపూరితులై "ఈ దెబ్బతో చూడు, మాదిగవాళ్లను రూపుమాపుతా" మని హుమ్మస్సుతో గంతులేస్తున్నారు. వ్యవహారం శ్రుతిమించి రాగాన్న పడేటట్టుగా వున్నదని గ్రహించి మునసబు "రవంత నిదానించండోయి. ఇట్లా తొందర పడే చిన్నపరెడ్డి యింతవరకూ తెచ్చాడు వ్యవహార మంతాను. పూర్వపురోజులు కావివి. నిదానం మంచి" దని వాళ్లను శాంతపరుస్తూవచ్చాడు. పేరుప్రతిష్ఠల మాట ఎట్లా గున్నా సమయాన్ననుసరించి మాదిగలను నయాన్నా భయాన్నా సాధించి చచ్చినయెద్దును బయటికి లాగించి కార్యం కొనసాగించుకోవడంకంటె మరో గత్యంతరం లే దనుకొన్నాడు మునసబు.

పదిగంటలు కావచ్చింది. తాను పిలిపించినా గ్రామంలోకి వచ్చేటట్టు లేరు మాదిగలు. పూర్తిగా వేడిమీద ఉన్నారు. తొందరపడి ప్రయోజనంలే దను కొన్నాడు మునసబు. అదిగాక మొట్టమొదట చిన్నప రెడ్డి చేసినదంతా దుర్మార్గంఅని అతనికీ తెలుసు. అందువల్ల మాదిగవాండ్లతో ఎట్లాఅంటే అట్లా అడ్డంతిరిగి మాట్లాడితే వీలులేదని గ్రహించాడు. ఒకసారి చిన్నప రెడ్డియింటికి పోయి మాట్లాడివచ్చాడు. అతడు మహా సముద్రంలో ఉన్నాడు. "నీయిష్టప్రకారం చేసి యెద్దును

బయటికి సాగనంపే వుపాయం చూచి మానం కాపాడు మామా" అని చిన్నపరెడ్డి మునసబు రెండుచేతులూ పట్టుకొని దీనంగా ప్రార్థించాడు. మునసబు గ్రామచావడికి వచ్చాడు. గ్రామంలో ముఖ్యులు నలుగురు రెడ్లనూ పిలిపించాడు. విషయం సవిస్తరంగా చెప్పాడు.

"ఊళ్ళో చచ్చినగొడ్డును మాదిగాడు తీసుకుపోకపోతే మరొకరు వీళ్లతాత ఎవరు వచ్చి తీసుకొనిపోతా రనుకొన్నారో ఈ మాదిగలు? పిలిపించి నలుగురిలో అడగండి. ఈనాడు వీళ్లు కొత్తమామూలు తీసుకొస్తే అంతేనా? ఆ ఆటలు సాగవలసిందేనా? పిలిపించండి. ముందు పెద్దమాదిగవాణ్ణి పిలిపించి అడగండి" అని ఆ నలుగురులో ఒకరెడ్డి అన్నాడు. సరేనని పెద్దమాదిగవాణ్ణి గ్రామరచ్చకు పిలిపించారు. మాదిగలందరూ కూడబలుక్కొని "సరే, పోయి నిజం చెప్పేసిరా. భయ మేముంది? మననేం కోడతాూరా చంపుతారా? చంపితే చస్తాం లే" అని పెద్దమాదిగను పంపారు. వాడు రచ్చకాడికి వచ్చాడు. రెడ్లు నలుగురూ "చచ్చిన యెద్దును తీసుకొనిపోయే ఆలోచనచేసి, ఏదో ఆయనవల్ల నాలుగు పావులు అదనంగానే ఈనాం తీసుకోండి" అని పెద్దమాదిగతో అన్నారు.

"మావాళ్లు వినేటట్టులేదు సామీ! నన్ను ముక్కలుగా కోసినాసరే. ఈదఫాకు ఈపనిమాత్రం

చేయలేము'' అని చెప్పి దణ్ణంపెట్టి పెద్దమాదిగ వాడు వెళ్ళిపోయినాడు.

వ్యవహారం ఆఖరుకు గడ్డుబారింది. డబ్బాశ పెట్టినా తాడు పారేటట్టు కనిపించడం లేదు. ఎద్దు చచ్చి అప్పుడే రెండో రోజు. ఏనుగంతశవాన్ని దొడ్లో ఆవిధంగా పెట్టుకొని యింట్లో సంసారంచేయాలంటే భయంగా వుంది యింటిల్లిపాదికీని. ఏమి తీర్మానం చేశారో తెలుసుకురమ్మని మునసబుకాడికి చిన్నపరెడ్డి మనిషిని పంపాడు. తాడు బిగుసుకొన్నదని అతడు జవాబిచ్చాడు. చిన్నపరెడ్డికి కాలిమీద వ్రణబాధ జాస్తీగా వుంది. దొడ్లో పసరం బయటికి పోయేదారి కనిపించడం లేదు. ఇతరయెద్దులూ ఆవులూ బర్రెలూ — అన్నీ దిగులుపడి మేతమేయడం చాలించి రాత్రి తెల్లవార్లూ నిలబడి అంబా అంబా అని అరుస్తూ గుంజచుట్టూ తిరుగుతూ గలభాచేస్తున్నవి. తెల్లవారి వాటిని బయటికి తీసినపుడు ప్రతి పశువూ చచ్చిన ఎద్దుకాడికి పోవడమూ, అదొకవిధమైన బెదురుచూపులతో దాన్ని మూచూడడమూ ; మూచూడడంతోనే మొన్నటివరకు వాటితోకూడా తిరిగినగొడ్డు అయినప్పటికీ, అది చలనం లేకుండా పడివుండడం చూచి యితరపశువులన్నీ బెదురుకొని తోక లెత్తి చెవులు నిక్కబెట్టి నాలుగుకాళ్లమీదా ఒక్కసారి యెగిరి గంతువేస్తూ దూరంగా పారిపోవ

డమూ ఆరంభించినవి. పశువులదొడ్డి అంతా ఖంగాళీ అయి కళావిహీనమై భూతప్రేతపిశాచాదులు తాండవిస్తూవున్నట్టుంది.

మరునాడుకూడా సాయంత్రంఅయింది. మాదిగవాళ్లు ఎక్కినగుర్రాన్ని దిగలేదు. గ్రామం దద్దరిల్లిపోతోంది. ఎవరికీ కర్తవ్యం పాలుపోవడంలేదు. గ్రామమునసబు పోలీసువారికి రిపోర్టుచేద్దా మనుకొన్నాడు. చేస్తే మునసబుఅధికారం చేతిలో పెట్టుకొన్న తననే ఏదో విధంగా కూలీలచేత ఎత్తించి పారెయ్యమని ఉత్తర్వు చేస్తారేమో అని భయపడ్డాడు.

చీకటిపడింది. ఎద్దుకళేబరం నీచుకంపుకొట్టడం ఆరంభించింది. చిన్నపరెడ్డి ముక్కుకి వాసనకొట్టింది. తనకాలిమీది కురుపు వాసనఅయిందీ దొడ్లో ఎద్దువాసన అయిందీ మొదటలో అతని కవగాహన కాలేదు. రాత్రి పొద్దుపోయినకొద్దీ ఎద్దువాసన ఎక్కువైంది. చిన్నపరెడ్డికి దిక్కు తోచడంలేదు. చూడడానికి వారూ వీరూ వస్తూ పోతూ వున్నారుగాని మాదిగవాండ్లసంగతి ఎవరికీ అలవి కాలేదు. మునసబుకుకూడా ఆందోళన ఎక్కువైంది. గ్రామాధికారిగా వుండి ఇంతమాత్రం పని చేయించలేక పోయావని పై అధికార్లు చివరి కొచ్చేవరకు తననెత్తి మీదికి తెచ్చిపెట్టుతారేమోనని అతనికి ఖంగారు పుట్టింది. కాని యేంచేయగలడు పాపం? మాలవాడకు

చెప్పి పంపి పదిమందిని పిలిపించాడు. కల్లు పోయిస్తానని చెప్పి అనేకవిధాల పోరి వాళ్లను ప్రతిమలాడినాడు. "మాదిగవాళ్లు చేయవలసినపనిని మమ్మల్ని చెయ్యమంటారేందయ్యా?" అని వాళ్లు నోట్లోజవాబు నోట్లో వుండగనే వెళ్లిపోయారు.

తెల్లవారింది మూడోరోజు. ఎద్దును కుక్కలు తినకుండా ఈతాకుచాపలు కప్పి యిటికరాళ్లు ఎత్తిపెట్టారు. చిన్నపరెడ్డి సేద్యగాండ్లను పిలిచి ఈదఫాకు ఎల్లాగో మాట దక్కించమన్నాడు.

"ఎవరు చేసుకోవలసిన పనులు వాళ్లు చేసుకోవలసిందేకాని యిట్లాంటిదానిలో లక్షయిచ్చినా మావల్ల కా"దని వాళ్లు తిరగబడ్డారు. తెల్లవారేసరికి ఎద్దుకళేబరం కుళ్లి గబ్బు జాస్తీఅయింది. గవులుకంపు బయలుదేరింది. చుట్టుపక్కల యిరుగు పొరుగు వాళ్లకు దుర్భరమైంది వాసన. మాదిగలు చంకలు తట్టుకొంటున్నారు. చిన్నపరెడ్డి డబ్బాశ చాలా చూపించాడు. కాని అలగా జనంకూడా ఆతట్టు మెదలడమే చాలించుకొన్నారు. గ్రామంలో పెద్దలకు గత్యంతరం తోచడంలేదు. మునసబు గ్రామచావడిలో సభచేయించాడు. పెద్దల నందరినీ పిలిపించాడు. సభాపతి వేదాంతం సుబ్బావధానిగారినీ, రంగయ్యసెట్టినీ, రెడ్లనూ, చాకలి, మంగలి, కుమ్మరి వగైరా పనిపాటలవాండ్లనూ పిలిపించాడు. అం

దరూ చేరారు. పెద్దమాదిగనుకూడా పిలిపించమన్నారు. వాడు మళ్లా వచ్చాడు.

సభలో ధర్మసందేహాలు చాలా బయలుదేరినవి. "ఇట్లాంటి ఘట్టాలలో చిక్కువచ్చినపుడు ధర్మశాస్త్రాలు ఏం చేయవలసిందని చెప్పుతున్నవో శెలవివ్వవలసిం"దని అవధానిగారిని సభవారు ప్రశ్నించారు.

"చెప్పడాని కేముంది? వర్ణాశ్రమధర్మాలకు తలవెంట్రుకవాసికూడా లోపం రావడానికి వీలులేదు. ఎవరెవరి కులవృత్తులు వారువారు సశాస్త్రీయంగా చేసుకోవడమే కర్తవ్యమని ధర్మశాస్త్రం చెప్పుతున్న" దని అవధానిగారు శెలవిచ్చారు.

మునసబు :— అవును స్వామీ! ఇప్పుడు మాదిగలు వాళ్లపని వాళ్లు చేయడానికి నిరాకరించారుగదా. గ్రామంలో ఆ పశువు అట్లా కుళ్లిపోవలసిందేనా?

అవధాని:— వాళ్లపనివాళ్లు చేయడంలేదనడానికి మాదిగలయిష్టమేనా ఏమిటి? అట్లాంటి అధికారాలు ఏమీ వాళ్లకు లేవు.

మాదిగకులపెద్ద:— దణ్ణంపెట్టి చెప్పుతా సామీ! భామ్మర్లందరూ వారిపనులు వారు చక్కంగా చేస్తుండారా అంటా?

అవధాని:— అధిక ప్రసంగం చేయబోకు. బ్రాహ్మణుడు ఏమి చేసినా తప్పులేదని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నవి.

మునసబు :- ఈవాదన కేమిగాని అవధానిగారూ! ఇప్పట్లో మనం చేయతగ్గ దేముందో తమరు శెలవియ్యాలి.

అవధాని :— చెప్పానుగా. ఆపశువును మాదిగ వాళ్లే యెత్తి పారవేసితీరవలె.

మాదిగ :-"ఎందుకు సామీ ! తమ రిట్లా శెలవిస్తారు? పెద్ద పెద్ద ఆసాము లందరూ చేరి మమ్మల్ని ప్రాణాలతో బతకనివ్వకుండా చేశారు. ఒక్కపూట చెప్పులు తేవడం ఆలస్యమైందని చిన్నపరెడ్డిగారు ఆడదాని ప్రాణం తీసేశారు. ఏమో మాదిగోళ్లంటే అంత అలుసుగా వున్నారు కాబోలు మీఅందరికంటికీని. మామాదిగోళ్ల యినాం భూములన్నీ సర్కారులో కలిసి పోతూవుంటే మీరందరూ ఏంచేశారు సామీ? గ్రామానికి మాదిగ వాడు పనికిరానివాడా? చాకలోడికీ, మంగలోడికీ, కుమ్మరోడికీ, కమ్మరోడికీ - అందరికీ మాన్యాలు ఉంచి మాదిగోళ్లకిమాత్రం ఎందుకు లేకుండా చెయ్యాలి సామీ? మేం చేయలేము సామీ! ఈ చాకిరీలు. తమ రిష్టంవచ్చినోళ్లచేత చేయించుకోండి" అని చెప్పుతూ సభ విడిచి వెళ్లిపోయాడు.

అవధానిగారికి వ్యవహారం పరిష్కారం చేయడ మెట్లో ఆలోచన తోచలేదు. "మీయిష్టం వచ్చినట్లు చేసి ఎట్లాగో ఆయెద్దుకళేబరాన్ని బయటికి సాగనంపే వుపాయం చూడండి" అంటూ ఆయన లేచి పిర్రల కంటుకొన్నమట్టి దులుపుకొన్నాడు.

మునసబు—"లేవబోకండి స్వామీ! ఈపరిస్థితుల్లో మనం ధర్మశాస్త్రాలు తిరగవేస్తూ శుష్కప్రియాలు చెప్పుకొంటూవుంటే కార్యంలేదు. ఎట్లాగో అనుకొన్నపని జరిగించాలె. పూర్వపు కట్టుబాట్లు ఇప్పుడు లేవు. కాలం అంతా మారిపోయింది. గ్రామంలో శవం పడివుంటే అది నాపనికాదని ఎవరిమట్టుకు వాళ్లు చేతులు ముడుచుకొని కూచుంటే ఎట్లా? అది కుళ్లి ఊరికంతకీ మోసం తెస్తుంది. కాబట్టి నామాట విని మనలో పిన్నా పెద్దా, బ్రాహ్మణ అబ్రాహ్మణ అనేభేదం లేకుండా అందరమూ చేతులు కలిపి ముందు ఆయెద్దును బయటికి లాగి పూడ్చి పెడదాం రండి" అని అనేవరకు ఇక గత్యంతరం తోచక అక్కడ చేరిన నలుగురు పెద్దలూ సరే నని ఒప్పుకోవలసివచ్చింది.

అవధానిగారుకూడా పరిస్థితులబలాన్ని తప్పించుకోలేక సరే నన్నాడు. పెద్ద లందరూ, వర్ణవివక్షత లేకుండా సంఘాని కందరికీ సంబంధించిన కార్యంపట్ల నడుములు బిగించేవరకు, అదివరదాకా తప్పించుకొనితిరిగే

చిల్లరజనానికి సిగ్గు వచ్చి వాళ్ళుకూడా తయారైనారు. అంతా అయిదునిముషాల్లో ఏకైమంది పోగైనారు. ఎద్దు నిక గ్రామంలో వుంచడానికి వీలులేదన్నారు, పట్టండంటే పట్టండని మునసబూ కర్ణమూ అవధానీ పెద్దరెడ్డీ చిన్న రెడ్డీ చాకలీ మంగలీ యానాదీ వైశ్యా — ఒకరేమిటి, సమయానికి చేతి కందినవాళ్ళందరూ చేరి సాయం పట్టి యెద్దును ఊరిబయటకు తీసుకొనిపోయి ఎట్లాగైతేనేం భూస్థాపితం చేశారు.

మాదిగలందరూ పొట్టలుబ్బా నవ్వుకొంటున్నారు. తమపట్టు నెగ్గిందని సంతోషించారు. "కానీ చూతాం, ఎంతకాలమని యిట్లా మాదిగపనిఅంతా గ్రామస్థులు చేయగలరో, చూతాం లెండిరా" అని వాళ్ళింకా బిర్రుమీదనే ఉన్నారు.

## ౪

ముందుపరిస్థితులు ఎట్లాగున్నా చిన్నపరెడ్డికి ప్రస్తుతంలో ఒకగండం తప్పింది. కాని గండం తప్పిందని సంతోషిస్తాడా, లేక తనమూలాన్న గ్రామానికింతకష్టం వచ్చిందని దుఃఖిస్తాడా? పశ్చాత్తాప పడ్డాడు. సమయానికి మాదిగలు కట్టినసమ్మె తలుచుకొని ఆక్రోశపడ్డాడతడు. కాని తనది నిస్సహాయస్థితి. ఏమి చేయగలడు?

## కొత్తచెప్పులు

కాలికురుపుబాధ మరీ జాస్తీఅయింది. పాదం అంతా కుళ్లిపోయింది. బాధ భరించడం కష్టమవుతోంది. ఎన్ని సదుపాయాలు చేసినా అది తగ్గుదశలోకి రాలేదు. ఇక పల్లెటూరివైద్యం చేయించి ప్రయోజనం లేదను కొన్నాడు. ఆస్పత్రికి పోయి డాక్టరుకు చూపితేనేగాని వీలులేదని యింట్లో ఆడవాండ్లుకూడా తొందరచేశారు. సరేనని తెల్లవారుజామున బండి కట్టుకొని పదిమైళ్ల దూరంలోవున్న ఆస్పత్రికి తెల్లవారేవరకు చేరాడు.

డాక్టరు పరీక్షించాడు. అల్పాచమానం చూచాడు. చక్కెర (షుగర్) కనపడింది. వ్యాధి బాగా ముదరబెట్టా రన్నాడు డాక్టరు. కాలు తెగ గొట్టవలసివుంటుందేమో అన్నాడు. చిన్నపరెడ్డికి ప్రాణాలు నిలువునా ఎగిరిపోయినవి. ఎందుకనో అప్ర యత్నంగా నరిసి జ్ఞాపకంవచ్చింది; బెదురుకొన్నాడు. గుండె దడదడమన్నది. డాక్టరును చూచి బెంబేలు పడ్డాడు. కాలు పరీక్షచేసి ఆపరేషను చేయాలన్నాడు డాక్టరు; కాని నమ్మకం చెప్పలేనన్నాడు. 'అదృష్ట మెట్లా గుందో, ఆపరేషను చేయించండి' అన్నది భార్య. చిన్నపరెడ్డి పలకలేదు. నిస్పృహచెంది ఊరుకొన్నాడు. కొత్తచెప్పులింతపని చేస్తవని కలలోనూ అనుకోలేదు రెడ్డి. మధుమేహరోగికి క్లోరోఫారం ఇవ్వడానికి వీల్లేదన్నాడు డాక్టరు. క్లోరోఫారం యివ్వకుండా ఆపరేషను చేయిం

చుకోవడానికి రెడ్డికి భయంవేసింది. కాని చేయించుకోక విధిలేనట్లుగా వుంది. బాధ భరించుకోలేకుండా వున్నాడు. ప్రాణం పోయినా మేలే అనిపించిం దతనికి. "డాక్టరు గారూ ! తమయిష్టం వచ్చినట్లు చేయించండి" అన్నాడు రెడ్డి.

తెల్లవారింది. ఉదయం ఏడుగంటలకు చిన్నపరెడ్డిని వెల్లకిలా పండుకోబెట్టారు. మనిషికి శవాకారంపడ్డది. డాక్టరుకు నమ్మకం చాలలేదు. ఆపరేషనుకు ముందు జరుగవలసిన వ్రాతకోతలన్నీ జరిగిపోయినవి. తనతో వచ్చిన బంధువు లందరినీ ఆఖరుసారి ఒకపర్యాయం రెడ్డి చూడాలన్నాడు. చూపించి వాళ్ల నందరినీ డాక్టరు బయటికి పంపివేశాడు. తలుపులు వేశారు.

చిన్నపరెడ్డి అయోమయంలో వున్నాడు. ఇద్దరు మనుష్యులు తలతట్టున నిలబడి చెరొక రెక్కా పట్టుకొని క్రిందికి గట్టిగా అదిమిపట్టుకొన్నారు. తల ఒకరు అదిమిపట్టుకొన్నారు. రెండుకాళ్లూ ఇద్దరుమష్యులు కదలకుండా పట్టుకొన్నారు. చిన్నపరెడ్డి కళ్లు మూసుకొన్నాడు. నరిసి ప్రత్యక్షమయింది. బారుమని ఒకవెర్రికేకవేసి రెడ్డి పైకి గభాలున లేచి కూర్చోబోయినాడు కాని వీలుకాలేదు. అతని భౌతికశరీరమంతా అన్యాక్రాంతమై పోయివున్నది. కళ్లు మూసుకొంటే వెర్రిస్వరూపాలు గోచరిస్తూవున్నవి. చచ్చిపోయిన ఎద్దు జ్ఞాపకానికి

వచ్చింది. నరిసి వచ్చి నవ్వింది వికారంగా. కళ్లు తెరిచాడు రెడ్డి. డాక్టరు చేతిలో కత్తి కనిపించింది. బాబో యన్నాడు. డాక్టరు కళ్లకు గంతలు కట్టమన్నాడు. కట్టారు. విశ్వమంతా అంధకారమైంది రెడ్డికి. కుళ్లిపోయినకాలి మీదిచర్మం కాగితం ముక్కలా వేలాడుతున్నది. డాక్టరు కత్తెర తీసుకొన్నాడు. కత్తిరించవలసినచర్మం గుర్తుపెట్టుకొన్నాడు. రెడ్డిని పట్టుకొన్న మనుష్యులకు సంజ్ఞచేశాడు. రెడ్డికి ప్రపంచమంతా నరిసిస్వరూపం అయిపోయింది. కళ్లు మూసుకొనిఉన్నవో తెరచిఉన్నవో అతనికే తెలియలేదు. దాహం దాహంఅని అరిచాడు. ఇన్నినీళ్లు గొంతుకలో పోశారు. రెడ్డికి మళ్లా కొత్త చెప్పులూ, బుట్టాతో నరిసి కళ్లకు ప్రత్యక్షమయింది; విషపునవ్వు, వికారపునవ్వు, జాలినవ్వు నవ్వింది. ఇంతలో పాదంమీదిచర్మం పరపరమని తెగిపోతోంది. గుడ్డలా కత్తిరించేస్తున్నాడు డాక్టరు. 'బాబోయి నరసమ్మోయి, నరిసోయ్, చచ్చానురోయ్' అని అరవడం మొదలుపెట్టాడు రెడ్డి. కత్తిరింపు సగం అయింది. ఇక సగం కొరవుంది. చిన్నపరెడ్డికి చలనం తగ్గింది. డాక్టరు కత్తెర మార్చాడు. కాళ్లూ చేతులూ పట్టుకొన్నమనుష్యులచేతులకు రెడ్డిశరీరం చల్లంగా తగిలింది. డాక్టరుతో చెప్పారు. గుండెమీద చేయివేసి చూచాడు డాక్టరు. అప్పటికే హంస లేచిపోయింది. పాడుకట్టెను బంధువుల స్వాధీనం చేశారు.

# సన్మానం

వెంకటనారాయణ శింగరాయకొండ లేబరు స్కూలు టీచరు. నాలుగోఫారం పరీక్ష తప్పిపోయినందున హయ్యరుగ్రేడు ట్రెయినింగు ప్యాసయి, వారినీ వీరినీ ఆశ్రయించి అంతా మూడు నెలలకిందట లేబరు డిపార్టుమెంటు స్కూలులో నెల కిరవై' రూపాయల టీచరువుద్యోగం సంపాదించుకొని ఛార్జీ తీసుకొన్నాడు.

ఛార్జీ తీసుకొన్న మూడో నెలలోనే జిల్లా లేబరు ఆఫీసరుగారు ఏప్రిల్ నెల అయిదవ తేదీ ఉదయం ఎనిమిదిగంటలకు బడికి తణిఖీనిమిత్తం వస్తున్నామని అడ్వాన్సుగా వెంకటనారాయణకు నోటీసుకార్డు పంపారు.

నోటీసు ప్రకారం ఆఫీసరుగారు సరిగా ఆరోజున బడివద్దకు రావడమూ, వారు వచ్చేవరకు స్కూలు తలుపు తాళంవేసివుండి, వెంకటనారాయణగాని పిల్లలు కాని హాజరులో లేకపోవడమూ జరిగింది. ఇది చూచి ఆఫీసరు ఉగ్రుడయి పరవళ్లుతొక్కుతూ ట్రావెలర్సు బంగాళాలో తన మకాముకు చక్కాపోయినాడు.

పగలు పన్నెండుగంటలు కావచ్చింది. ఎండ మిటమిట లాడుతోంది. లేబరు ఆఫీసరుగా రప్పుడే భోజనంచేసి పడకకుర్చీలో పండుకొని సిగరెట్టు కాలు

స్తున్నారు. వారి జవానుకూడా అప్పుడే భోజనానికి పోయాడు. బంగాళాకాంపౌండులో గుడిసెలో కాపురం వున్న యానాదివా డొకడు వరండాలో కూర్చుని పంకా లాగుతున్నాడు.

వచ్చినపని కాకుండా, ఆ రోజు డయరీఅంతా వృధాఅయిపోయిందే అని విచారిస్తూ నోటీసు ముందుగా పంపినప్పటికీ వెంకటనారాయణ చూపించిన అవిధేయ తకు అతను ఎదుట పడితే ఎగిరి మింగేయా లన్నంత ఆగ్రహంతో నిట్టూర్పులు విడుస్తూ, నోటిలో ముట్టించిన సిగరెట్టు రెండు మూండు పీల్పులతోనే ఆఖరుచేస్తూ, ఇట్లా ఒకదానివెంట మరొకటి-చొప్పున ఇప్పటికి ఒకటీ — రెండూ — మూడూ — నాలుగుసిగరెట్లు తగలే శారు లేబరు ఆఫీసరుగారు. వారు అయిదోదాన్ని బయ టికి తీయబోతూవుండగా ఒక అరడజను బత్తాయిపండ్లూ, అరడజను కమలాపండ్లూ వగైరాలతో వున్న ఒక పేప తట్ట చేత్తో పట్టుకొని, ఎదుటబడితే ఏమిచేస్తారో దొర గారన్న దిగులుతో అడుగులో అడుగు వేసుకొంటూ, వరాండామె ట్లెక్కి పిల్లిలా నక్కుతూ నక్కుతూ అప్పుడే వచ్చాడు వెంకటనారాయణ. భయపడుతూ భయప డుతూ, దొరగారు పరుండివున్న గదివాకిలివద్దకు వెళ్లి, తట్టలో పళ్లు తీసి బల్లమీద పెట్టి 'రక్షించండి బాబూ! ఈ దఫాకు క్షమించండి' అని వంగి వంగి ప్రార్థించాడు.

"ఛీ! బయటికి పో. ఇడియట్! నిన్ను డిస్మిస్ చేస్తాను చూచుకో. బుద్ధుందా లేదా నీకు?" అని తోక తొక్కిన తాచులాగా కుర్చీలో పండుకొన్న లేబరు ఆఫీసరుగారు లేచి ఒక్క ఉరు మురిమారు.

"క్షమించం డయ్యా! పొరపాటు జరిగిందండి. బుద్ధిపూర్వకంగా చేసినతప్పు కాదండి. ఇంత పని జరుగుతుందని నేను కలలోకూడా అనుకొనివుంటే దొరగారు తమరి కింత ఆగ్రహం రాకుండానే చేసుకొనేవాణ్ని. ఇప్పుడయినా నా కథ యావత్తూ సాంతంగా వింటే దొరగారు నా మీద ఇంత ఆగ్రహపడరని మనవిచేసుకొంటున్నానండి" అని వెంకటనారాయణ రెండుచేతులూ జోడించి విన్నవించుకొన్నాడు.

"ఏంకథ? ఆ క థేమిటో — ఆ యేడు పేమిటో ఏం జరిగిందో చెప్పు — అదీ వింటాం" అని కొంచెం తమాయించి వెంకటనారాయణ ఏమి చెప్పుకొంటాడో సాంతంగా విందామని దొరగారు తిరిగి పడకకుర్చీలో వెనక్కి జేర్లబడి, ఆరో సిగరెట్టు ముట్టించి రెడ్డికంవేసికొని ఓరకంట వెంకటనారాయణను చూస్తూ కూర్చున్నారు.

వెంకటనారాయణ కొంత ధైర్యం తెచ్చుకొని గుండె దిటవుపరుచుకొని గొంతు సవరించుకొని తన చరిత్ర నీ విధంగా ఆరంభించాడు:

"తమ రీదినం అయిదవ తేదిని తణిఖీకి వస్తామని పంపిన నోటీసుకార్డు నాకు మొన్న మూడవ తేది ఉదయం పదిగంటల కందిందండి. తమ అనుగ్రహంవల్ల నాకీ శింగరాయకొండ గ్రామంలో నౌకరీ దొరకడమూ, నేను ఛార్జీ తీసుకొన్న మూడు నెలలకే తమరు నా స్కూలు తణిఖీకి వస్తామని నోటీసు పంపడమూ తలచు కొనేవరకు నాకు ఆనందం కలిగింది. నేను నౌకరీలో చేరినపిదప ఇదే తమరు మొదటిసారి తణిఖీకి రావడం కాబట్టి ఈసారి తమరిని హృదయపూర్వకంగా ఆహ్వానించి గౌరవించి తమరి నానందపరచి తమరివల్ల మంచి సర్టిఫికెట్టు పొందుదామని కోరిక పుట్టింది. నా స్కూలుకు రావడంతోనే తమరి మెడలో గులాబీపూలమాల వేసి, పండ్లూ వగైరాలు సమర్పించి తమరిని పూజిద్దామనుకొన్నాను. నిన్న నాలుగో తేదీ అంతా గడు వుంది కదా, నెల్లూరికి పోయి మంచి మాలా పళ్లూ తీసుకువద్దామని ఆరురూపాయలు చేత బుచ్చుకొని మొన్నరాత్రి ప్యాసెంజరులో నెల్లూరు వెళ్లానండి.

"తెల్లవారుజామున అయిదుగంటలకు నెల్లూరు చేరింది ప్యాసెంజరు. రైలు దిగి ఉదయాన్నే పెద్దబజారులో పువ్వు లమ్మే సాహేబుల అంగడికి పోయి మంచి రకం ఒకమాలకు రూపాయన్నరకు బజానా యిచ్చి, సాయంత్రం ఆరుగంటలకు మాల తయారవుతుందని

సాహేబు చెప్పినందువల్ల అతనితో సాయంత్రం వస్తానని చెప్పి వెళ్లిపోయాను. బజారులో రూపాయన్నరకు గజ నిమ్మపండ్లూ, ఆపిల్సూ, కమలాలూ తీసుకొని ఇంకా యితరపనులు చూచుకొని మధ్యాహ్నం పూటకూటింట భోజనంచేసుకొని సాయంత్రం ఆరుగంటలకు మళ్లీ బజారుకు వెళ్లానండి. పూలమాల తయారుగా వుంది. దాన్ని తీసుకొని ఒక బుట్టలో నలిగిపోకుండా భద్రపరచి, రాత్రి ఏడు, ఏడున్నరగంటలకు మళ్లీ పూటకూటింటికి వెళ్లి భోజనం చేశాను. పూటకూటాయనకు డబ్బు లిచ్చివేసినపిదప నా మనీపర్సులో మిగిలినపైకం లెక్క చూచుకోగా నేను తీసుకువెళ్లిన ఆరురూపాయలలోనూ రూపాయరెండణాలు మిగిలినవి. 'సరే, నెల్లూరినుంచి శింగరాయకొండకు సరిగా రూపాయేకదా రైలుఛార్జి - ఇంకో రెండణాలు అదనంగానే వున్న' వనుకొని పైకి తీసిన రూపాయి మళ్లీ పర్సులో పెట్టేసమయంలో దానికి అంచున చిన్ననొక్కున్నట్టు కనిపించింది. అరే, దూటబిళ్లలాంటి ఈ జార్జిమార్కు కొత్తరూపాయికి ఈ పాడునొక్కు ఎట్లా వచ్చిందా అని అనుమానిస్తూ దాన్ని కింద గచ్చుమీద వేసి కొట్టి మోగించాను. ఖంగుమని మోగింది. మళ్లీ రెండోసారి కొట్టాను. పూటకూటిల్లంతా మారుమోగింది. అనుమాన మెందుకు ఈ రూపాయి కనుకొని దాన్ని పర్సులోవేసి పండ్లు నాసూటుకేసులోపెట్టి దానికి తాళంవేశాను.

## సన్మానం

"రాత్రి తొమ్మిది తొమ్మిదిన్నర కావచ్చింది. శింగరాయకొండకు వెళ్లే ప్యాసెంజరు తెల్లవారు జామున నాలుగుగంటలకు చేరుతుంది నెల్లూరు. పూట కూటింట పడక వేస్తే మెళుకువ వస్తుందో రాదో, అర్ధ రాత్రి ప్రయాణం; వున్న యీ వొక్క రైలూ దాటి పోతే వచ్చినపనంతా వ్యర్థమయిపోవడమే కాకుండా దొరగారికి ఆగ్రహంగనక వస్తే మనకి బ్రతుకు తెరువు లేకుండాపోతుంది; వెళ్లి రైలుస్టేషనులోనే పడుకొంటే మంచిదని సూట్‌కేసు ఒకచేత్తోనూ, పువ్వులమాల బుట్ట మరోచేత్తోనూ పట్టుకొని వెన్నెట్లో స్టేషనుకు బయలుదేరాను.

"కాని దారిపొడుక్కీ నాకు రూపాయిమీద అను మానం బాధిస్తూనేవుంది. 'రూపాయిమోత చూస్తే బాగానే వుంది కాని ఆ టిక్కట్టిచ్చే వాడికంటికి నొక్కు కనిపిస్తుందేమో. మోత బాగా మోగినా నొక్కున్న రూపాయలు రైలువాళ్లు తీసుకొంటారో లేదో. ఆ టిక్కట్టిచ్చేవాడు రూపాయి మోగించి టిక్కెట్టు నా చేతిలో పెడితే సరే; ఒకవేళ అట్లా జరక్కపోతే ఏమిగతి? మనకీ పట్నంలో తెలిసినవా రెవ్వరూ లేరే! అందులోనూ అర్ధరాత్రిసమయం — అయినా రూపాయి పడకపోవడమే ఖాయమా? — పోనీ, ఎవరి కయినా దీన్ని చూపించి నొక్కున్నదని చెప్పకుండా

వాళ్లను అయ్యా! ఈ రూపాయి కేమి లోపమండీ అని అడిగితే, వాళ్లు దీని కేమయినా వంక పెట్ట గలరా? — కాని ఈ ఆలోచనకూడా బాగా లేదు. మనరూపాయిలోపం మనమే ఎందుకు బయలుపెట్టు కోవడం? ఎవరితోనూ ఈ రూపాయి ప్రస్తావనే చేయ గూడదు. మాట్లాడక స్టేషనుకు వెళ్లి హాయిగా తెల్ల వారుజామువరకూ పండుకొని టిక్కెట్లిచ్చేసమయంలో పోయి ఏమీ యెరగనట్లు బల్లమీద పడేస్తే ఖంగుమని రూపాయి మోగి వూరుకొంటుంది; సరేరా అని టిక్కెట్టు ఇవ్వనే యిస్తారు. అదీగాక, రాత్రివేళ, ఆ నిద్రకళ్లకి వాళ్ల కీ రూపాయినొక్కు అసలు కనిపిస్తుంది గనుకనా? మోగించాడంటే చక్కగా మోగే నా రూపాయి కేమిటి, రాత్రివేళ సగంనిద్రకళ్ల టిక్కెట్టిచ్చేవాడు పేరు పెట్టడ మేమిటి? — ఛా! ఛా! ఎందు కొచ్చిన అనుమానం ఇది. రూపాయికి వచ్చిన భయ మేమీలేదు'. అని యేవేవో ఆలోచనలు చేస్తూ స్టేషను చేరాను.

"నేను స్టేషనులో అడుగుపెట్టేవరకు మిషనరీ క్లాక్ టవరు టంగు టంగుమని పదిగంటలు కొట్టింది. మంచి శకునం. గంట కొట్టింది. ఇక ఫరవాలే దను కొని లోపల హాలులోకి వెళ్లాను. హాలుకు నడుంగా పైన పలకలద్దాలలాంతరు వేలాడుతోంది. దానిలోని

దీపంతప్ప యితర పెద్దదీపా లేమీా హాలులో లేవు. మూడో తరగతి ప్యాసెంజర్లు కొంతమంది బెంచీల మీాదా, కొంతమంది కిందా పండుకొని నిద్రపోతున్నారు. కొందరు కూర్చునే కునికిపాట్లు పడుతున్నారు. ఒక మూల ఒక ముసలాయన దగ్గుతున్నాడు; వేరొక మూల ఒక చంటిపిల్ల లేచి యేడుస్తోంది. ఒకపక్క కొంతమంది చుట్టలు కాల్చుకొంటూ లోకాభిరామాయణం మా ట్లాడుకొంటున్నారు. బయట రోడ్డు పక్క జట్కాలూ, ఎద్దుబళ్లూ వున్నవి. పదిన్నరగంట కావచ్చింది. నాకూ నిద్ర వచ్చీ రానట్టుగా వుంది. ఇంకో అరగంటకు మద్రాసునుండి మెయిలు వచ్చి వెళ్లిపోయింది. దానితో హాలులో సమ్మర్దం కొంత అణిగి అక్కడక్కడ కొద్ది పాటి ఖాళీ అయింది. 'తెల్లవారుజామునకదా నా రైలు వచ్చేది. ఈలోపల కాస్త కూర్కుపోదా' మను కొని తలకింద సూటుకేసు పెట్టుకొని పక్కన పువ్వుల బుట్ట పెట్టుకొని కాళ్లు చాచుకొని నడుము వాల్చాను.

"కళ్లు మూసుకొన్నాను; కాని నిద్ర పట్టలేదు. పైకి నిశ్శబ్దంగానూ, శాంతంగానూ వున్నా, లోపల గుం డెలు దడదడ రైలింజనులా కొట్టుకొంటున్నవి. ఏమీా భయంలేదని నాలో నేను ఎన్నిసార్లు ధైర్యం చెప్పుకొన్నా గుండె నిబ్బరం కలగలేదు. 'ఒకవేళ రూపాయి పడక పోతే యెట్లా? రైలువాళ్లకు మనతో మొగమాటం

గనకనా? ఈ రైలు దాటిపోతే గతేమిటి?' — ఇవే ఆలోచనలు. ఎంత అణచుకోందామన్నా ఈ ఆలోచన లణగటంలేదు. నిద్ర పట్టలేదు. లేచి కూర్చున్నాను. హాలంతా పరికించి చూచాను. రాత్రి పన్నెండు, ఒంటి గంట అయిపోతోంది. అంతా నిశ్శబ్దంగా వుంది. ఈ హాలులో ఇంతమంది ప్రయాణీకులలోనూ ఎవరికైనా నాకు లాగ ఇంత ఆందోళన వుంటుందా? హాయిగా నిద్రపోతారా వుండే?— మన కయితేమాత్రం ఎందు కాందోళన? గడియారం టంగు టంగుమని గంటలు కొట్టింది. మనకు జయమే అని మనస్సుకు దిటవు చెప్పుకొని మళ్లా కళ్లుమూశాను. కాని ఉహూ. మనస్సుకు శాంతి కలుగలేదు. 'తీరా రూపాయి మారకపోతే రేపు దొర గారి తణిఖీ యేమి కావాలె? స్కూలేమి కావాలె? నే నేమి కావాలె - ఇ దేమిరా భగవంతుడా! ఇట్లాంటి చిక్కులో పెట్టా' వనుకొంటూ ఆవేదనతో లేచి కూచుని కొంతసేపు అటూ ఇటూ పచార్లుచేశాను. తిరిగి మళ్లా వచ్చి నా మామూలుచోట పండుకొన్నాను.

"క్లాక్ టవరు రెండు గంటలు కొట్టింది. మూడు కొట్టింది. ఆఖరుకు నాలుగుకూడా అయింది. గుండెలు మహావేగంతో కొట్టుకొంటున్నవి. అప్పుడు నాది అ దొకవిపరీతమయిన స్థితి. టిక్కెట్లు తీసుకొనేవేళై మయిందన్నట్లు స్టేషన్ ప్లాటుఫారంమీద గంట గణగణ

వాయించాడు పోర్టరు. హాలులో నిద్రపోతూవున్న వాళ్లందరూ నిద్రలేచారు. ఒక్క నిముషకాలంలో టిక్కెట్లమ్మే కిటికీవద్ద పెద్దగుంపు చేరింది; జనం త్రొక్కులాడుకొంటున్నారు. స్థలం లేదు. ఒకరి నొకరు తోసుకొంటున్నారు. పెద్దరభసంగా వుంది. టిక్కెట్టు తీసుకొనేటందు కిదేరా సమయమని నేనూ లేచి పర్సులో రూపాయి పైకి తీసేవరకు ఒక ముసలి తురకసాహేబు డెబ్భయ్యేండ్లవాడు నా కడ్డంగావచ్చి 'మహారాజ్! ముసలివాణ్ణి. కళ్లు కనుపించవు. ఆ జనంలోకి పోయి టిక్కెట్టు తెచ్చుకోలేను. నాకు శింగరాయకొండ కోటిక్కెట్టు తెచ్చిపెట్టు మహారాజ్! నీకు సలాంచేస్తా' నన్నాడు. 'శింగరాయకొండకా? టిక్కెట్టా? — సరే తెస్తాను పైకంతే' అన్నాను నేను.

"సాహేబు తన వణకుచేత్తో సంచిలోనుంచి రూపాయి తీసి నా చేతిలో పెట్టాడు. 'ఇట్లా వుండాలి అదృష్టమంటేను. ఈతొందరలో రెండు రూపాయలూ ఒకేసారి టిక్కెట్లిచ్చేఆయన చేతిలో పడేస్తే ఆయనకు నా రూపాయి నొక్కు అసలే కనిపించదు. ఒక్క రూపాయి విడిగా ఇస్తే పరిశీలించడాని కవకాశంగాని రెండు రూపాయలూ జోడించి యిస్తే ఇక భయమేమిటి? బతికానురా భగవంతుడా!' అనుకొంటూ టిక్కెట్ల కిటికీదగ్గరికి వెళ్లానండి. జనసమ్మర్దం ఇంకా తగ్గలేదు.

"శింగరాయకొండకు రెండు టిక్కెట్లంటూ నాచేతిని బలవంతంగా ఇతరుల చేతుల పక్కనుంచి కిటికీగంతలోకి పోనిచ్చి రెండు రూపాయలూ బల్లమీద పెట్టాను.

"వాటిని టిక్కెట్లిచ్చేఆయన మోగించాడో లేదో —నాకు తెలియదు. నా చెవి కేమీ మోత విన పడలేదు. 'ఇదేరా పరీక్షసమయం. అటో ఇటో తేలిపోతుం దిప్పుడే' అనుకొంటూవుండగా 'ఈ రూపాయ పడ' దంటూ ఆ రెంటినీ తిరిగి నాచేతిలో పెట్టా డాయన.

"నోక్కు కనిపించిందికాబోలు! ఇక నేదిరా దిక్కు? అనుకొంటూ గుంపులోనుంచి తోసుకు బయట పడ్డాను. నా కేమీ పాలుపోలేదు. దిక్కూ దెసా తోచలేదు. వొళ్లంతా తేళ్లూ జెర్రెలూ పాకినట్లయింది. ఏమి చేయను? ఎక్కడికి వెళ్లను? ఎవరి నాశ్రయిం చను? ఎవరి నెరుగుదు నక్కడ? ఏమి బుద్ధి? అని యేమీ తోచక తన్నుకులాడుతుంటే నా సూట్కేసువద్ద తనమూట పెట్టుకు కూచున్న సాహేబు వచ్చి 'అయ్యా! టిక్కెట్టేదండి' అన్నాడు. 'లేదు, టిక్కెట్టు తేలేదు. నా రూపాయి మారదని రెండు రూపాయలూ ఇచ్చేశాడు. ఇదిగో నీ రూపాయి. నీ టిక్కెట్టు నీవే తెచ్చుకో. నే తేలే' దంటూ లాంతరు

దీపంవెలుతురులో రెండు రూపాయలూ నిదా చూచి నా నొక్కురూపాయి నేను జాగ్రత్తపెట్టుకొ అతని ఎడ్వర్డు రూపాయ అతని కిచ్చివేశాను. ఏమి చేయడానికీ తోచక కాలు కాలిన పిల్లిలా ఇటూ అటూ తిరుగుతూవుండగా అంతలోనే సాహేబు నాదగ్గరికి తిరిగి వచ్చి 'అయ్యో! ఇదేమిటి మహరాజ్! నా రూపాయి మారదని వాపసుచేశాడు ఆ టిక్కెట్టుపంతులు. మా దొడ్డపని చేశావు. నా మంచిరూపాయి నువ్వు తీసుకొని నీపడని రూపాయి నా కిస్తావు! నారూపాయి నాకియ్యి' అని గదిమాడు.

"నే నేమయినా పొరపాటుపడ్డానా అని మళ్లీ దీపం వెలుతురులో నా రూపాయిని పరిశీలించి చూచాను. అది నా రూపాయే — జార్జి చక్రవర్తి బొమ్మా, అంచున నొక్కూను. సందేహ మేమిటి? — సాహేబు కిచ్చినది సాహేబురూపాయే. పొరబడలే దనుకొని 'నీరూపాయే నీ కిచ్చాను సాహేబూ! నా పడని రూపాయి నీ కివ్వలే' దన్నాను.

"లేదు, మహరాజ్! చీకట్లో పొరపాటుపడ్డారు మీరు. నారూపాయి మంచిరూపాయి సామీ! నాది నా కిచ్చేయం డన్నాడు.

"ఏం చెప్ప నతనికి? లేదు సాహేబూ! నా రూపాయి నాకు గుర్తే. దానికి చివర నొక్కుం దన్నాను.

,య్యా నారూపాయి తీసుకొని నీపడనిరూపాయి కిస్తావుటయ్యా? బలే దొడ్డవాడివే. ఇచ్చెయ్యి నారూపాయి' అని గోల ప్రారంభించాడు.

"ఈ గోల కక్కడ హాలులోనివారు దగ్గరికి వచ్చి మమ్మల్ని చుట్టుకోవడం మొదలు పెట్టారు. ఎట్లాగ ఈసాహేబును నమ్మించడం? అతనికి కళ్లు కనిపించవు. అతని రూపాయి తీసుకొన్నప్పుడు మంచిదే అనే వృద్దే శంతో మోగించకుండా తీసుకొన్నాను, మొదట మో గించినా తీరిపోయేది. ఇప్పుడే మనుకుంటే ఏమిలాభం? అనుకుంటూ వుండగా చుట్టూ మూగినవారు తలొక మాటా అనడం మొదలు పెట్టారు. సాహేబు తొందర ఎక్కువయింది రూపాయి ఇచ్చెయ్యమని. ఆఖరుకు నా నొక్కరూపాయే మంచిదనీ, సాహేబురూపాయే చెడ్డదనీ నిశ్చయమయింది. అయితేమట్టుకు లాభ మేమిటి? సాహేబు నెట్లా నమ్మించడం? — అతనికి టిక్కెట్టు తీసుకువస్తానని యెరక్కపోయి వొప్పుకొ న్నాను. మొట్టమొదట లేనిపోని అనుమానాలకు పోయి చెడ్డాను అనుకొంటూవుండగా సాహేబు 'ముస లాణ్ని కళ్లు కనపడవుగనుక మోసం చేస్తావుటయ్యా? ఇచ్చెయ్యి నారూపాయి. రైలువస్తోంది. వెళ్ళా' లంటూ మరింత గంద్రగోళం చేశాడు. ఏమి చెయ్యా నిక. ఇక ఇవ్వక విధిలేదు — ఇదేమిరవ్వరా అని నారూపాయి

వాడిచేతిలో పెట్టి వాడిరూపాయి నేను తీసుకొన్నాను. నా నొక్కరూపాయితో టిక్కెట్టు కొనుక్కొని టింగురంగా అని చక్కాపోయినాడు సాహేబు.''

''ఆఖరకు బలే తమాషాగా జరిగిందోయి వెంకటనారాయణా! కథలాగే వుంది. తరువాత ఏమి జరిగిందేమిటి'' అన్నారు నవ్వుతూ లేబరు ఆఫీసరుగారు.

''ఇక నేనుంది స్వామీ! నే నక్కడ దిగడిపోవడం — దొరగారు తమరిరాకా — స్కూలు తణిఖీ తలచుకొనేటప్పటికి వొళ్లు కంపరమెత్తిపోయింది. ఏమి చేయడానికీ దిక్కుతోచలేదు. రైలు వచ్చేస్తున్నది. మతిపోయింది. మళ్లా కిటికీదగ్గరికి వెళ్లాను. టిక్కెట్టు పంతుల్ని శతవిధాల బతిమాలుకొన్నాను. ఎంత బతిమాలుకొన్నా ప్రయోజనం లేకపోయింది. నాదగ్గర రూపాయి చెల్లదంటే చెల్లదని తీసుకోనన్నాడు. సాహేబు సైంధవుడిలా అడ్డు తగిలి వాడిరూపాయి నా కంటగట్టిపోయినాడే అని దుఃఖం వచ్చింది. ఇక నేమి చేయనురా భగవంతుడా అనుకొంటూ వుండగా ప్లాటుఫారంమీాది కొచ్చేసింది రైలు. ఇక ఆలోచిస్తే కార్యం లేదనుకొని నాదగ్గర అదనంగా వున్న రెండణాలతోనూ ప్లాటుఫారంటిక్కెట్టు కొని ఒక్కపరుగున ప్లాటుఫారంమీాదికి వచ్చి పడ్డాను. రైలు దాటిపోతుందేమో అన్నఖంగారులో నాకెదురుగా వున్న పెట్టెతలుపు తెరచి

లోపలికి వెళ్ళి కూచునేవరకు — తీరాచూస్తునుగదా — అది ఇంటరుక్లాసయింది. అసలే టిక్కెట్టు లేదు; అందులోనూ ఇంటరు తరగతి ప్రయాణం! ఇ దేమిరా ఇట్లా వచ్చిం దనుకొంటూ, పువ్వులదండ జ్ఞాపకానికి వచ్చి చూచుకోగా ఆబుట్ట లేదు. తొందరలో స్టేష నులో మరచిపోయి వచ్చానని తెలిసిం దప్పుడు. దాని కోసం విచారిస్తూవుండగా రైలు పెన్నవంతెనమీదికి రావడమూ, ఇంతలోనే — అదివర కాబండిలో ఎప్పు డెక్కాడో టిక్కెట్టుకలెక్ట రొకడు టిక్కెట్లడుగుతూ వుండడమూ జరిగింది. వస్తే అన్నిచిక్కులూ వక్క మాటు వస్తవి — ఇ దేమి ఖర్మంరా భగవంతుడా అని హడిలిపోతున్న సమయంలో టిక్కెట్టుకలెక్టరు నా దగ్గరికి వచ్చి టిక్కె ట్టడిగాడు. నాదగ్గర టిక్కె ట్టేదీ? లేదని నాసంగతంతా చెప్పబోతూవుంటే వినక దొంగ తనంగా ప్రయాణం చేస్తున్నానని నాకు మద్రాసునుంచి ఇంటరు క్లాసుకు డబ్లిఛార్జి కట్టి నాపేరు వ్రాసుకొని నెల్లూరు తర్వాతి స్టేషను పడుగుపాడులో దింపివేసి స్టేషను మాస్టరు కొప్పగించి తనదారిని తాను చక్కా పోయాడు.

"ఏమని చెప్పకోను దొరగారూ! నా అవస్థ — తెల్లవారేవరకూ పడుగుపాడులో వుండి తెల్లవారిన తర్వాత ఆస్టేషనుమాస్టరు కాళ్లు పట్టుకొని ప్రార్థించి,

ఆయిన దయదలచడంవల్ల శింగరాయకొండకు టిక్కెట్టు తీసుకొని — ఈ పన్నెండుగంటల ప్యాసెంజరులో వచ్చి పడ్డానండి.

"ఈ లోగానే దొరగారు తమరు స్కూలుకు రావడమూ, నేను లేనన్న కారణంచేత కోపంచేసి ఇక్కడికి వచ్చేయడమూ జరిగిందండి — పోయిన పూలమాల పోనే పోయింది స్వామీ! ఈ పళ్లయినా తీసుకొని నన్ను కటాక్షించకపోతే —"

అని దీనంగా గద్గదస్వరంతో చెప్పుకొంటూ నిలబడివున్న వెంకటనారాయణ వైఖరి చూచేవరకు లేబరు ఆఫీసరు హృదయం కరిగి, జాలిపడ్డా డతనిస్థితికి; "సరే నీకు భయంలేదు. నేను రేపటిదినం స్కూలు తణిఖీకి వస్తా"నని చెప్పి అతన్ని వోదార్చటమేకాకుండా అతనికి రైలువాళ్లు కట్టిన డబ్లిఛార్జి ఏడురూపాయల న్నరా తానే యిచ్చేసి వెంకటనారాయణ నింటికి పంపేశాడు.

# వెంకన్న

## ౧

"అయ్యా! రాగయ్యా! శిస్తుపైకం యిప్పించుకొని రమ్మన్నాడయ్యా, రెడ్డి"
అని అంటూ తెల్లవారేవరకు యమకింకరుల్లాగ ఇద్దరు వెట్టివాండ్లు వచ్చి వాకిట నిలబడ్డారు.

రాగయ్యకు డెబ్బదేండ్లతొక్కు. ఇంకా నిద్రమంచంమీదనుంచి లేవనేలేదు.

"ఈ రెండురోజులూ నిదానించండర్రా. పిల్లవాడు ఊరినుంచి వచ్చి, కరణంకాడ లెక్కచూచుకొని పైకం కట్టేస్తాడు"
అని మంచంమీద కూచునే, వణికే కంఠంతో సమాధానం చెప్పాడు రాగయ్య.

"రెడ్డి ఒప్పుకోవడం లేదయ్యా! ఇయ్యాల ముడుపు ఇరసాలు అయితీరాలె, ఇంక నిలపడానికి లేదంటున్నారు మునసబూ, కరణమూను. పైకం యివ్వకుంటే ఎద్దుని పట్టుకొని రమ్మన్నాడు రెడ్డి"
అని వెట్టివాళ్లు ఇద్దరూ చెరొకకర్రా చేతపట్టుకొని, వాకిట్లో నిలబడ్డారు.

'ఎద్దుని జప్తిచేసి తీసుకొనిరమ్మన్నాడు రెడ్డి' అనేమాటలు రాగయ్యచెవిలో పడేవరకు అతనిమనస్సు కలుక్కుమన్నది. అతనికి డెబ్బైఏళ్లు వచ్చినవి. ఇంత వర కెన్నడూ అటువంటి చిన్నతనంమాట అత డనిపించు కొని ఉండలేదు. సర్కారుకు వెయ్యీ, పదిహేను వందలూ శిస్తుకట్టే మహామహా పెద్దపెద్దరె డ్లందరికంటె కూడా, చిన్నకాపు అయినా తాను ఒకరిచేత అడిగించు కోవలసిన అవసరం లేకుండా, ఏవాయిదా శిస్తు ఆ వాయిదాలో ముందుగానే మునసబుకు చెల్లించి రసీదు తెచ్చుకొనే బాధ్యత తెలిసినకాపు అతడు. తన హయాంలో తాను ఒకరికి చెప్పినవాడేకాని ఒకరిచేత చెప్పించుకొన్నవాడు కాడు. కాని ఈ నాటికి చిక్కుపడ వలసివచ్చింది. మునసబు పంపిన ఒక వెట్టివాడిచేత ఈ కాలానికి తా నావిధంగా అడిగించుకోవలసివచ్చింది! 'ఎద్దును పట్టుకొని రమ్మన్నాడు' రెడ్డి! పోగా మిగిలిన ఐశ్వర్యంలో తనవద్ద ఉన్నది, ఇంట బుట్టి పెరిగిన ఆ ఎద్దు ఒక్కటే! ఆ ఎద్దుజత కొక దున్నపోతు నాధారం చేసుకొని, ఆ నాలుగెకరాలకయ్యా ఎట్లాగో సాగుచేసు కొంటున్నాడు రాగయ్య. తన ఏకైకపుత్రుడు రమణ య్యతో సమానంగా పెంచుకొన్న ఎద్దు అది. దాన్నే జప్తిచేయాలని తలపెట్టాడు రెడ్డి. 'ఔరా దుర్దినం!' అనుకొన్నాడు రాగయ్య.

అతనికళ్ళవెంబడి గిర్రున తిరిగినై నీళ్లు. దొడ్లో గాట కట్టివేసిన ఎద్దు కళ్ళల్లో మెదిలింది. ఇంత బ్రతుకు బ్రతికి, బంగారంవంటి ఎద్దును పదిమందిలోనూ జప్తి చేయించుకొంటాడా తాను? అంతకంటె తన శిరస్సు నేల బడిపోవడం మేలుకదూ! అంతకంటె ఆ ఎద్దును ఏ కసాయివాడికైనా అయినకాడికి తెగనమ్మి సర్కారు శిస్తు కట్టివేయడం మేలుకదూ!

రోషం పుట్టేవరకు రాగయ్యకు కళ్ళెర్రనైనవి. కనురెప్పలమీద జారిపడ్డ తెల్లని కనుబొమ్మలు పైకెత్తేడు. ముడతలుపడ్డ ముఖంలో ప్రజ్వలించే ఆ రెండు నేత్రాల్లోనూ మిగిలిఉన్న రెండుచుక్కలు కింద రాలినై. కనుబొమ్మ లెత్తేవరకు నుదుటిమీద తాచుపాము పిల్లల్లాగ మూడుముడతలు పైకి ఉరికినై.

"ఒరే! పదిగంటలకు పైకం పంపుతానని రెడ్డితో చెప్పండి. అప్పటికి పైకం చేరకుంటే — అట్లనే మీ ఇష్టప్రకారం ఎద్దును తీసుకొనిపోవచ్చును. నేను చెప్పానని రెడ్డితో చెప్పం" డన్నాడు రాగయ్య.

వెట్టివాళ్లు వెళ్ళిపోయారు.

"ఏందయ్యా! ఎద్దుని తీసుకొనిపొమ్మంటున్నావు?" అని లోపల కుండలు కడిగే భార్య లక్ష్మమ్మ ఈమాటలు విని, బయటికి వచ్చి భర్త నడిగింది.

"సర్కారుకు చెల్లించవలసిన శిస్తు చెల్లించక పోతే అధికార్లు ఊరుకుంటారా? శిస్తు కట్తావా, ఎద్దుని జప్తిచేయుమంటావా అని మునసబు కబురు చేశాడు" అని చెప్పాడు రాగయ్య.

"అయ్యో! ఇదేం పోయేకాలమయ్యా! సర్కారుశిస్తు కట్టకుండా ఎగవేస్తా మనుకొన్నాడా రెడ్డి! అందరూ తనకిమల్లె కలిగినవాళ్లే ఉంటారా భూమిమీద? ఒకరోజు ముందూ వెనకా ఉండొద్దా ఎంతవాడికైనా?" అని బుగ్గలు నొక్కుకొని నిలబడింది లక్ష్మమ్మ.

"మునసబు త ప్పేముంది? వాళ్ల డ్యూటీప్రకారము వాళ్లు అడగడం న్యాయమే" అన్నాడు రాగయ్య.

"అందుకని, సాటి కాపువాడయికూడా, వాకిట వెట్టివాళ్లచేత ఎద్దుని జప్తిచేయించడానికి సిద్ధమవు తాడా? ఈయేడు గిద్దెడుగింజలుకూడా ఆ పొలంమీద కళ్లచూచినపాపాన్ని పోలేదే! శిస్తి ఎట్లా కట్తామను కొన్నాడా మునసబు?"

"మనరోదన అరణ్యరోదన. ఎందుకు నువ్వు ఆయాసపడుతావు? ఏది తప్పినా సర్కారుముడుపు తప్పుతుందా మరి?"

"నువ్వు మొదటినుంచీ ఇట్లాంటినీతులు చెప్పే సంసారం ఇంతకాడికి తెచ్చావు. నువ్వు శిస్తూ కట్టొద్దు.

ముడుపూ కట్టొద్దు. ఊరుకో! పల్లెలికి పోయిన పిల్లోడు రానీ! కరణంకాడికి పోయి లెఖ చూచుకొని కట్ట వలసిఉంటే వాడే కట్టి రసీదు తెచ్చుకొంటాడు."

"అయ్య వచ్చేదాకా అమావాస్య నిలుస్తుం దటే పిచ్చిదానా? సర్కారుకు మనములాజా ఏమీ ఉండదనుకో!"

"అయితే నీ మనసొచ్చినట్లు చేసుకో" అని విసుక్కొంటూ లోపలికి పోయింది లక్ష్మమ్మ.

గ్రామమునసబు అక్రమంగా తన పెనిమిటిదగ్గర డబ్బు గుంజుకొంటున్నాడేమోనన్న ఆక్రోశంకొద్దీ మాట్లాడవలసి మాట్లాడిందికాని భర్తమాట కెన్నడూ ఎదురాడేది కాదు ఆ భాగ్యశాలి. భర్తమీదనే ఆజవా బ్దారీ పెట్టి, తా నింట్లోకి వెళ్లిపోయింది.

౨

అప్పటి కప్పుడే వారంరోజులకిందట ఎడ్లుల బేర గాళ్లు పడమటినుంచి వచ్చి ఆ గ్రామంలో దిగి ఉన్నారు.

రాగయ్యకొడుకు రమణారెడ్డి పొగాకుబేరం మీద ఏటిఅవతల పల్లెల్లోకి పోయి పదిరోజు లయింది. అత డెప్పుడు వస్తాడో! వారానికల్లా తిరిగి వస్తానని నమ్మకం చెప్పిపోయిన కొడుకు ఇంకా ఇంటికి రాలేదు. అతడు వచ్చేదాకా సర్కారుశిస్తు నిలుస్తుందా? నిలవక

పోతే, పైకం ఎక్కణ్ణుంచి తీసుకొనిరాగలడు రాగయ్య? పదిగంటలకు పైకం చెల్లిస్తానని గ్రామమునసబుకి ఖండితంగా చెప్పి పంపాడు. ఆమాట పొరపాటయితే, ఎద్దుని జప్తిచేయకమానడు మునసబు. ఈ సారి తాను మూడో వాయిదాపైకంకూడా చెల్లించలేనని చెప్పితే, ఇంత వరకూ గ్రామమునసబు తనని ఒత్తిడిచేయకుండా నిలుపుకొని వచ్చాడు. కాని, ఇది ఆఖరువాయిదా! ఇక శిస్తు నిలపడానికి వీల్లేదని రాగయ్యకి తెలుసు. రెండు వాయిదాల శిస్తూ, కరణానికివ్వవలసిన జమాబందీ మామూలూ వగైరా లన్నీ కలిసి ఇరవైరూపాయలదాకా చెల్లించవలసి ఉంటుందని కరణం యిదివరకే చెప్పాడు. ఇంట్లో కూటికే చాలీ చాలకుండా ఉన్నవి ఈ యేడు పొలంలో పండిన గింజలు. ఏవస్తువయినా కుదువపెట్టి తెద్దా మనుకొంటే, భార్యమెడలో తాళిబొట్టు తప్ప మరొకటి ఏమీ లేదు. పిల్లవాడుగనక ఉంటే ఏమారాజునో అడిగి తీసుకొని వచ్చేవాడు. తాను ముసలివాడు. ఒకరిదగ్గరకు పోయి చేబదు లడగడానికి అభిమానం. అక్కడికీ, షాహుకారివద్దకు పోయి ఒకపాతిక రూపాయలు ప్రోనోటుమీద బదులడిగాడు. కాని, మేజరు అయిన కొడుకూ తనూ ఇద్దరూకూడా చేరి ప్రోనోటు వ్రాసియిస్తే రూపాయివడ్డీకి ఇస్తానన్నా డతడు; కాని హాజరులో తనకొడు కేడీ?

శిస్తుపైకం సర్దుబాటు చేయగల ఉపాయం అతని కేమీ తోచలేదు. అట్టే ఆలోచించాడు. పోనీ, ఎద్దుజతకి కట్టే మున్నపోతును అమ్మివేద్దామని ఆలోచన పుట్టింది. కాని దానిమీద ఏడెనిమిదిరూపాయలకంటె జాస్తిగా రాదే! పదిహేను ఇరవైరోజుల నుండి ఈసందుకట్ల పిల్లవాడు ఇంటిపొరుగున ఉండడమే లేదు. అందువల్ల పశువులకు సరిగా మేత అమరక, అవి చిక్కి శల్యమైపోయాయి. ఆమున్నపోతు అమ్మబోతే అడివీ, కొనబోతే కొరివీగా ఉన్నది. ఇక ఎటు వచ్చీ ఎద్దు ఒకటి ఉన్నది. దాన్ని అమ్మితే అప్పటిధరల్లో ఏ నలభయ్యో, ఏభయ్యో ఇస్తారు. అదిగాక అవసరంకొద్దీ కావలెనని అమ్మజూపితే, రూపాయిసొమ్ము అర్ధరూపాయికి అడుగుతారు బేరగాళ్లు. తాను శిస్తు కట్టకుంటే మునసబు ఎటు తిరిగీ ఆయెద్దును జప్తి చేసితీరుతాడు. తన ఇంట్లో అప్పటి కాయెద్దుతప్ప, విలువగల మరొక చరాస్తి ఏమిన్నీ లేదు. ఎద్దును జప్తిచేసి తీసుకొనిపోతే తా నేమిచేయగలడు? దాన్ని అయినకాడికి వేలంలోఅమ్మివేస్తే తా నేంచేయగలడు? తనకంఠంలో ప్రాణం ఉండగా, వెట్టివాడు తన ఆవరణలో అడుగుపెట్టి ఎద్దును పట్టుకొనిపోతూవుంటే తాను చూస్తూ ఊరుకోవడం ఎట్లాగ? అంతకంటె, పోతే పోయింది ఎద్దు, దాన్ని గుట్టుగా అమ్మివేసి సర్కారుశిస్తు కట్టేయడం తనకు

గౌరవంకదా! తన హయాంలో సంపాదించినఆస్తి ఎంత ఖర్చయిపోయింది కాదు? తన తండ్రి యిచ్చిన భూములూ, పశువులూ. ఎన్ని నష్టమైపోయినవి కాదు? ఇంట పుట్టిన ఎద్దని దీనిమీద మమకారంగాని, లేకపోతే ఈ ఎద్దు ఉండి తనని రక్షిస్తుందా? తన ఐశ్వర్యంఅంతా ఎట్లాపోయిందో ఇదికూడా అట్లనే పోయిం దను కొంటాం — అని ఈవిధంగా పనిచేయడం మొదలెట్టింది రాగయ్యబుర్ర.

రాగయ్య మళ్లా భార్యతోనయినా సంప్రదించ లేదు. కాలికి చెప్పులు తొడుక్కొన్నాడు. ఊరివెలపల మందబయట దిగిన ఎద్దులబేరగాళ్లవద్దకు వెళ్లాడు. వాళ్ల నింటికి పిలుచుకొని వచ్చాడు. ఎద్దును చూపించాడు. ఏభయి రూపాయలకు బేరం ఫయిసలు చేసుకొన్నాడు. డబ్బు చేతిలో వేసుకొన్నాడు. ఎద్దుమెడ పలుపు విప్పి బేరగాళ్లచేతిలో పెట్టాడు. దుఃఖం ఆపుకోలేకపోయాడు, బొటబొట ప్రవహించింది కన్నీరు. "నామహాలక్ష్మి పోతున్నదే" అని లక్ష్మమ్మ బారుమన్నది.

"మనకి ఋణం తీరిపోయింది — ఊరుకో" అని ఆమెకు ధైర్యం చెప్పాడు రాగయ్య.

"పసిబిడ్డని సాకినట్లు సాకాను. దానితల్లికి పుట్టిన దూడలు నాబిడ్డల్లాగే బతకకుండా చచ్చిపోతుంటే తిర

పతి వెంకటేశ్వర్లకి మొక్కుకొని, దీనికి వెంకన్న అని పేరు పెట్టుకొన్నాను. నాకు రమణయ్య ఒకకొడుకూ, ఇదొకకొడుకూ అనుకొన్నాను. — అయ్యా! వెంకన్నా! నాచేతినీళ్లు నీకు ఋణం తీరిపోయిందయ్యా? పోతుండావా? ఇక మళ్లా నాకళ్ళకు అగపడవూ? నిన్ను విడిచిపెట్టి నే నెట్లా ఉండేదే ఈకొంపలో? నువ్వు అగపడకుంటే రమణయ్య కూడు కుడిచి నీళ్లు తాగుతాడా..." అని ఎద్దుమీద చెయ్యివేసి తెగ ఏడుస్తోంది లక్ష్మమ్మ.

రాగయ్య లోలోపలనే కుమిలిపోతున్నాడు. మొగవాడు తాను. వయస్సు మీరిన అనుభవశాలి, కష్టసుఖాలు తెలుసుకొన్న జ్ఞాని. తనుకూడా ఆడదానిలాగ బెంబేలుపడితే ఎట్లా? "ఋణానుబంధ రూపేణ పశుపత్నీ సుతాదయః" అని పెద్దలు చెప్పేవాక్యం స్మృతికి వచ్చిం దతనికి.

"ఈ గొడ్డుమీద నీకెందు కీమమకారం? ఋణం తీర్చుకొని దానిదారిని అది వెళ్లిపోతోంది; నువ్వు ఏడవబోకు" అని భార్యకు ధైర్యం చెప్పి తాను ధైర్యం తెచ్చుకొన్నాడు.

బేరగాళ్లు ఎద్దుపగ్గం పట్టుకొని బరబర లాక్కొని పోయారు.

ఎద్దులేక బారుమన్నదొడ్డి చూచుకొని లక్ష్మమ్మ మళ్లా బారుమని దొడ్లోనే ఏడుస్తూ కూర్చున్నది.

రాగయ్య ఇంట్లోకి పోయి, చుట్ట ముట్టించి, వాకిలిముంగిట గోడ కానుకొని గొంతుకూర్చున్నాడు. దుఃఖభారకంపితమయిన తన హృదయాన్ని స్వస్థపరుచుకొంటున్నాడు. కొడుకు రమణయ్య వచ్చి సంగతి తెలుసుకొంటే, తగవులాడుతాడేమో అని అతనికి సందేహం కలిగింది. కాని అంతలోనే ధైర్యం తెచ్చుకొంటున్నాడు; నెత్తిమీది బరువు దింపుకొనేనిమిత్తం అమ్మవలసివచ్చిందని చెప్పితే, పిల్లవాడుమాత్రం కాదంటాడా? అని అనుకొన్నాడు.

వీధిలో మళ్లా ప్రత్యక్షమయారు వెట్టివాళ్లు.

"నేను ఎంతపైకం కట్టవలెనో కరణంచేత కాగితంమీద లెఖ వేయించి తీసుకొనిరండి. పైకం యిస్తాను. తయారుగానేవుంది" అని వాళ్లతో చెప్పాడు రాగయ్య.

"కరణమూ రెడ్డీ కచ్చేరిలో కూచునిఉండారు. నువ్వే ఆడదాకా వచ్చి పైకం చెల్లించి రాగూడదయ్యా?" అని అడిగారు గ్రామనౌకర్లు.

రాగయ్యకు వీధిలో పడి నలుగురిమొఖమూ చూడడానికి సిగ్గయింది; గ్రామాధికార్ల సమక్షంలోకి పోవడానికి తల కొట్టినట్లయింది: మనస్సు కిష్టపడలేదు.

"నేను చెప్పానని చెప్పితే కరణం లెఖ తేల్చి యిస్తాడు లేరా. నాకు వంట్లో వుసులుగా లేదు. నేను

ఇప్పుడు నడిచిరాలేను. కాగితం రాయించి తీసుకొని రండి. ఇదిగో! పైకం సిద్ధంగా వున్నది'' అన్నాడు రాగయ్య.

కరణం లెఖ వేసి, మూడు, నాలుగువాయిదాలకు ఇవ్వవలసిన మాగాణిశిస్తూ, ఉత్తరువు లేకుండా సాగుబడిచేసినందుకు తీర్వజాస్తి నీటి అపరాధమూ, రోడ్డుసెస్సులూ, విద్యపన్నూ, తన జమాబందీ మామూలూ, డి. పి. డబ్ల్యు ఓవర్‌సీరుకి చెందవలసిన మామూలూ, — అమాంబాపతులూ కలిసి రు.౧౯-౧౨-౦లకు లెఖ తేల్చి కాగితంమీద వేసిపంపాడు. పైకం వెట్టివాళ్ళపరంగా యిచ్చి పంపివేశాడు రాగయ్య. శిస్తు కట్టగా మిగిలినపైకం రు. ౩౦-౪-౦ లూ తీసి, పెట్టెలో భద్రం చేసుకొన్నాడు.

ఆరోజు పడమట బారెడుపొద్దు తిరిగేవరకూ లక్ష్మమ్మ వంటచేయకుండా ఏడుస్తూనే ఉన్నది.

పొద్దు గూకేముందు ఇన్ని మెతుకులు కొరికాడు రాగయ్య. ఉదయం తొమ్మిది గంటలకల్లా తోలి పెట్టిన ఎద్దుసాయంత్రందాకా తనకళ్లబడకుండా వున్నందువల్ల అతనికి మనస్సు ఉండబట్టడం లేదు: పొద్దుగూకినతర్వాత మందబయటికి పోయి, బేరగాళ్లమందలో కలిసిపోయిన ఎద్దును ఒకసారి చూచుకొని మరీ ఇంటికి వచ్చాడు.

ఆ రాత్రి వేకువనే బేరగాళ్లు ఎద్దుమందను తోలుకొని పడమటికి వెళ్లిపోయారు.

## 3

రాగయ్య కడుపున ఎనమండుగురు సంతానం కలిగారు. కాని అతనికి వృద్ధాప్యం వచ్చేవరకు మిగిలినవాళ్లల్లోకల్లా కొడుకు రమణయ్య ఒకడున్నూ, కూతురు వెంకమ్మ ఒకతీని. ఆడపిల్ల పెద్దమనిషయి భర్తతో సంసారం చేసుకొంటోంది. రమణయ్య ఇప్పుడు పాతికేళ్ల వాడు. ఇటీవలనే మేనమామకూతురిని ఏటిఅవతల వివాహం చేసుకొన్నాడు. కాని ఆ పిల్ల ఇంకా పసిది: కాపరానికి రాలేదు.

రాగయ్యతండ్రి చనిపోయేటపుడు పదహారెకరాల మాగాణీ, నాలుగెకరాల పశువులబీడూ, రెండెకరాలతోటా, దొడ్డీ, కపిలెభావీ, ఇల్లూ, రెండుగాళ్ల ఎద్దులూ, నాలుగు పాడిపశువులూ వగైరా స్థిరచరాస్తులంతా కలిసి ఏడెనిమిదివేలరూపాయలఆస్తి వప్పచెప్పే చనిపోయాడు. కాని ఆస్తితోకూడా తన హయాంలో చేసిన నాలుగువేల రూపాయల అప్పుకూడా చూపించి మరీపోయాడు. రాగయ్య వయస్సులో ఉండంగా కష్టపడి ఆపదహారెకరాల పొలమూ పండించుకొని దాని మీద వచ్చే ఆదాయంలో, అప్పులవాళ్లకి ఏటా కొంత

చెల్లువేసి, అంతా పదిపన్నెండేళ్లలో అప్పులేకుండా చేసుకొని, ఆస్తిని మిగుల్చుకోందామని తాపత్రయ పడ్డాడు. కాని, పాపం, అప్పటి కతడు ఒంటరిగాడు. ఇంటిదగ్గర సంసారమూ, పొలంలో సేద్యమూ — ఈ రెంటితో తా నొక్కడూ తూగలేకపోయాడు. అదిగాక, చిన్నతనంలోనే తనకు భగవంతుడు సంతాన ప్రాప్తి కలగజేసినందుకు, ఏ మొగపిల్లవాళ్లయినా, ఒకరిద్దరు బయలుదేరిఉంటే, ఏదో బఱ్ఱెగొడ్లులనయినా మళ్లవేసుకొనివచ్చేటందుకు ఉపయోగపడేవారు. ఆప్రాప్తంకూడా లేకుండా లక్ష్మమ్మ వరస వరసగా ఆడపిల్లలను కనడమూ, పుట్టిన వాళ్లు నష్టమైపోగా, ఇప్పుడు వెంకమ్మమాత్రం మిగలడమూ జరిగింది.

నాలుగువేల రూపాయల అప్పు తీర్చాలంటే సాధ్యమైన పనేనా? అవసరం కొద్దీ, తనతండ్రి ముక్కాలు రూపాయీ, రూపాయీ, రూపాయి పావలా — ఈ ప్రకారం బ్రహ్మాండమైన వడ్డీలమీదచేసిన అప్పు. ఈ అప్పుల్లో ఏటా అంతకం తిరిగే ప్రోనోట్లు కొన్నీ, రెండేళ్లకి అంతకం తిరిగేవి కొన్నీ, మూడేళ్లకి తిరిగేవి కొన్నీని. వడ్డీ అసలు కలిసేవరకు, పాపం పెరిగినట్లు, ఇబ్బడికి ఇబ్బడయి పోతోంది అప్పు. ఒకవేళ పొలంమీద వచ్చేగింజలమ్మా, తోటలో పండే మిరపకాయ లమ్మా, ఇంట్లో పెరిగిన కోడెదూడల నమ్మా, పదివరాలు పోగుచేసి

బాకీలోకి ఏవందో, రెండువందలో చెల్లువేసినప్పటికీ, అసలు అసల్లాగే ఉండడంసరిగదా, వడ్డీలోకికూడా సరి పోవడం లేదు ఆ చెల్లు. దీనికితోడు బాకీదార్లుకూడా అప్పులు కట్టుమని తొందర చేస్తూవచ్చారు. ఇక ఇది పనిగా దనుకొని తండ్రి గతించిన నాలుగేళ్లకల్లా ఆరు వేలదాకా పెరిగిన అప్పుకు సరిపోయే పొలం అయిన కాడికి తెగనమ్మి ఋణబాధఅనేది లేకుండా చేసుకోవా లని నిశ్చయపరుచుకొని పదహారెకరాలలో పది ఎకరాల మాగాణీ, రెండెకరాలతోటా అమ్మివేసి ఋణబాధ పూర్తిగా నివర్తిచేసుకొన్నాడు రాగయ్య. ఇప్పుడు పోగా మిగిలి ఉన్నది నాలుగెకరాల మాగాణికయ్యా, నాలుగెకరాల బీటికయ్యామాత్రమే.

కష్టపడి చేసుకొంటే మాగాణికయ్య మంచిదే. కనీసం ఎకరా పుట్టిచొప్పున నాలుగెకరాలూ నాలుగు పుట్లు నమ్మకంగా పండితే సర్కారుశిస్తులూ, సేద్యపు ఖర్చులూ పోను, తన కుటుంబం కునవర్తికి సరిపోతుంది; పరవాలేదు. కాని రాగయ్య అదృష్టానికితోడు ఇప్ప టికి అయిదారేళ్లనుంచి ధాన్యానికి ధర తగ్గిపోవడం సంగతి ఎల్లా ఉన్నా. నాలుగేళ్లక్రిందట కొట్టిన గాలివాన సంవత్సరం మొదలు ఎందువల్లనో చెరువుకి సకాలంలో నీరు ఎక్కడమూ లేదు, పంటలు సరిగ్గా పండడమూ లేదు. ఎంత ఎరువు తోలినా, ఎంత సత్తువ చేసినా,

రాత్రింబగళ్లు కయ్యి విడిచిపెట్టకుండా దాంట్లోనే పండు కొన్నాకూడా, ఎకరానికి పందుం, పన్నిద్దుంగింజలు రాలేవరకు కటకటయిపోతోంది. ఈ ఆదాయం చాలక ఈ మధ్య రమణయ్య పొగాకుబేరం ఒకటి పెట్టుకొని, సేద్యం నాద్యంలేని తీరుబడిరోజుల్లో ఏదో పదిరూపాయల పొగాకు కొని, దాన్ని ఏటి అవతల పల్లెల్లోకి ఎత్తుకొని పోయి, మారుబేరానికి అమ్ముకొని తన పొట్ట గడవగా, నాలుగుపావులు మిగిలితే ఇంటికి చేర్చుకొంటున్నాడు. శరీరకష్టం అంటే అతగాడికి ఒక లెఖలోది కాదు. మంచి వయస్సులో ఉన్నాడు. అతనికి తల్లి తండ్రి అంటే పంచప్రాణాలూను. ఆ తల్లితండ్రులుకూడా రమణయ్య అంటే అదేవిధంగానే ఉంటారు.

రమణయ్య నెత్తిన పొగాకుమూట పెట్టుకొని పల్లెల్లోనికి పోయి పదిరోజులు దాటింది. ఒకవేళ ఏటి అవతలికి పోయినా, ఎప్పుడుగాని వారంరోజులకంటె ఎక్కువగా నిలిచేవాడు కాదు. అట్లాంటిది ఈసారి మాత్రం ఎందువల్లనో పదిరోజులు దాటికూడా ఇంకా ఇంటికి చేరుకోలేదు.

వెంకన్న నమ్మి నాలుగురోజు లయింది: అయిదు రోజు లయింది: ఆరయింది: ఏతత్సంబంధమయిన ఎడబాటు రాగయ్యకీ, లక్ష్మమ్మకీకూడా పరిపాటయి పోయింది. బిడ్డ రమణయ్య ఇంకా రాలేదేమా అని

ముసనళ్లు కొడుకుమీద మరులు నిలుపుకోలేకపో తున్నారు. వెంకన్న విడిచినయింట్లో రమణయ్యఅయినా తిరుగుతుంటే, ఆవృద్ధుల కదొకవిధమైన తృప్తీ, ఆనంద మూను.

ఏడోరోజు ఉదయం తొమ్మిదిగంటలకు రమ ణయ్య ఇంటికి చేరాడు. వీథివసారాలో మంచంమీదనే పండుకొనిఉన్నాడు తండ్రి రాగయ్య. లక్ష్మమ్మ దొడ్లో కుండలు కడిగిననీళ్లు బర్రెగొడ్డు తాగే తొట్టిలో పోస్తు న్నది. రమణయ్యఅడుగుల చప్పుడు విని, దిగ్గున మంచం మీద లేచి కూర్చున్నాడు రాగయ్య.

"ఈ తడవ ఇన్నాళ్లు నిలిచినావేమి నాయనా!" అని ఆప్యాయంగా కొడుకుని అడిగాడు.

"ఏందో ఆలస్యమే అయిందే; ఈ తడవ పోయిన వాణ్ణి ఎట్లాగా పోయానుకదాఅని మామగారి ఊరికి కూడా పోయి, పిల్లవాళ్ళని చూచి వచ్చా" అన్నాడు రమణయ్య.

కొడుకుమాటల సవ్వడి విని, ఇంట్లోనుంచి వాకి ట్లోకి వచ్చింది తల్లి.

"ఏందీ! మామగారియింటికి పోయివచ్చావా? అందరూ బాగుండారా?" అని తానుకూడా అడిగింది.

"ఆ! అందరూ బాగానే ఉండారు. మామ కాలు ఈమధ్య ఎద్దు తొక్కిందట. పాదం అంతా మోపుచేసి వారంరోజులుగా ఆయన లేవలేకపోతు న్నాడు" అని సమాధానం చెప్పాడు రమణయ్య.

"అయ్యో! మరి ఆ సంగతి చెప్పి పంపనేలేదు చూడు వాళ్లు. పోయి చూచేనా వద్దును ఒకసారి" అన్నది లక్ష్మమ్మ.

"ఇప్పుడు నయమయిందిలే: ఎవరో మంగలివాడి చేత కాలు తోమిస్తుండాడు. ఇప్పు డిప్పుడే కాలు కింద పెట్టి లేచి తిరుగుతున్నాడు."

"సరే: బాగానే ఉండది" అంటూ లక్ష్మమ్మ లోపలికి వెళ్లిపోయింది.

"ఎండపడింది. కాళ్లూ మొఖమూ కడుక్కొని, చద్దినీళ్లు తాగు నాయనా! బెట్టపడిందే ఆ మొఖం" అన్నాడు తండ్రి.

నెత్తిని చుట్టిన గుడ్డ తీసి మంచంకోడుమీద వేసి, జుట్టుముడి విప్పి, రెండు చేతులా దులుపుకొని మళ్లా ముడివేసుకొన్నాడు రమణయ్య. పళ్లుతోముకోను దొడ్లో వరల బావికాడికి పోయి, ఎద్దు సంగతి జ్ఞాపకానికి రాగా, పశువులచప్పారంలోకి పోయి చూచాడు. దున్న పోతుమాత్రం గాట కట్టివేసిఉన్నది. ఎద్దు లేదు.

పాలు తాగే బర్రెదూడ పండుకొని నెమరువేస్తోంది. బర్రె పొలం పోయిందికాబోలు ననుకొన్నాడు. మరి ఎద్దు ఏమయిందా అని సందేహం కలిగింది.

బావికాడ పళ్లు తోముకొని మొఖమూ కాళ్లూ కడుక్కొని ఇంట్లోకి వస్తూ,

"ఎద్దునికూడా పొలం తోలిపెట్టావా ఈ పొద్దు" అని తల్లిని అడిగాడు.

"పొలమూ లేదు, వల్లకాడూ లేదు నాయనా!" అని నిట్టూర్చింది తల్లి.

"మరిఏమయిందీ ఎద్దు ?"

"పడమటి ఎద్దులబేరగాళ్లకి ఏభయిరూపాయలకి అమ్మివేశాడుమీాఅయ్య. ఏం చెప్పమంటావు నాయనా?" అని కన్నీరు నించింది పొయ్యికాడ కూర్చున్న తల్లి.

రమణయ్య నడుం కర్రేలుమన్నది. ఎద్దును అమ్మడమేమిటో అతనికి అర్థం కాలేదు.

వాకిట్లోకి పరుగుపెట్టాడు.

"ఎద్దు నెందుకు అమ్మావే, నాయనా?" అని తండ్రిని అడిగాడు.

"సర్కారు శిస్తుకి రెడ్డి తొందరచేశాడు. నువ్వా సమయానికి ఇంటికాడ లేకపోతివి. నేను ముసలాణ్ణాయి

లేవలేకపోతిని........" అని ఏమో చెప్పబోయాడు రాగయ్య.

రమణయ్యకు చికా కనిపించింది :

"ఏమిశిస్తే? ఈ యేడు మనకయ్యలన్నీ ఈటుపోయినవి. మన కీయేడు శిస్తు ముజరాఇస్తారని నాతో చెప్పాడు కరణం. ఇంకా శిస్తు – శిస్తు – దానితల్లికడుపు కాలినశిస్తు — ఇంకా శిస్తు ఎక్కణ్ణుంచి వచ్చిందే" అని పెద్దగా అరిచాడు రమణయ్య.

"నా కేం తెలుసు ఆసంగతి? ఇరవై రూపాయలు శిస్తు కట్టాలి. కట్తావా లేకపోతే ఎద్దుని జప్తిచేయమంటావా అని రెడ్డీ, కరణమూ చేరి వెట్టివాళ్లని ఇంటి మీదికి పంపించారు. నన్నేంచేయమంటావు చెప్పు?"

"అయితేమట్టుకు; నేను వచ్చేవరకూ నిలవనైనా నిలవకుండా బంగారంవంటి ఎద్దును అమ్ముకొంటారటయ్యా? నీ కెవరు చెప్పారే ఈ సలహా?"

"చెప్పాను నాయనా? 'పిల్లోడు వస్తాడు, రెండు రోజులు నిదానించండయ్యా' అని బ్రతిమలాడుకొన్నాను. కాని వాళ్లు మనమాటలు వింటావా ఛేస్తారా?"

"అయ్యొయ్యో! ఎంతపని చేశావయ్యా? నోటి కాడకూడు పోగొట్టుకొంటారటయ్యా ఎవరైనాను? నీకే మంతతొందర వచ్చిందే, నేను రాకుండానే నిక్షేపం

వంటి ఎద్దును నాశనంచేశావుగదయ్యా అని కింద కూలబడ్డాడు రమణయ్య.

"మన వెంకన్నకీ, మనకీ ఋణం తీరిపోయింది నాయనా. బిడ్డని సాకినట్లు ఎనిమిదేళ్లు సాకాను. ఏం క్రియ ? బంగారంవంటి ఎద్దుని అమ్మి పైకం కట్టేదాకా నిలవనిచ్చాడా ఆరెడ్డి ? సాటికాపువా డయితేమట్టుకు, ఏం ప్రయోజనం? ఏం చేస్తాం? మనఖర్మ అట్లా తెల్లవారింది" అని కంట నీరుపెట్టుకొంది లక్ష్మమ్మ.

"నీ కెవడు చెప్పాడయ్యా ఈ ఆలోచన ? అయ్యయ్యో. బంగారం. బంగారం కాని అది ఎద్దా ? ప్రాణంతో సమానంగా సాకుకొన్నానయ్యా దాన్ని. ఆ ఎద్దు నాధారంచేసుకొని ఆ నాలుగెకరాలకయ్యా చల్లుకొంటున్నాను. నాశనం అయిందిగదయ్యా నాఎద్దు" అని రమణయ్య వలవల ఏడుస్తున్నాడు.

"ఊరుకో నాయనా, ఊరుకో. తీరిపోయింది, దానికీ మనకీ ఋణం తీరిపోయింది. నేనూ ఇట్లాగే మనస్సు పట్టలేక ఈ వారంరోజులూ ఏడ్చాను. ఏం చేస్తాడు మీనాయనమట్టుకు? ఇంతకాలమూ బతికి వెట్టివాళ్లచేత ఎద్దుని వేలంవేయించుకోడానికి, ఆయనకు తలకొట్టినట్లనిపించి, ఆఖరికి ఆ యెద్దునయినా అమ్మి, సర్కారు బదనాయం తొలగించుకోవలసివచ్చింది. — లే ; ఊరుకో. రమణా ! ఊరుకో."

రమణయ్యకు ఎక్కిళ్లు వస్తున్నవి.

"పశువయితేమట్టుకు, పశుజన్మ ఎత్తవలసిందా అది? పసిబిడ్డే! ఒకర్ని మ్మాడించి ఎరుగా? ఒకతో కాడించి ఎరుగా? కాలు జాడించి ఎరుగా? సాధువంటే సాధువా — అది, ధర్మరాజే! మాటలు నేర్చిన గొడ్డు. తిరపతి వెంకటేశ్వరులు మళ్లా మన ఇంట వెలిశాడని సంతోషించాం. మనఇంట బుట్టినదూడ మన ఇంటనే మట్టి అవుతుం దనుకొన్నాం. ఇంతకీ దానికి సుఖపడేయోగం లేదు........"

"...................."

"ఆ పడమటివాళ్ల చేతుల్లో పడింది. దాని రాత ఏరాళ్లపాలు గావలసిఉన్నదో? ఏకసాయివాళ్ల చేతుల్లో పడుతుందో? — తలుచుకొంటే, ఊఁ, కడుపు తరుక్కొని పోతుంది నాయనా?.........ఇన్నాళ్లు దాని అస్థులూ చర్మమూ మనకి ధారపోసి చాకిరీచేసినందుకు, దానిపట్ల మనం విశ్వాసం చూపించలేకపోయాం. ఏమీా, మనిషి జన్మఅయి పుట్టితేమట్టుకు దాని ఋణం మనం వెయ్యి జన్మాలకయినా తీర్చుకోగలమా?" అని లక్ష్మమ్మ కన్నీరు ఒత్తుకొంది.

మంచంమీాద పండుకొన్న రాగయ్య ముక్కు తుడుచుకొని కళ్లు చికిలించాడు.

"నా వెంకన్నా! ఇక నాకు అగపడవా! పది హేనురోజులకిందట చూసినచూపే కడసారి చూపా?" అని రమణయ్య బావురుమన్నాడు.

"నీ కేమి పిచ్చా ఏమిటి రమణా? ఊరుకో. ఏం దీ పిచ్చి చేష్టాలు — శుభమల్లె! రెండు రోజులు తాళండయ్యా, పిల్లవాడు వచ్చి మీపైకం మీకు కట్టు తాడని బ్రతిమలాడితే వినకుండా కాళ్లకింద నిప్పులు పోసి కొట్టిన ఆరెడ్డినీ కరణాన్నీ అనుకోవాలిగాని — మనం ఎంత ఏడిచి ఏం ప్రయోజనం? లే, చద్దన్నం తిందువుగాని లే. వేళకు తిండీ నీళ్లూ అమరక మనిషివి అసలే బెట్టపడి ఉండావు" అని ఓదార్చింది తల్లి.

రమణయ్యకు దుఃఖం పోయి, దాని స్థానంలో రోషం పుట్టింది. గ్రామాధికార్లు రెండురోజులు నిదా నించి ఉంటే తన ఎద్దు తనకి దక్కి ఉండునని అతనికి నమ్మకం తోచింది. కరణంమీదా, మునసబుమీదా అతనికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. వాళ్ళతో తాను తగువులాడలేకపోయినా, వెళ్ళి తన అక్కసం తీరేలాగ వాళ్ళని మొఖంమీద నాలుగుమాటలూ అనేసిరావాలని అతనికి ఉద్రేకం కలిగింది. ఒళ్ళు వేడెక్కింది. ఆ వీరా వేశంమీద కూర్చున్న మనిషి గభాలున లేచి —

"వెళ్ళి నాలుగుమాటలూ మొఖంమీద అడిగి వస్తానుండు — ఈ మునసబునీ కరణాన్నీని" అని బయ ల్దేరాడు రమణయ్య.

"అబ్బాయీ! నువ్వేమీ తొందరపడవద్దు. నామాట విను! నువ్వు అధికార్లతో తగవు పెట్టుకొంటే నీకే తగులుతుంది దెబ్బ. నిదానించు. మన ఖర్మకి గ్రామాధికార్లు కర్తలా" అని తండ్రి అడ్డుతగిలాడు.

"నే నేమీ తగవులాడను లేవే? ఆశిస్తేమిటో, ఆ లెఖ ఏమిటో — లెఖయినా చూపించుకొని వస్తాను: మనకి ఇంకా ఇరవైరూపాయల శిస్తు ఏడనుండి వచ్చిందీ? అంతశిస్తు కట్టవలసినట్లు నాకు జ్ఞాపకంలే దే?" అని బయ టికి వచ్చాడు రమణయ్య.

"అబ్బాయీ! నువ్వు అసలే కోపదారిమనిషివి. వాళ్ళతో అనవసరంగా తగువులాడక నీపనేమిటో అది చూచుకొనిరా" అని తండ్రి మళ్ళా బోధించాడు.

ఎకాయెకీని రమణయ్య గ్రామచావడికి పోయాడు. కరణమూ, మునసబూకూడా కూర్చుని పైకం వసూలుపనిలోనే ఉన్నారు. ఇంకా ఇతర రైతులు నలుగు రైదుగురుకూడా లెఖలు చూపించుకొంటున్నారు.

"ఏమయ్యా! మునసబుగారూ! మీకు సర్కారు వాళ్లు అధికారం యిస్తేమట్టుకు మాబోటి బీదవాళ్లని

గొంతుకు తెగ్గోయమనికూడా అధికారం యిచ్చారా?''
అని పెద్దంగా అడిగాడు రమణయ్య.

"గొంతుకు తెగ్గోస్తే ఉరిశిక్ష వేస్తారు సర్కారు''
అని ఎగతాళిగా జవాబిచ్చాడు మునసబు.

"అదికాదయ్యా! నీకు శిస్తుపైకం కట్టవలసిఉంటే
మాత్రం, నేను ఇంటికాడ లేకుండా చూచి ముసలాణ్ణి
ఏపించుకొని తిని ఎద్దును అమ్మిస్తావుటయ్యా?
నువ్వుమాత్రం కాపోడివి కాదూ? నీకుమాత్రం సేద్యం
లేదూ? నీకుమాత్రం పశువులు లేవూ?''

"నిజమేరా! ఉన్నాయి. ఉంటే? మీనాయన్ని
ఎద్దుని అమ్మవలసిందని నేను బదనాయంచేశానా?''

"పైకం కట్టకుంటే, ఎద్దుని జప్తి చేస్తానని వెట్టి
వాళ్లని ఇంటిమీదికి పంపితే, దాని అర్థం ఏమిటి?''

"సర్కారు శిస్తు కట్టకుంటే జప్తిచేయక ముద్దు
పెట్టుకొంటారా?''

"రెండురోజుల్లో నేను వస్తానే ఉంటినే? అం
తమాత్రం నిదానిస్తే సర్కారువాళ్లు పీకి తెగ్గోస్తారా
ఏందయ్యా?''

"ఎవరిమట్టుకు వాళ్లు వాయిదాలు వేస్తుంటే
ఇక పని జరిగేది ఎట్లా?''

"నాశనం చేశారుగదయ్యా. మీా రందరూ చేరి, ఎద్దును. మాబోటి బీదోళ్లని ఇట్లా ఏడిపిస్తే మీాంబోటి గొప్పోళ్లకి మేలులేదయ్యా. ఆ ఒక్క ఎద్దూ అట్లా అన్యాయ మయిపోయిందే, ఇక నేను దేనితో సేద్యం చేసుకోనేదో మీారే చెప్పండయ్యా?" అని అక్కడ ఉండిన నలుగురు రైతులకేసి చూచి దీనంగా అడిగాడు రమణయ్య.

రమణయ్య అమాయకత్వానికీ, అతని నిష్కాపట్యానికీ అక్కడ చేరిన రైతులకేగాక మునసబుకీ, కరణానికీకూడా నవ్వు వచ్చింది.

"నవ్వుతా రెందుకయ్యా? మునలాడిదగ్గర ఇరవై రూపాయలు గుంజుకొన్నారట. అంతశిస్తు ఏడనుంచి వచ్చిందయ్యా రెడ్డిగారూ?" అని అడిగాడు రమణయ్య.

"ఆసంగతి కరణాన్ని అడిగి లెఖచూపించుకో" అన్నాడు రెడ్డి.

"ఏమయ్యా కరణమయ్యా! నువ్వు ఏటా అయిన కాడికి మాదగ్గర జమాబందీమామూలనీ, వల్లకాడు మామూలనీ ఊడేస్తూనేఉంటివి. ఇప్పు డింత శిస్తు ఏడ నుంచి వచ్చిందీ?" అని కరణాన్ని అడిగాడు.

కరణం చిరునవ్వు నవ్వాడు.

"నీమాగాణికయ్యా నాలుగెకరాలకీ ఇరవై రెండు రూపాయలు మాగాణిశిస్తు ఇవ్వాబనిలేదట్రా?"

"రామ రామ! ఈ ఏడు ఆపాలంలో చిట్టెడు గింజలు కళ్ల చూచింది లేదే? వొట్టి తాలూ బొందూ కోసుకొని తెచ్చుకొంటిమే! నువ్వు తణిఖీచేసికూడా వస్తివే! పండ లేదని రాసి, శిస్తు ముజరా యిప్పిస్తానని చెప్పితివిగదయ్యా?"

"చెప్పినమాట నిజమే. నీనంబరులో మూడు న్నర ఎకరాలో పైరు పోయిన మాట నిజమే. కాని మిగిలిన అరఎకరా పండిందికదూ?"

నాలుగెకరాల కయ్యలో ఒక అరఎకరా పం డితే పూర్తిశిస్తు కట్టవలసిందేనా?"

"ఆహా!"

"ఇ దేమి ఘోరమయ్యా?"

"కొరవ నంబర్లకి శిస్తు ముజరా ఇవ్వర్రా సర్కారువారు."

"ఆకొరవమాత్రం ఏమి పండిందయ్యా? కూలి ఖర్చులకే చాల్లేదు ఆనలుతుముగింజలున్నూ."

"అందుకనే నేనూ ఇన్స్పెక్టరూ వేయడంలో నీ నంబరంతా కలిసి సగటున ఒకఅణాఫలితంమాత్రమే వేశాం. కాని తహశీల్దారు ఒప్పుకోలేదు. నాలుగెక రాల్లోను అరఎకరాలో పైరు వెన్నుదీసి కాస్త నదరుగా అగపడేవరకు ఆయన సరాసరి రెండణాలఫలితం వేశాడు. దానితో అంతా తుడిచిపెట్టుకొనిపోయింది."

"రెండణాలఫలితం పండితే ముజరా ఇవ్వరా?"

"ఇవ్వరు; రెండణాలకు లోపలనే ఉండాలి ఫలితం. అదిగాక నీ పొలానికి ఆజుబాజులో ఉండేకయ్యలన్నీ సుమారుగా పండినట్లు తహశీల్‌దారు రాసుకొని పోయాడు. నీ పక్కభూములు పండి, నీ భూమి పండకుంటే అది రైతు కసూరీవల్ల జరిగిందికాబట్టి, సర్కారువారి జవాబ్దారీ లేదని, నీకు ముజరా ఇవ్వడానికి వీల్లేదని తోసేశారు... ఈబిడుకోళ్లన్నీ మీాకేం తెలుస్తాయి?"

"ఏమి అన్యాయపుకాలం వచ్చిందయ్యా! సరే. నీ వన్నట్లే మాగాణిశిస్తు ఇరవైరెండు రూపాయల్లోను పదకొండురూపాయలు మొదటి రెండువాయిదాల్లోనూ చెల్లిస్తినే — ఇంకా ఇప్పుడు ఇరవైరూపాయలెట్లా అయింది శిస్తు?"

"నువ్వు ఇసకకయ్యలో చేసిన తీర్వజాస్తిసంగతి మరిచావా ఏమిటి?"

"దాని కెంత పడింది శిస్తు?"

"పావలాతక్కువ ఏడురూపాయలు."

"ఏందీ, ఆ ముంతెడు విత్తనాలపట్టుకీ ఏడురూపాయలశిస్తేందయ్యా? నువ్వేమో మాకొంపలు ముంచేటట్టుగా ఉండావే?"

"అది మెట్టభూమికదట్రా; దానికి ఉత్తర్వు లే కుండా నువ్వు నీళ్లు తీసుకొన్నందుకు అయిదున్నర రూపాయి అపరాధం వేశారు. అపరాధమూ, శిస్తూ కలిసి ఆరున్నొక్కాలురూపాయి అయింది."

"ఇ దేందబ్బా ఈ విడ్డూరమూ? ముం తెడు విత్తనాలపట్టు కేందీ, ఏడురూపాయల శిస్తేంది?...... కొంపలు పెరుక్కోని ఏడకయినా లేచిపోవలసినట్టుగా ఉందికాని............" అని ఆశ్చర్యపోతున్నాడు రమణయ్య.

ఇదంతా చూస్తూఉండిన రైతులు పకపకా నవ్వుతున్నారు.

"మేమూ ఇట్లాగే ఏడుస్తున్నాంరా నాయనా పొద్దుటినుంచీ. మా గోడు ఆ పరమాత్ముడికే ఎరుక. మాకుకూడా తలా అయిదూ, పదీ అపరాధాలు పడ్డాయి. ఏందో మాగాణి రేటంటా, దానిలో మెట్టరేటు తోసేస్తారంటా, దానికేమో ఇబ్బడీ, ముబ్బడీ కడతారంటా ............ఏమిటో చెప్పతున్నాడు కరణం. ఆయనగారు చెప్పే దేమిటో మా కేమీ బుర్ర కెక్కడం లేదు. పొద్దుటినించీ, మేము ఎంతెంత శిస్తు కట్టాలెనో మాకు తెలియక కొట్టుమిట్లాడుతున్నాం. ఎవడితో చెప్పకోవాలో తెలియడంలేదు..."

అని ఆ రైతులు రమణయ్యతో చెప్పారు.

"అదిగాదయ్యా కరణంగారూ! నా తీర్వజాస్తి పాదుకు నీళ్ళ ఉత్తర్వు తెప్పిస్తానని చెప్పి, నువ్వు చేసుకో మంటేకదయ్యా, నే నా కయ్యలో ప్రవేశించాను. లేకుంటే నా కెందు కా లట్టాలు..." అని రమణయ్య అడిగాడు కరణాన్ని.

"అవును రా! నిరుడు సంవత్సరం గ్రామంలో పెద్ద పెద్ద రైతులందరూ ఉప్పత్తులుపడి ఒకరిమీద ఒకరు సొడ్డుపెట్టుకొని ఆ వోవరుశీరుకు చెల్లించవలసిన ముడుపు చెల్లించనేలేదు. అందువల్ల ఈ యేడు ఈ వూళ్ళో తీర్వ జాస్తి కేసులకు ఉత్తర్వులు ఇవ్వడానికి వీల్లేదని, ఆయన పైకి రాసి, అందరికీ తోక తెగ్గోశాడు. న న్నేం చేయ మంటావు?"

"మీ ఇష్టం వచ్చినట్లు ఏడిపించండయ్యా మమ్మల్ని. మా కేం తెలుస్తాయి ఈ తిరుగుళ్ళు? పశు వులం మేం. అట్టా బంగారంవంటి ఎద్దు మట్టిగడ్డలయి పోయిందనే ఏడిచేదా, ఇక్కడ అపరాధాలు చెల్లించ వలసి వచ్చిందనే ఏడిచేదా! ఛీ! గుక్కెడు విషం తాగి చస్తే మేలు, ఈ గడ్డన బతికేదానికంటె. ఏడిపించండి. తల్లిఅయినా మీరే, తండ్రి అయినా మీరే అని, కరణం మునసబుల్నిద్దర్నీ నమ్ముకొన్నందుకు, మమ్మల్ని మీ రేం చేస్తే చెల్లుబడి కాదుగనుక! మమ్మ ల్నిట్టా

తడిగుడ్డలతో కోసే బదులు, ఒక్కసారి పడేసి ఏట పోతును ఖధికినట్లు నరికిపారేయరాదూ ” అని ఇట్లాగే ఏమేమో సణుగుకొంటూ ఇంటికి చక్కాపోయాడు రమణయ్య.

## ౪

ఎన్నివిధాల ప్రయత్నించినా రమణయ్యకు వెంకన్నమీదనుంచి మనస్సు మరలడం లేదు. ఎన్ని తంటాలయినా పడి, పడమటి బేరగాళ్ల పోబిడీ తెలుసుకొని, వాళ్ల డబ్బు వాళ్లకి వాపసుఇచ్చి తనఎద్దును తాను మళ్లా ఇంటికి తెచ్చుకోవాలనికూడా అతనికి అదే ఆలోచనగా ఉన్నది. కాని — చేతిలో చిక్కినఎద్దును మళ్లా వాళ్లు ఇస్తారా? ఇంకో నాలుగురూపాయలు లాభం చూపి అడిగితే ఎందు కివ్వరు? — వాళ్లు బేరగాళ్లు కదా. పోనీ, ఎద్దును ఇవ్వకుంటేమానె, వాండ్ల ఆచోకీ తెలిస్తే పోయి ఎద్దునయినా కళ్లతో ఒకసారి చూచి రావచ్చును అని ఆలోచించాడు రమణయ్య. పడమటివాళ్ల దేవూరో అని తండ్రి నడిగాడు.

“వెలిగొండలికి అవతల అదేదోవూరని చెప్పారు. నాకు జ్ఞాపకంలే” దని చెప్పాడు తండ్రి.

రమణయ్య గ్రామంలోకి పోయి, బేరగాళ్లవిషయమై వాళ్లనీ, వీళ్లనీ విచారించాడు; కాని వాళ్ల

స్వగ్రామం ఏదో తెలియదని కొందరూ, తెలిసినా నీకు వాళ్లింకా చిక్కుతారా, ఏవూరు పోయారో, ఎక్కడ తిరుగుతున్నారో అని కొందరూ, వాళ్లీపాటికి వెలిగొండ దాటిపోయి ఉంటారని మరికొందరూ, ఇంకా నీకు ఎద్దుమీద ఆశ ఎందుకని కొందరూ — ఈ విధంగా అతనికి నిరుత్సాహకరమైన సమాధానాలు చెప్పారు గ్రామంలోని రైతులు. బేరగాళ్లని వెదకి పట్టుకోవడం సాధ్యమైనపనిగా తోచలేదు రమణయ్యకి. తాను ఒంటరి గాడు. ఇంటికాడ ముసలివాళ్లని విడిచి, తాను ఎన్ని ఊళ్లని తిరగగలడు? ఎంతకాలం అని తిరగగలడు? అది కాక, తా నాప్రయత్నమేమీ పెట్టుకోవద్దని ఇంటి దగ్గర తల్లీ తండ్రీకూడా చాలాదూరం చెప్పారు. ఆ ప్రయత్నం విరమించుకొన్నాడు రమణయ్య.

పొద్దుగూకులూ కాలుకాలిన పిల్లిలాగ తిరిగి తిరిగి సాయంకాలానికి ఇంటికి ఘటం చేరవేశాడు రమణయ్య. అతనికి మనస్సు కుదుటపడడంలేదు; దొడ్లో ఎద్దులేకపోవడం అతనికి ఇల్లంతా బావురుమనిపోయింది. బయట వీధిలో పొయ్యే పశువుల్నీ ఎద్దుల్నీ చూచుకొని ముచ్చటపడుతున్నాడు. ఎక్కడికి పోయినా, సాయంకాలానికి తనయిల్లు చేరుకొంటూ ఉండేదే అని ఎద్దు వస్తుందేమో అన్నట్లుగా వీధివాకిట్లో ఎదురు చూస్తూ నిలిచేవాడు. దొడ్లోకి పోయి చప్పారంచుట్టూ

తిరుగుతూవుండేవాడు. ఎద్దును కట్టే గుంజవైపు ఆట్టే పరకాయించి చూచాడు. ఎద్దు అక్కడ నిలబడి చేత్తో మెడ దువ్వుమని తల పైకెత్తినట్టుగానే గోచరించిం దతని కళ్లకి. మళ్లా అంతలోనే వట్టి గుంజమాత్రమే కనిపించింది. అతనికి పెద్దదుఃఖం పొంగివచ్చింది. ఎద్దు యింటికి వచ్చే వేళ, ఎద్దుకి బుట్టమేపు పెట్టే సమయం, గాడిలో పచ్చిగడ్డి వేసేకాలం,— ఇవన్నీ అతనికి జ్ఞాపకానికి వచ్చినై; కాని వీటిల్లో ఏపనీకూడా చేయవలసినఅవసరం లేకుండాపోయింది. తనకి చేయి విరగగొట్టినట్టుగా ఉంది. వాకిట్లో గోడ కానించిన నాగేలీ, కాడిమానూ అతనికళ్లల్లో పడినవి. ఎద్దు జ్ఞాపకానికి వచ్చింది. కళ్లు చెమ్మగిల్లినై. కళ్లుల్లో మెదిలాడు వెంకన్న. ఒకక్షణం నాగేలివైపు చూస్తూ నిలబడ్డాడు. "ఇంక నేను సేద్యం ఎట్లా చేసుకొనేదే, వెంకన్నా" అని కళ్లు తుడుచుకొన్నాడు.

రమణయ్య ఇంట్లోకి వచ్చాడు: గోడలో కొయ్యకు తగిలించిన మువ్వలూ, గంటా, తోలుపట్టెడా, చికుమోరతాడూ అగపించినవి అతనికళ్లకి. ఇక తానాదుఃఖం పడలేకపోయాడు. ప్రక్కనే నులకమంచంమీద బోర్లగిలాపడి డొక్క లెగరవేస్తున్నాడు.

గంటసేపయింది రమణయ్య ఆవిధంగా పండుకొని. రాత్రి భోజనాలవేళయింది: తల్లి వచ్చి అన్నానికి

రమ్మని పిలిచింది. ఆకలవడంలేదు, భోజనానికి రా నన్నాడు రమణయ్య.

"ఇదేంది అబ్బాయీ! నీకిదే పిచ్చిగా ఉన్నదే. పోతే పోయిందిలే ఎద్దు. దానికోసరం దిగులుపడి, కూడూ, నీళ్లూ మానుకొంటారా? నువ్వు మొగవాడివి. నీకేం? నీరెక్కలు బాగుంటే, ఇట్లాంటి ఎద్దుల్ని లక్ష సంపాదించుకోవచ్చు. ఇట్లా దిగులుపడి కూచుంటారా? బాగానే వుంది — అన్నానికి లే" అని తల్లి పిలిచింది.

"......................"

"నువ్వీవిధంగా దిగులుపడ్డావని ఆ ముసలాయనకి ఎంతో కష్టంగా ఉంది. దాని కాలం, కర్మం ఒనగూడి వచ్చి, శనిగాడు నెత్తి నెక్కినందువల్ల, దాన్ని అమ్మవలసివచ్చి అమ్మాడుగాని — ఆయనకిమాత్రం ఎద్దుని అమ్మడం సంతోషమా ఏమిటి? లే! నువ్వు లేచి రెండు మెతుకులు తింటేనేగాని ఆయన లేవడు. పాపం! ఆయనది పెద్దప్రాణం. ఒక్కగాక ఒక్కబిడ్డవు, నీమీద ప్రాణాలు పెట్టుకొని బ్రతుకుతున్నాం మేమిద్దరమూను. లే, నాయనా, లే!" అని బలవంతంచేసింది తల్లి.

తనస్థితి చూచి తండ్రి కష్టపడుతున్నాడని వినే వరకు రమణయ్యకు హృదయం విరిగిపోయింది. ఒకవేళ తనకి బాధగా ఉంటే — దాన్ని తండ్రికి తెలియపర్చ

కుండా కడుపులోనే దాచిపెట్టుకోవడం మంచి దను కొన్నాడు; లేచి భోజనం చేశాడు.

దినములు గడిచిపోతున్నవి. వెంకన్నని అమ్మి వేసి ఒకటి, రెండు, మూడు నెల లయింది. వృద్ధుడయిన రాగయ్య ఒకరోజున అకస్మాత్తుగా జబ్బుచేసి, కొడుకు చేతులమీదుగా అవతలికి దాటుకొన్నాడు. రమణయ్య భుజాలమీది భారం బరువెక్కినట్టయింది.

మరుసటినెలలో భార్య కాపరానికి వచ్చింది. రమణయ్యజీవితంలో సుఖమూ, దుఃఖమూ రెండూ కూడా పొడగట్టాయి. ఆ రెంటినీ వేసుకొన్న కావడిబద్ద బరువెక్కి నడుస్తూవుంటే అతని నడుములాగే అదికూడా జవజవలాడుతోంది.

పొగాకుబుట్ట నెత్తిని వేసుకొని పల్లెల్లో తిరుగుతూ వున్నప్పుడు వెంకన్నజాడ ఏమయినా గుర్తు చిక్కుతుం దేమోనని ఇంకా అతనికి అడియాస కొట్టుకొంటూనే ఉంది కొన ఊపిరితో. కనబడిన పశువులమందనంతనీ కలయ వెదుకుతాడు, దృష్టిలోపడ్డ ఎద్దునల్లా దీక్షతో పరిశీలిస్తాడు. వెంకన్న పోలికలు గల ఎద్దు తనదృష్టికి తగిలితే భ్రమపడి చూస్తాడు. అది తన వెంకన్న కాకుంటే వెంటనే నిట్టూర్పు విడుస్తాడు. దా న్నీ జన్మలో మళ్లా తా నొక్కసారి చూడాలని అతనికోరిక; అంతే అతని ఆశ!

దినములు గడచినకొద్దీ, తా నీజన్మలో మళ్లా వెంకన్నను చూడగలనన్న ఆశ పూర్తిగా వదలుకొన్నాడు రమణయ్య. రానురాను ఆ చింతనే మరచి పోయాడు.

రమణయ్యా తన సంసారమేమో, తన భార్య ఏమో — తన సౌఖ్యమేమో, ఈ లోకంలోనే మునిగి తేలుతున్నాడు.



ఎంతలో తిరిగివస్తుంది కాలం! వెంకన్నని అమ్మి అప్పుడే ఏడునెల లయింది.

అది మార్గశిరమాసం. చలి వడకించేస్తోంది.

మామూలుప్రకారం లక్ష్మమ్మ వేకువనే లేచింది. ఇంట్లో పిల్లవాడూ, కోడలూ ఇంకా గాఢనిద్రలోనే వున్నారు. కోళ్లు కొక్కొరో కో యని కూస్తున్నాయి.

సంజవెల్తురు వచ్చింది. మంచు దట్టంగా పట్టింది. వాకిట కసవు చిమ్ముకోను లక్ష్మమ్మ మంచం విడిచి తలుపుచిలుకు తీసి ముంగిట్లోకి వచ్చింద. చేతితో పొరక కట్ట తీసుకొని వీధివాకిలి తెరిచింది. తలుపు తెరిచీ తెరవడంతోనే బక్కచిక్కిన ఒక ఎద్దు గభాలున తోసు కొంటూ ఆమెమీదికి వచ్చింది. ఇంకా నిద్రకళ్ళమీదా, మత్తుమీదా ఉన్నదేమో, కొమ్ములు ముందుకు వంచి

తోసుకువచ్చే ఆ ఎద్దును జూచి పొడుస్తుందేమోనన్న భయంచేత ఆమె వెనక్కి రెండడుగులు వేసింది. ఎద్దు ముంగిటిలో ప్రవేశించి దొడ్డిలోకి పోయే ఉత్తరపుతట్టు సందుముఖం పట్టింది. "హా, హా, హా" అంటూ సమయానికి కర్రేదీ చిక్కనందువల్ల, పొరకకట్టతోనే ఎద్దుని అదిలించి వెనక్కి మళ్ళగొట్టడానికి ప్రయత్నించింది లక్ష్మమ్మ. కాని ఆ అదిలింపులు లెక్కపెట్టకుండా ఎద్దు దొడ్లోకి పోయింది.

దొడ్లో చప్పారంలో పాలిచ్చే బర్రెపడ్డా, దూడా, దున్నపోతూ ఉన్నవి. ఈ ఎద్దు ఎవరిదో, ఆ పశువుల్ని పొడుస్తుందో ఏమో! ఎంత అదిలించినా జమలేకుండా దూసుకొని దొడ్లోకి పోయింది. లక్ష్మమ్మకి ఖంగారు పుట్టింది.

"అబ్బాయి! అబ్బాయి! రమణా! ఇట్లా రా" అని పిలిచింది లక్ష్మమ్మ.

"ఎందుకు?" అని నిద్రమంచంమీదనుంచే పలికాడు రమణయ్య.

"ఎవరిదో ఎద్దు దొడ్లో పడి నానాబీభత్సా చేస్తుండదిరా. ఎంత కొట్టినా వెనక్కి పోలేదు. బర్రె దూడని పొడుస్తుందో ఏమో! ఒకపాలి లేచి ఇట్లా రా. దాన్ని బయటికి వెళ్ళ తరుము" అని అరిచింది లక్ష్మమ్మ.

మొలగుడ్డ బిగించుకొంటూ రమణయ్య దొడ్లోకి పోయాడు.

"ఇదేమి అలవాటమ్మా? పశువుల్ని ఇంటికాడ భద్రంచేసుకోవాలిగాని, ఇట్లా ఊరిమీదికి విడిచిపెట్టితే ఎట్లా అనుకొన్నారో! దొడ్లో నీళ్ళకుండలూ బొచ్చెలూ ఉండయి. ఏం నాశనం చేసిందో ఈ యెద్దు" అని సణుగుకొంటూ వీధిలోకి వచ్చి, వంగి, వీధివాకిలి చిమ్మడం మొదలుపెట్టింది లక్ష్మమ్మ.

రమణయ్య ఎద్దును వెతుక్కొంటూ దొడ్లోకి పోయేవరకు అది అప్పటికే చప్పారంలోకి పోయి దున్నపోతుజతను గుంజకాడ నిలిచింది. ఆ యెద్దును జూచి బెదురుకొన్నాయో ఏమో, పండుకొన్న దున్నపోతూ, బర్రెపడ్డా, దూడా ఒక్కసారిగా లేచి నిలబడి ఎద్దువైపు చూస్తున్నాయి.

"దా! దా!" అంటూ, చేతిలో చిన్నకర్ర తీసుకొని ఎద్దును సమీపించాడు రమణయ్య. అతన్ని చూడగానే ఎద్దు ముందుకు రెండడుగులు వేసి మెడకింద గీరమని మోరఎత్తింది.

అప్పటి కప్పుడే తూర్పు రేఖలు బాగా ఆరి వెలుగు వచ్చింది. రమణయ్య ఆట్టే ఎద్దువైపు చూశాడు. దాని చుట్టూ ఒకసారి తిరిగాడు. దగ్గరగా వచ్చాడు. ఎద్దు

మోరమీద చెయ్యిపెట్టాడు. పాతనెత్తురూ పాతనెత్తురూ గుర్తు తెలుసుకొన్నాయి.

"అమ్మా! అమ్మా! వెంకన్న వచ్చాడేవు; వెంకన్నేవు" అని పెద్దంగా అరిచాడు రమణయ్య.

"ఆఁ! ఆఁ! నా వెంకన్నే — నా తిరపతి వెంకటేశ్వర్లే!" అని అరచుకొంటూ దొడ్లోకి ఒక్కదూకు దూకింది లక్ష్మమ్మ.

అప్పటి కప్పుడే తన ఇద్దరు బిడ్డలూ, ఒకరి నొకరు పరామర్శించుకొంటున్నారు.

"తప్పించుకొని వచ్చిందికాబోలురా, నాయనా! చూశావా దాని విశ్వాసం? దాన్ని పరాయివాడిచేతిలో పెట్టి ఏడో నెల జొరబడింది. అయితేనేం? దానికెంతగుర్తో కనుక్కో! ఏవూరునుంచి వచ్చిందో, ఎప్పుడు బయల్దేరిందో" అని అంటూ లక్ష్మమ్మకూడా ఎద్దు దగ్గరగా వచ్చింది.

"నావెంకన్నా! ఎట్లా అయిపోయావురా! బక్కపేగులడి వరుగైనావు!" అని కంట తడిపెట్టుకొని లక్ష్మమ్మ "వెంకన్నా! మరిచిపోయా వనుకొన్నాం. ఇంతకాలం ఏడ ఉండావు నాయనా? నీ అన్న రమణడూ, నేనూ నీకు గుర్తుఉండామా? — నీకోసరం అలవటించి మరీ ప్రాణం విడిచాడు — ఆ ముసలాయన.

నీ చూపు ఆయనకి ఋణం లేకుండాపోయింది. ఈ పొద్దు నిన్ను చూచి ఉంటే ఆ మారాజు ఎంత పొంగి పోయేవాడో —"

రమణయ్యా, వెంకన్నా కన్ను లరమోడ్చి తన్మయులై ఒకరిలో ఒకరు లీనమైపోయారు.

"అయ్యో! నా బంగారుకొండా! కళ్లల్లో వున్నె ప్రాణాలు! గుర్తుపట్టడానికి శక్యం కాకుండా ఇట్లా ఎండి పోయావేమి—వెంకన్నా? తలుపు తెరిచి చూస్తునుగదా —ఎవరిఎద్దో అని భ్రమపడ్డాను. నా తిరపతి వెంకన్నా! మన ఇల్లు విడిచిపెట్టి పోయాక దిగులుపడ్డావా ఏంది? నాకళ్లు కాలిపోతే ఇట్లాశల్యమై పోయావేమి నాయనా!" అని చేత్తో నిమిరింది లక్ష్మమ్మ.

ఎద్దుమొఖంలో మొఖం పెట్టుకొని నిలబడే ఉన్నాడు రమణయ్య.

"నిన్ను చేతులారా ఆపడమటివాళ్లకి అమ్ముకొని పాపం ఒడిగట్టుకొన్నాం. ఈ యేడు నెలలూ ఎంత దిగులుపడ్డావో; మేతా నీళ్లూ అమరక ఎట్టా అయిపోయావో ఏవూరునుంచి వచ్చావు వెంకన్నా? ఇన్నాళ్లు ఎవరింటికాడ ఉండావు నాయనా" అని ఎన్నెన్ని ప్రశ్నలో అడుగుతోంది లక్ష్మమ్మ.

ఇంతలో వీధిలో ఇద్దరు పరాయిమొగవాళ్లు ఎవరో వచ్చి లక్ష్మమ్మని పిలిచారు. ఆమె దొడ్లో ఉన్న దని తెలిసి ఆయిద్దరు మనుష్యులూ దొడ్లోకి వచ్చారు.

"మేం మాదిగలం. మాది సీకాయకాగొల్లు. ఈ ఎద్దుని మేం మొన్నటిదినం కోటపాడులో యానాది రెడ్డిదగ్గర రెండువరాలకి కొన్నాం".—

"మీరు మాదిగవాళ్లా ? అయ్యో, నా వెంకన్న కేంగతి పట్టిందే—" అని లక్ష్మమ్మ గొల్లుమనింది.

"మీదగ్గరకొన్న పడమటిబేరగా ళ్లీయెద్దుని కోటపాడులో ఏభయిఅయిదు రూపాయలకి యానాది రెడ్డికి అమ్మివేసిపోయారంట ! కాని ఆరెడ్డికాడికి పోయి నేళనుంచీ ఎంత మేపినా ఈ ఎద్దు ఎక్కిరాక ఆగోజు కారోజు చిక్కి ఎండిపోతూవచ్చిందంట ! దానితో శెగు లట్టుకొని పీనుగయిందంట. దీని కారెడ్డి ఎన్నెన్నిగుం దులో మాకులో పెట్టి వైద్యాలు చేయించి చేయించి కార్యంలేక ప్రాణం విసిగి దీనితో చర పడలేక మొన్నటి రోజున దీన్ని మాకు రెండువరాల కమ్మివేశాడు. దీన్ని తీరా మేము తోలుకొని ఇంటికి పోతూవుంటే, నిన్న రాత్రివేళ ఇది మమ్మల్ని తప్పించుకొని పారిపోయింది. ఇది మీవ్వూరి ఎద్దని మాకు తెలుసు. అందువల్ల ఈడకే పోయి ఉంటదని మే మిద్దరం అపరేత్రికాడ లేచి వెతు క్కుంటూ వచ్చాం. చూడండి. ఆఎద్దు కున్నన్ని మరులు

మానవుడికి ఉంటాయా?'' అని మాదిగ లిద్దరూ ఎద్దు వృత్తాంతం అంతా చెప్పారు.

ఈవిషయం అంతా చెవుల్లో వేసుకొంటూ ఉండిన రమణయ్యా, లక్ష్మమ్మా కొయ్యబారిపోయారు.

వెంకన్నశిరస్సు రమణయ్య బాహువల్లర్లలోనే చిక్కుకొనివుంది. రమణయ్యకన్నీటిధార కాలువలు కట్టుతోంది. లక్ష్మమ్మ తేపతేపకూ ముక్కు తుడుచుకొంటూ ఎద్దుదగ్గరనే నిలబడింది. గెడ్డంకింద కర్రలు మోటించి, మాదిగ లిద్దరూ చూస్తూ నిలబడ్డారు.

గుంటలుకట్టిన నేత్రాలు రెండూ ఒక్కసారిగా, నల్లగుడ్డు మరుగుపడేట్టుగా గిర్రున తిప్పాడు వెంకన్న. రమణయ్య తన రెండుకళ్లూ విప్పి ఎద్దుకళ్లల్లోకి చూశాడు. నిలబడిన ఆయెద్దు ముందుకాళ్లు రెండూ ముడిచి కిందికి మోకరించింది. దానిమెడ విడవకుండానే రమణయ్య కూడా మోకరిల్లాడు. ఎద్దు నందివాహనంలాగ పండుకొన్నది. ఎద్దుతల తనఒడిలో పెట్టుకొని కూర్చున్నాడు రమణయ్య. ఎద్దు కళ్లు రెండూ మూసేసింది.

# పెండ్లిముచ్చట

## ౧

"ఏమండీ! సీత పెళ్లిసంగతి ఏమనుకొన్నారండీ! ఎన్నిసార్లు చెప్పినా నామాటలు చెవిని పెట్టరుకదా" అని ఒకరోజు సాయంత్రం నాలుగుగంటలప్పుడు రంగమ్మ కూతురు సీతమ్మకు జడవేసి మొఖాన్న చుక్కబొట్టు పెట్టుతూ, వీధివసారాలో దస్త్రం ముందుపెట్టుకొని కరిణీకంలెఖలు వ్రాసుకొంటూవున్న భర్త సీనయ్యతో అన్నది.

కళ్లకు అద్దాలు తగిలించుకొని డస్కుబల్లమీద అడంగల్లో సాగుబడి చెల్లువేసుకొంటూవున్న సీనయ్య భార్యమాటలు చెవిని పడంగనే మొఖం అటు తిప్పి, తల కొంచెం ముందుకు వంచి కంటిఅద్దాలమీదుగా చూపు నిగిడ్చి భార్య రంగమ్మవైపూ, కూతురు సీతమ్మవైపూ చూచి చిరునవ్వు నవ్వి "ఏమనుకోవడ మేమిటి? ఈ యేడు మాచిట్టితల్లికి తప్పకుండా పెళ్లి చేసితీరాలె" అంటూ "నీ కెట్లాంటి మొగుడు కావాలెనే సీతా!" అని ముద్దుకూతుర్ని ప్రశ్నించాడు. "ఊఁ" అని సాగ

దీసుకొంటూ సిగ్గుతో తలవంచి తల్లిచేతుల్లోనుండి విడిపించుకొని పంజరంలోనుండి బయటపడ్డ చిలకలాగ తుర్రున పారిపోయింది సీత.

"పిల్లకు పన్నెండోయేడు వచ్చిందండీ! ఇక ఇట్లా ఉంచడానికి వీల్లేదండీ!" అని భార్య మళ్ళా ఆ ప్రస్తావనే చేసింది.

"అవును. ఏదో సంబంధం చూచి ముడి పెట్టి తేనేకాని వీల్లేదు" అంటూ సీనయ్య తనపనిధోరణిలో పడ్డాడు.

సీనయ్య నియోగుల్లో పుట్టవలసినవాడు కాడు. పేరుకు కరిణీకం చేస్తున్నాడన్నమాటేకాని ఆ చేయడములో అందమూ లేదు, చందమూ లేదు. మనిషి భయస్థుడు; అధికార్లంటే హడలిపోతూవుంటాడు; కాని అభిమానధనుడు. నిదానం తక్కువ; ఖంగా రెక్కువ. అయినా యింతవరకూ ఎవ్వరిచేతనూ రవ్వంత మాటయినా పడలేదు. ఆయన వయస్సు అరవై సంవత్సరాలు.

సీనయ్యకు ఒకకొడుకూ, ఇద్దరు కూతుళ్ళూను. కొడుకు మూడోఫారం ఫేలయి సోదాభాయీలతో చేరి చదువుకోక ఇంటిదగ్గరనే ఉంటున్నాడు. ఎప్పుడయినా బుద్ధి తిరిగినపుడుమాత్రం తండ్రి కింత కరిణీకం లెఖలు వ్రాసిపెట్టుతూఉంటాడు.

సీనయ్యపంతులు పెద్దకూతుర్ని మేనరిక మిచ్చి వివాహంచేసి ఆపిల్లను ఈమధ్యనే సంసారానికి పంపి వేశాడు. ఇక రెండోపిల్ల సీతపెళ్ళి ఒకటీ, కొడుకుపెళ్ళి ఒకటీ తరవాయిగా ఉన్నవి. కొడుక్కు ఇరవైయేళ్ళు ఉన్నా మొగవాడికి తొందరలేదులే అనుకొని, ముందు పెళ్ళిఈడుకు వచ్చిన సీత పెళ్ళి చేయాలని నిశ్చయపరుచు కొన్నాడు.

అమర్చిపెట్టినట్లు పెద్దకూతురికి మేనరికం సిద్ధంగా ఉండినందున సంబంధాలకోసరం వెతుక్కోవలసిన అవ సరంగాని, ఆ వెతుక్కోవడంలో గల కష్టంగాని అత నికి తెలియకుండాపోయింది.

పెళ్ళిమాటలు తలపెట్టంగనే ఆయన కూతురు పెళ్ళి ఆ సంవత్సరం మాఘమి వెళ్ళినతరువాత మాఘ మాసంలో చేద్దా మనుకొన్నాడు కాని తీరా వివాహ ప్రయత్నం చేయబోగా అతనికి దారీ తెన్నూ గోచరించ లేదు. వరుణ్ని నిశ్చయపర్చుకోవడంలో అతనిమనస్సుకి తెగింపు కలగలేదు. బాగా చదువుకొన్నవాణ్ని, వెనక ఇంత ఆస్తిపాస్తులుగలవాణ్ని తీసుకురావాలని భార్య రంగమ్మ కోరిక. కాని చదువూ ఆస్తీకూడా వుంటే లంచాలు పోయాలన్న భయంచేత అంతపెద్దచదువూ, పెద్దఆస్తీ లేకపోయినా ఒకమోస్తరుగా ఏదో ధర్మ ఘారంఅయినా ప్యాసయి, సాలుకు రెండు పుట్లు ధాన్యం

వచ్చే భూజీవనం గలిగి, ఏషాహుకారు గుమాస్తాగానో నెలకు పైఖర్చుకు పదిరూపాయలు తెచ్చుకోగల పిల్ల వాడు దొరకితే, కాళ్ళు కడిగి కన్యాదానం చేసుకొందా మని కొద్దిలో మట్టగించుకొని ఉన్నాడు సీనయ్య.

కాని ఎంతదేశం తిరిగినా అట్లాంటిపిల్లవాడు కూడా అతగాడికి దొరకలేదు. తిరగాడు తిరిగాడు అరి కాళ్ళు అరిగిపొయ్యేటట్టు తిరిగినపల్లె తిరిగకుండా తిరి గాడు. అక్కడక్కడ ఒకటి రెండు సంబంధాలు మం చివే తటస్థపడినవి కాని చదువుంటే ఆస్తీ, ఆస్తి వుంటే సంపాదనా, సంపాదన వుంటే చదువూ-ఇట్లా ఏదో ఒకటి కొరవపడి అతనిమనస్సుకు నచ్చకుండావచ్చినవి.

రోజులు గడచినకొద్దీ అతనికి పెళ్ళిబెంగచేత మతిస్థిరం చెడుతూవచ్చింది. ఎన్నాళ్ళు తిరిగినా, ఏ సంబంధాన్నీ నిశ్చయపరుచుకోలేకపోయాడు. ఇక రెండు నెల్లల్లో పెళ్ళిచేయకపోతే పెద్దమనిషయేటట్టుగా వుంది పిల్ల. పోనీ అందుకయినా సిద్ధమవుదా మనుకొంటే ఇక మర్నాటినుండీ ఈ పల్లెకొంపల్లో తద్దినాలకు బ్రాహ్మ ణులు రారేమో అని అతనికి భయం. ఒంటరిగాడు. గ్రామంలో అతనికి రెండో సహాయం లేదు. ఏమీపాలు పోకుండా వుం దతనికి. విస్తరిముందు కూర్చుంటే నోటికి అన్నమూ, నీళ్ళూ పోవడం లేదు. మనిషికి రాను రాను పిచ్చిధోరణీ, పిచ్చివాలకమూ పడుతున్నది.

భర్తవైఖరి చూస్తే రంగమ్మకుకూడా దిగులు ఆరంభించింది.

౨

ఒకరోజు సాయంత్రం సీనయ్యఇంటికి వాళ్ళ ఫిర్కా రెవిన్యూ ఇన్స్పెక్టరు ముసాఫరు వచ్చాడు. ఆయన కూడా ఆ ర్వేలవాడే. పనిపాటలన్నీ భయభక్తులతో చేసుకుపొయ్యే సీనయ్యను చూస్తే ఆ ఇన్స్పెక్టరుకు అభిమానం. అదిగాక తనకంటె వయస్సులోనూ, అనుభవంలోనూ, పెద్దవాడయినందున సీనయ్యంటే ఆయన కొకవిధమైన గౌరవంకూడాను.

రాత్రి భోజనాలకు కూర్చున్నసమయంలో తన కష్టసుఖాలన్నీ ఇన్స్పెక్టరు పంతులుతో మొరపెట్టుకొంటూ సీతపెళ్ళివిషయమై తాను పడుతూవున్న అవస్థంతా ఆయనవద్ద వెళ్ళబోసుకొన్నాడు.

"నాభార్యకు పినతండ్రికొడుకొక డున్నాడు. వాడికి మీఅమ్మాయి నిస్తారా?" అని భోజనం అవుతూవుండగానే ఇన్స్పెక్టరు పంతులు సీనయ్య నడిగాడు.

ఇన్స్పెక్టరుగారు యోగ్యులనీ, సాటినియోగులనీ, వారిది మంచిసంప్రదాయమనీ సీనయ్యకుకూడా ఆయనంటే ఎంతో గౌరవమూ, భయమూ, భక్తీని.

తన కధికారిగా వచ్చిన ఇన్స్పెక్టరుగారితో సంబంధం చేయడమంటే సీనయ్యకు బ్రహ్మానందమయిపోయింది.

వీధిఅరుగుమీద మంచంమీద కూర్చుని తాంబూలం వేసుకొంటూవున్న ఇన్స్పెక్టరువద్దకు పోయి "అయ్యా! ఈపిల్ల మీపిల్లకాని మాపిల్ల కాదు. తమ యిష్టప్రకారం ఖాయపర్చండి; తమచేతుల్లో ఉంచుతున్నాను మాసీతమ్మను. ఏం చేసినా తమదే భారం" అని సీనయ్య ఆయనగారి రెండుచేతులూ పట్టుకొని "ఇవి చేతులు కావు కాళ్ళనుకోండి" అని కన్నీళ్ళు నింపాడు.

ఇన్స్పెక్టరుకు జాలివేసింది.

"పెళ్ళికొడుకుది అంతగొప్పస్థితి కాదు. హైయరు గ్రేడు ట్రెయినింగు అయి స్వగ్రామంలోనే గ్రాంటు స్కూలు పెట్టుకొని బడి చెప్పుకొంటున్నాడు. సాలుకు నూటఏభయి రూపాయిలు గ్రాంటు వస్తుంది. మూడెకరాల మాగాణి ఉన్నది. ముప్పందుంగింజలు మక్తా వస్తుంది. ఇల్లు ఉన్నది: తల్లి ఉన్నది గాని తండ్రి లేడు. అన్న ఒక్కడున్నాడుకాని అతగాడు వేరుపడి ప్రత్యేకంగా సంసారంచేసుకొంటున్నాడు. పిల్లవాడిపేరు రామారావు. బుద్ధిమంతుడు. వయస్సు ఇరవైయేళ్లు. మీకిష్టమేనా?" అని ఇన్స్పెక్టరు సీనయ్యను అడిగాడు.

కొంచెంసేపు సీనయ్యా, రంగమ్మా లోపలికి పోయి గుసగుసలాడుకొని బయటికి వచ్చి "ఇంతకంటె మంచిసంబంధం తేగలమాయేమిటి మేము? అవశ్యం కానివ్వండి" అని సీనయ్యా, రంగమ్మాకూడా తథాస్తంటే తథాస్తన్నారు.

ఆ మర్నాడే ఇన్‌స్పెక్టరూ, సీనయ్యా కలిసి వరుని గ్రామానికి పోయి పిల్లవాణ్ని చూచుకొన్నారు. రామారావు సీనయ్యకంటికి నదరుగా అగుపడ్డాడు. సరేనంటే సరేననుకొని తాంబూలాలు తీసుకొన్నారు. వస్తువులకుగాను పెళ్ళికూతురికి రు. ౧౦౦ లు పెళ్ళికొడుకువారు ముట్టచెప్పేటట్టు నిర్ణయమయింది. ఇందుకు సీనయ్యకంటెనూ అతని భార్య అపరిమితానందం పొందిపోయింది. ఫాల్గుణ శుద్ధదశమీ మంగళవారం ఉదయం ఏడుగంటలకు కర్కాటకలగ్నానికి ముహూర్తం నిశ్చయం చేసుకొన్నారు.

## 3

ఇన్‌స్పెక్టరుగారు తనమీద అనుగ్రహించి తీసుకువచ్చిన మనువయినందున సీనయ్య వివాహం కొంత గొప్పగా చేయాలనుకొన్నాడు. అదిగాక, ఇక పెళ్ళి చేయవలసిన ఆడపిల్లకాయలు లేనందున ఈ పెళ్ళి కొంచెం దర్జాగా చేస్తేనేకాని వీల్లేదని రంగమ్మ ఒత్తిడి

చేసింది. పెళ్ళిరోజుకుముందు సోమవారంనాటి సాయంత్రం అయిదున్నరగంటలకు రెండు స్పెషల్ బస్సులు వేసుకొని మొగా, ఆడా కలిసి అంతా ఏభయి, అరవై మంది వస్తారని పెళ్ళివారు ముందుగా తెలియపరిచారు. పెళ్ళికి కావలసిన సమస్తమైన వస్తువులూ తెచ్చి సిద్ధపరిచి అన్నియేర్పాటులూ చేశాడు సీనయ్యపంతులు. సోమవారంనాడు సాయంత్రం ఆరున్నరగంటలకు ఎదుర్కోలులూ, వరలక్ష్మీపూజాను. పెళ్ళివారికి ప్రత్యేకం విడిది యేర్పాటుచేసి, ఎదుర్కోలు జరపడానికి గ్రామ చావడిదగ్గర చిమ్మించి శుభ్రపరిచి సర్వమూ సిద్ధం చేశారు.

ఆడపెళ్ళివారితరఫున రావలసినబంధువులు నలభై, ఏభయిమంది వచ్చారు. మొగపెళ్ళివారి తరఫున రెవిన్యూ ఇన్స్పెక్టరూ, ఆయనభార్యా, పిల్లవాడూ మాత్రమే వచ్చారు. అయితే వీరు వారికీ వీరికీకూడా సంబంధించినవారే. అందువల్ల వీరు ముందుగా వచ్చి పెళ్ళిసన్నాహంలో సీనయ్యగారికి సహాయపడుతూ వున్నారు. ఎదుర్కోలునాటిరాత్రి గ్రామంలోని బ్రాహ్మణ్యాన్నందరినీ–ఆడవాళ్లనూ, మొగవాళ్లనూ–భోజనాలకు పిలిచి, గ్రామస్థులకూ, పెళ్ళివారికీ కలిపి అంతా రెండు వందలమందికి వంటప్రయత్నం చేశారు. సాయంత్రం అయిదుగంటలు కాగానే, పెళ్ళివారు వచ్చే

సమయమయిందని ఎదుర్కోవడానికి గ్రామచావడిదగ్గర చాపలు వేయించి సన్నాయిమేళంతోసహా సీనయ్యా, రెవిన్యూ ఇన్స్పెక్టరుపంతులూ తయారుగా వున్నారు.

సాయంత్రం ఆరయింది. ఆరున్నర అయింది. ఏడయింది. ఏడున్నర అయింది. గ్యాసులైట్లు వెలిగించారు. పెళ్ళివారు రాలేదు. అయిదుగంటలకే వస్తామని చెప్పి పంపిన పెళ్ళివారు రాత్రి దీపాలు పెట్టినతరువాతకూడా రాకపోవడం చూచి సీనయ్యకు మనస్సులో కొంతఖంగారు పుట్టుకువచ్చింది. కాని ఇన్స్పెక్టరుపంతులంత పెద్దమనిషి స్వయంగా కుదిర్చిన సంబంధం కాబట్టి రాకుండా మోసం చేస్తారా అని మొదట మొదటలో తనలో తానే సరిపెట్టుకొంటూ వచ్చాడు. కాని యెనిమిది, యెనిమిదిన్నర, తొమ్మిదిగంట లయ్యేవరకు నిట్టూర్పు లధికమైనవి. సీనయ్య అసలే ఖంగారుమనిషి. అందులో ఇంతప్రయత్నం చేసి బంధువులు యావన్మందీ వచ్చి, రెండు వందలమందికి వంటలు చేయించి — ఇంత వరకూ వచ్చినతరువాతకూడా పెళ్ళివారు రాకుంటే ఆయన కెట్లా ఉంటుంది? పెళ్ళివారు రాకపోవడానికి కారణమేమిటో ఎవ్వరికీ అర్థంకావడంలేదు.

"ఏమండీ పంతులూ! మనవాళ్ళు ఇంకా రాలేదే" అని సీనయ్య ఇన్స్పెక్టరును ఒకటి రెండుసార్లు ప్రశ్నించాడు. "వస్తారు లెండి. తప్పక వస్తారు. ఏదో

అనివార్యం జరిగిఉంటుంది. అయినా తప్పకుండా వస్తారు'' అని ఆయన చెప్పిన సమాధానం ఆరంభంలో కొంత తృప్తికరంగానే వుండినప్పటికీ రాత్రి తొమ్మిది న్నర అయినతరువాతకూడా పెళ్ళివారు రాకపొయ్యే వరకు సీనయ్యకు గుండెల్లో రాయిపడింది.

"ఏమి పంతులూ! ఈ పెద్దమనుష్యులు మా గొంతుకు కోయరుకదా?'' అని సీనయ్య ఇన్స్పెక్టరును మళ్ళా తొందరచేశాడు. కాని యేమి చెప్పడానికీ ఆయనకు తోచడంలేదు. ఆయనకుకూడా ఖంగారు పుట్టింది. ఏమి సమాధానం చెప్పగలడు? అట్టే యోచించాడు. "రాకపోవడానికి నా కేమీ కారణం కనబడదు. దారిలో మోటారేదో చెడివుండాలి. ఏ కారణాన్నయినా వాళ్ళు రాకపోవడమే తటస్థిస్తే వాళ్ళు నాకయినా వర్తమానం పంపేవుందురు ; లేదా జాబు వ్రాసేవారు. ఈ పెండ్లి యిష్టం లేకపోవడమూ, అందు వల్ల రాకపోవడమూ కాదు. ఏదో అనివార్యం జరిగి వుండాలె అని తోస్తుంది'' అని సమాధానం చెప్పాడు.

చేసినవంట లన్నీ చేసినట్టే ఉన్నవి. యావత్తు పదార్థమూ చప్పగా చల్లారిపోతోంది. రాత్రి పదిగంటలు దాటింది. ఎవ్వారికీ భోజనాలు లేవు. పెండ్లివారు రాలేదన్న దిగులుతో పసిపిల్లల తల్లులు బిడ్డలకు అన్నాలయినా పెట్టడం మరచి నిద్రపోయారు. రాత్రి భోజ

నానికి పిలిచిన బ్రాహ్మణ్యం ఇంకా రెండోతడవ పిలుపు రాలేదేమా అని ఇంటికాడ వంటలయినా చేసుకోని కారణంచేత తేపతేపకూ వీధిలోకి వచ్చి పిలుపుకోసరం ఎదురుచూస్తూ ఉన్నారు. పెళ్ళికూతురు మొఖమూ రంగమ్మ మొఖమూ, పెళ్ళివారి మొఖములూ దిగులుచేత కళావిహీనములైనవి. మొగపెళ్ళివారు రాలేదన్నకారణంచేత లైట్లు వెలిగించే సాహేబు నిద్రపోయినాడు. అందువల్ల కాంతి తగ్గిపొయ్యే గ్యాసులైట్లు తిరిగీ బాగుచేసే దిక్కులేక ఆడపెళ్ళివారి మొఖాలలాగే వెలవెలబోతూఉన్నవి. ఎంగిలివిస్తరాకులకోసరం ఎదురుచూచి చూచి విసిగిన యానాదులు అంటిపెట్టుకుపోయిన కడుపులతో బయట గోడలకింద దుమ్ములోనే పండుకొని గాఢనిద్రలో పడ్డారు.

రాత్రి పదకొండయ్యేవరకు ఇక రెండో పిలుపుతో అవసరం లేకుండగనే మనకరణంగారేకదా అని గ్రామస్థులు మడిపంచెలూ, పట్టుబట్టలూ కట్టుకొని, చేత చెంబులు పట్టుకొని భోజనానికి తయారయారు. వచ్చిన వారికి ఆడపెళ్ళివారు ఆదిగులుతోనే భోజనాలు పెట్టి పంపివేశారు.

రాత్రి పన్నెండుగంటలు దాటింది. మొగపెళ్ళివారు రాలేదు. సీనయ్య మన లోకంలో లేడు. మొగపెళ్ళివారు కావాలని మోసంచేశారని అతనికి గట్టి



నమ్మకం తట్టింది. ఇందులో ఇన్స్పెక్టరు పంతులుకూడా కొంత యేదో చేసేవుంటాడన్న అనుమానంకూడా కలి గింది. ఇంత ప్రయత్నమూ జరిగి, ఇంత అప్రతిష్ఠా పాల యినతరువాత ఇక మళ్ళా తనకూతురికి పెళ్ళి అవు తుందా అని అతనికి పెద్దభయం పుట్టింది. అత డెప్పుడూ ఇట్లాంటి కార్యాలు స్వయంగా చేసినవాడు కాడు, చూచినప్పటికీని. ఈపిల్లపెళ్ళి తలపెట్టిందిలగాయతు అతని మనస్సుకు అన్నీ సంకటాలే ఏర్పడ్డవి. అసలు వరుణ్ణి నిశ్చయపరుచుకోవడానికే పదినెలలు పట్టింది. చివరకు ఆపెళ్ళివైభవం ఇట్లా తెల్లవారింది. ఏం చేయగలడు ? తా నొకవందతిట్లు తిట్టుకొన్నాడు. భార్య నొకవంద తిట్టాడు. పెళ్ళికూతురిని రెండువందలు తిట్టాడు. మోసం చేశారని పెళ్ళివారిని ముందూ వెనకా చూడకుండా నోటికి వచ్చినట్లు బూతులు తిట్టడం ఆరభించాడు. అధి కారికాబట్టి రెవిన్యూ ఇన్స్పెక్టరును నేరుగా పేరు పెట్టి తిట్టలేక, అన్యాపదేశంగా పిల్లిమీదా యెలకమీదా పెట్టి ఆయనగారికికూడా కొన్ని వడ్డించాడు.

"ఇంతపని జరుగుతుందని ఎరక్కపోతినే; ఎం తలో ఇంతమందీ కలిసి నాగొంతు కోశారురా! ఇంక నాపిల్ల నెవరు చేసుకొంటారురా దేవుడా!" అని రెండు చేతులతోనూ నోరూ నెత్తీ లబ్బున మొత్తుకోవడం మొదలుపెట్టేడు. అతన్ని చూచి రంగమ్మ కళ్ళనీళ్ళు

పెట్టుకొంటోంది. తలిదండ్రుల నిద్దరినీ చూచి పెళ్ళి కూతురు పిల్లివలె ఒక గోడమూల నక్కి కూనిదీర్ఘం ఆరంభించింది.

"ఇట్లాంటి పోకిరీజట్టుతో సంబంధం చెయ్యడం మనదే బుద్ధితక్కువ" అని సీనయ్యకొడుకు ఉద్రేకంతో గంతులువేస్తున్నాడు.

పెళ్లివారిక రారంటే రారనీ, చేసినప్రయత్న మంతా వృథా అయిందనీ, నలుగురిలోనూ సీనయ్య అప్రతిష్ఠపాలు కావలసివచ్చిందనీ నలుగురూ నానా రకాలుగా మాటాడడం మొదలుపెట్టారు. అవన్నీ వింటూంటే సీనయ్యకు చెవిలో సీసం కాచిపోసినట్లయింది. ఇంత పరాభవం జరిగిన తరువాత తానిక బ్రతికి ప్రయోజనం లేదని అతనికి జీవితంమీద రోత కలిగింది. ఇక ఒక్క గడియకూడా జీవించి ఉండడం దుర్భర మనిపించింది. ఆ వేడిమీద కూర్చున్న మనిషి గభాలునలేచి ఉత్తరపుదొడ్లోవున్న భావిలో దూకి చచ్చిపోతానని అందరూ వినేటట్టు అరుస్తూ, ఒక్కగంతు వేసి బావి దగ్గరకు పరుగుపెట్టాడు. చుట్టుప్రక్కల ఉన్నవాళ్ళందరూ ఉలిక్కిపడి "అయ్యో! చస్తాడు కాబోలుర్రా, పట్టుకోండర్రా" అని అతనివెంట పరుగెత్తి పదిమందీ అదిమి పట్టుకొని బలవంతాన్ని ఇంట్లోకి లాక్కువచ్చి, దక్షిణపు గదిలోకి తోసి తలుపు బయట బిగించారు.

ఇక తాను పలక్కుండా కూర్చోవడం బాగుండదని ఇన్స్పెక్టరుపంతులు ఆ సమయంలో గదితలుపు తెరుచుకొని సీనయ్య దగ్గరకు పోయి "తొందరపడవద్దు సీనయ్యా! మనవాళ్లు తెల్లవారేలోపల తప్పక వస్తారు. కాస్త తమాయించండి. మీ అమ్మాయిపెళ్లి కేమీ భయంలేదు. ఇంకో కాస్సేపటికయినా రావాలి. మోటారేదో చెడిపోయివుంటుం దంతే. తొందరపడకు" అని చాలాదూరం మంచిమాటలు చెప్పి సీనయ్యను అనునయించాడు. కాని ప్రాణత్యాగం చేసుకోవడం తప్ప మరోగత్యంతరం లేదని స్థిరపరుచుకొన్న సీనయ్య కామాటలు చెవి కెక్కలేదు సరికదా, పైగా ఒళ్లు చుర్రుమని "చాలు చాల్లేవయ్యా! మహాపెద్దమనిషివి! చూస్తూ చూస్తూ నీచేతిలో ఇరుక్కున్నాను. తెగీతెగని కత్తితో నాగొంతు కోశావు. పైగా నీతులు చెప్పడానికి వచ్చావు" అని తనకు అధికారి అన్నగౌరవమైనా లేకుండా తీసిపారవేసి విదిలించి జవాబిచ్చాడు. దానితో ఆయనమొఖం చిన్నబుచ్చుకొని బయటికి చక్కా వచ్చాడు.

## ౪

రాత్రి ఒంటిగంటన్నర అయింది. పెళ్లివారు రాలేదు. సీనయ్య చీకటిగదిలోనే ఉన్నాడు. గదితలుపు

బయట బిగించివుంది. అతడు ఏవిధంచేతనయినా ప్రాణం పోగొట్టుకోవాలని పెద్దప్రయత్నంమీదనే ఉన్నాడు. "చేసినప్రయత్నం బూడిదపా లయిపోవడమే కాకుండా ఇంత అప్రతిష్ఠపా లయినతరువాత ఇంకా పిల్ల నెవ్వరైనా చేసుకొంటారా? పాముకు గడవవలసినట్లు నూరేళ్లు గడవ వలెనే ఈ బిడ్డజీవనం! పెళ్లికాని పిల్లని ఎన్నాళ్లని ఎదు రొమ్ముమీద కుంపటిలా భరించడం? దాని నిట్లా గొంతుకు కోసి ఇంకా బ్రతికివుండడంకంటె చావడం మేలు. ఈ గుక్కెడుప్రాణం ఎట్లా పోతుందో పోతుంది. ఎప్పటి కయినా పోవలసినవాళ్ళమేకదా! ఛీ! ఈయమబాధ నేను పడలేను. ఇంతటితోనయినా సునాయాసంగా పోగలిగితే ధన్యుణ్ణే" అని అతడు ప్రాణత్యాగం ఎట్లా గయినా చేసుకోవాలని నిశ్చయపరుచుకొన్నాడు. గొం తుక్కు ఉరిపోసుకు చావాలని మెడకు గుడ్డ చుట్టి బిగిం చాలని చూశాడు. కాని ప్రాణంపోయేదాకా బిగించుకో గలనో లేనో అని అతనికి సందేహం కలిగింది. అది గాక ఈపనిలో ప్రాణికి చాలాబాధ కలుగుతుందని భయంవేసింది. ఏదయినా విషవస్తువు మింగి సునా యాసంగా ప్రాణం పోగొట్టుకోవడం మే లనిపించింది. కాని యెట్లా? గదంతా చీకటిగా వుంది. కన్నూ కన్నూ కనుపించడం లేదు. అతనికి తన కోర్కె నెర వేర్చుకోవడ మెట్లాగో తెలియడం లేదు; గన్నేరు

పప్పు తింటే చస్తారన్న సంగతి ఆకస్మికంగా తట్టింది. అక్కడ గన్నేరుకాయ లెవ్వి? గన్నేరుచెట్లు దొడ్లో వున్నవి. బయటికి పోతే గన్నేరుకాయలు తెచ్చుకోవచ్చు. కాని బయట తలుపు బిగించివుంది. కూతురు సీతమ్మ తోడిపిల్లకాయలతో రోజూ ఆడుకొంటూవుండే గన్నేరుకాయలూ, చింతగింజలూ గవ్వలూ వగైరాలు బుట్టలో వేసి ఆగదిలోనే గూటిలో దాచుకోవడం అతనికి తటాలున జ్ఞాపకంవచ్చింది. వెంటనే ఆగూటికోసం వెదకులాడాడు. గూడూ, గూటిలో బుట్టా చేతికి తగిలినవి. సీనయ్య బుట్టలో చెయ్యిపెట్టాడు. బుట్టలో కాయలు చేతికి నున్నగా తగిలినవి. గుండెలు దడదడ కొట్టుకొన్నవి. ఈరభసం, ఈగొట్టూ తాను చూడకుండా వెళ్ళిపోతే తరువాత వాళ్లతిప్పలు వాళ్లు పడతారని సమాధానం చెప్పుకొన్నాడు. పిడికిలితో పిడికిలికాయలుతీసుకొన్నాడు. ఎట్లో పగలగొట్టి పప్పు నోట్లో వేసుకొని హరహరా అంటూ కళ్ళు మూసుకుని నమిలి మింగేశాడు. వెంటనే మంచ మెక్కి ముసుగుతన్ని భగవన్నామస్మరణ చేస్తూ ప్రాణాచారంపట్టి పండుకొన్నాడు.

సీనయ్య పప్పు తిని అరగంటయింది. ఈ సంగతి బయట ఎవ్వరికీ తెలియదు. అదివరదాకా అరిచి అరిచి గాభరాచేస్తూవున్న సీనయ్య అర్ధగంటనుండీ చడీ చప్పుడూ లేకుండా నిశ్శబ్దంగా ఉండడం చూచి 'అలసి

నిద్రపోయాడుకాబోలు'నని బయటనున్నవా ళ్ళను కొన్నారు. పెళ్ళివారు రారని నిరాశ చేసుకొని విధి ఎట్లా వుంటే అట్లా జరుగుతుందని జనం యావన్మందీ నిద్రపోయారు.

"నాకు లేనిపోని తద్దినం వచ్చి పడిందేమిరా భగవంతుడా" అని ఇన్స్పెక్టరుపంతులు గ్రామచావడి లోనే పక్క పరుచుకొని నడుం వాల్చాడు.

విషం ఎప్పటికి పనిచేస్తుందో అని సీనయ్యా నిమి షాలు లెక్కపెట్టుకొంటూ ఐహికాన్ని మరచి, ఆము ష్మికంమీద దృష్టి వుంచి భగవన్నామం జపిస్తున్నాడు.

ఇంతలో వీధిలో 'బంయ్యి', 'బంయ్యి' మని మోటారు హారన్ చప్పుడయింది. పెళ్ళిపందిట్లో పండు కొన్న యావన్మందీ ఉలిక్కిపడి లేచి బిలబిలలాడుతూ వీధిలోకి పేరెంతీశారు. రెండుమోటార్లు వచ్చి గ్రామ చావడి దగ్గర నిలిచినవి. ఇన్స్పెక్టరుపంతులు వెళ్ళి పెళ్ళివారిని విచారించగా పెళ్ళికొడుకు అన్నగారు వచ్చి ఆయన్ని ఓపక్కకు తీసుకువెళ్ళి "ఏం చేయమంటావు బావా! ఇక్కడికి తెమిలి వచ్చేవరకు తలప్రాణం తోకకు వచ్చింది" అని పెళ్ళికూతురికి పెళ్ళిసమయంలో వస్త్రులకుగాను ఇస్తామని ఒప్పుకొన్న రు. ౪౦౦ లు సమ యానికి దొరకక నానాఅవస్థా పడినట్టూ, అదివరదాకా తప్పకుండా ఇస్తానని ఖరారుచేసిన ఒకపెద్దమనిషి

వాయిదాలు వేసి వేసి చివరకు తొంటచెయ్యి చూపి మోసంచేసినట్టూ, అందువల్ల మరొకచోటా, మరొక చోటా తిరిగి ఆడబ్బు సంపాదించుకురావడంలో అని వార్యంగా ఒక పూటకు పూట ఆలస్య మయినట్టూ కథంతా చెప్పాడు మెల్లిగా. అదిన్నీగాక, తమ మేనమామ – పెద్దవాడు – బయలుదేరేవేళకు వస్తానని చెప్పీకూడా సరిగా ఆ సమయానికి రాక ఆలస్యంచేయడంవల్ల ఆయన కోసం గంగారం మనిషిని పంపి పిలిపించడంలోకూడా కొంత ఆలస్యమయ్యిం దన్నాడు. "సరే, బాగానే వుంది కథ; కాని యీ సంగతు లెవరికీ తెలియనీయకండి ఇక్కడ. నేను చెపుతున్నాను మోటారు చెడిపోయి వుంటుందని. మీరుకూడా గమ్మున వూరుకొని ఆలస్య మయిందనిమాత్రమే చెప్పండి, ఎవరైనా అడిగితేనే అదయినా" అని సలహా చెప్పి ఇన్స్పెక్టరుపంతులు పెళ్ళివారు వచ్చారని సీనయ్యకు కబురుచేశాడు.

రంగమ్మ వచ్చి గదితలుపు తెరచి "పెళ్ళివారు వచ్చారటండీ!" అని చేత్తో తట్టి సీనయ్యను లేపింది. ఆ మాటలు చెవినిపడేసరికి చేస్తూవున్న భగవన్నామ స్మరణ మరచి "ఆఁ! వచ్చారూ?" అని లేచి కూర్చున్నాడు సీనయ్య. కాని మంచం దిగలేకపోయాడు. అప్పుడే నవనాళ్ళూ లాక్కుపోతూ వున్నట్టుగా వుం దతనికి. చావడమా బతకడమా అనే సందిగ్ధా

వస్థలో పడ్డాడు సీనయ్య. లగ్నానికి ముందుగానే అందు కొన్నారు పెళ్ళివారు - ఎంత ఆలస్యం చేసినాను. ఇక చావవలసిన అవసర మేమిటి?

"అయ్యో! దేవుడా! ఇదేందిరా బాబూ! ఏం ఖర్మం వచ్చిందిరా ఇప్పుడు. ఎరక్కపోయి తిన్నాను పప్పు. విరుగు డుందో లేదో దీనికి. చాలాసేపయింది తిని. అప్పుడే నవనాళ్ళూ లాక్కుపోతున్నవి. ఏంబుద్ధి? ......" అనుకొంటూ కళ్ళ వెంబడి నీరు కుక్కుకొంటూ ఏడుస్తూ మంచంమీద కూర్చున్నాడు సీనయ్య.

పెళ్ళివారు వచ్చారనేసరికి ఇంటికి మళ్ళా కళ వచ్చింది. గ్యాసులైట్లు హెచ్చించారు. "అమ్మయ్య! సీతమ్మ అదృష్టవంతురాలర్రా" అని ఒకరూ, "మోటారు దారిలో చెడిపోయిందట, లేకపోతే సాయంత్రానికే రావలసినవారటమ్మా" అని యింకొకరూ, "ఈ సీనయ్యపంతులిది మొదటినుండీ ఒకటే ఖంగారు; నిదానమా వల్లకాడా?" అని మరొకరూ, "ఎంతటివాళ్ళ కయినా ఇబ్బందులు రాకుండాఉంటవా, కాస్త ఓపిక పట్టాలికాని" అని వేరొకరూ — ఇట్లా ఎవరికి తోచినట్లు వారంటున్నారు. బయట బయలుదేరిన ఉత్సాహం చూచేవరకు సీనయ్యకు బతికి మళ్ళీ పెళ్ళికార్యం జరిపించాలని ఆశ పుట్టింది.

"పెళ్ళివారు వచ్చి అరగంటసే పయినప్పటికీ బయటికి రాడేం సీనయ్య? ఇంకా కోపమేనా యేమిటి? పోయి వియ్యాలవారిని పలకరించమని ఆయనతో చెప్పండమ్మా! బాగుండదు" అని కొంద రమ్మలక్క లారంభించారు. ఈమాటలన్నీ సీనయ్యచెవిలో పడుతున్నవి. ఇంతలో సీనయ్యకొడుకు వచ్చి "నాన్నా! పెళ్ళివారు వచ్చారు. నిన్ను గ్రామచావడిదగ్గరకు పిలుచుకు రమ్మన్నాడు ఇన్స్పెక్టరుపంతులు" అని తండ్రితో చెప్పాడు.

సీనయ్యకు దిక్కుతోచడంలేదు. తొందరగా పోయి వియ్యాలవారిని మర్యాద చేయాలని వుంది. కాని తిన్నవిషంమూలాన్ని అసలు అంతదూరం పోగలనో లేనో అని అతనిభయం. కాళ్ళూ, చేతులూ లాగడం ఎక్కువయిపోతోంది. పోనీ, బయటికి ఉన్న సంగతి చెప్పి వేసి ఏ విరుగుడయినా తిందా మనుకొంటే - పైకి చెప్పడానికి సిగ్గు. ఎదురుగా నిలబడ్డకొడుక్కు ఏసమాధానమూ చెప్పకుండానే సీనయ్య గొంతులోకి లోతుగా రెండు వేళ్ళూ పోనిచ్చి బలవంతంగా ఓక్కు, ఓక్కుమని డోక్కోవడం ఆరంభించాడు. కాని పైత్యపు నీరేకాని పైకి పప్పేమీ రాలేదు. క్రమంగా కడుపులో తిప్పుతున్నట్టూ, తల తిరుగుతున్నట్టూ, విషం గుండె కెగతన్నుతున్నట్టూఅయి అతని కావేదన జాస్తి అయింది. ఇక ఆలస్యం చేస్తే విషమిస్తుందని భయం. ఇప్పటికే

వాళ్ళు కంపరం పుట్టింది. బయటికి చెప్పక విధిలేక తెగించి సీనయ్య కొడుకును దగ్గరకు తీసి కౌగిలించుకొని "నన్ను బతికించరా నాయనా! ఏవైద్యుణ్నయినా తొందరగా పిలిపించరా! నాప్రాణం కాపాడరా బాబూ!" అని బారుమని ఒక్కయేడుపు ఏడ్చాడు. కొడుక్కి ఇదేమీ అర్థంకాలేదు.

"ఏందే ఈ యేడుపు? నాన్నా! పెళ్లివారు వచ్చారే.– ఇక భయంలేదు. ఉదయంముహూర్తానికి పెళ్లి జరుగుతుంది లేవే — నాన్న ఇదేమిటిదే– అమ్మా! అమ్మా! ఇట్లారా! ఇట్లా అంటున్నాడు ఇదేందే?" అని అతడు తల్లిని పిలిచాడు. రంగమ్మ పరుగున వచ్చి ఏమి టేమిటి సంగతని అడిగింది.

"అయ్యో! ఇక నేను బతకనే – నాచావు సమీపించిందర్రో! చద్దామని గన్నేరుపప్పు తిన్నానర్రో! చాలాసేపయిందర్రో! పిల్ల పెళ్లి చేసుకు మరీచస్తానర్రో! నన్ను బతికించండర్రో! బుద్ధితక్కువై తిన్నానర్రో!" అని సీనయ్య వెర్రికేకలు పెట్టి మంచంమీద పడి కాళ్లూ చేతులూ గిల గిల తన్నుకోవడం ఆరంభించాడు. రంగమ్మ రెండుచేతులతోనూ గుండెలు బాదుకొని "గన్నేరుపప్పే - మింగడమే - అయ్యబాబో! ఇంకేముందిరా నాయనా! కొంప మునిగిందిరా తండ్రీ! ఇదేం ఖర్మంరా దేవుడా! ఆయన్ని బతికించే ఉపాయం

చూడరా కొడకా!'' అని గొల్లుమనింది. ఆ రొదతో బంధువు లందరూ మూగారు. నిమిషంలో సంగతంతా గ్రామంలో పొక్కిపోయింది. ''సీనయ్య విషం తిని చచ్చా'' డని కొందఱూ, ''చచ్చిపోతున్నా'' డని కొందరూ, ''ఇంకా చావలేదు. చస్తా'' డని కొందరూ - ఇట్లా ఊరంతా గగ్గోలు పుట్టింది. ''రామ రామా'' అనేవారూ, ''శివశివా'' అనేవారూను.

సీనయ్య రెండుచేతులతోనూ కడుపు పిసుక్కొం టున్నాడు; ఆయాసపడుతున్నాడు; డొక్క ఎగరేస్తు న్నాడు; మంచంమీద ఈ పక్కకూ ఆ పక్కకూ దొర్లుతున్నాడు. కాళ్లూ చేతులూ మంచాన్ని వేసి కొట్టు కొంటున్నాడు. దాహం దాహం అంటూ వుంటే మధ్య మధ్య సీనయ్యకు కాసినన్ని నీళ్లు పోసి నాలుక తడుపు తున్నారు. ''నాగతి ఏం చేసిపోతున్నావయ్యా'' అని రంగమ్మ భర్తమీద పడి మొత్తుకొంటోంది. ఇంటిల్లి పాదీ, పిన్నా పెద్దా గోల ఆరంభించారు. సీనయ్య వంటి మీద చెయ్యి వేసి చూడగా రంగమ్మ చేతికి చల్లగా తగిలిన ట్లయింది. ''ఇం కేముంది? అయ్యబాబో, ముంచుకువచ్చిందర్రో'' అని వెర్రికేక పెట్టింది. జనంలో గందరగోళం ఎక్కువయింది.

ఈ సంగతంతా మొగపెళ్లివారికి తెలిసింది. అప్పటికి తొలికోడి కూసి రెండుగడియ లయింది.

ఇన్స్పెక్టరుపంతులూ, మగపెళ్లివారిలో కొంతమందీ సీనయ్యను చూడడానికి వచ్చారు. ఎటు పోయి ఎటు వస్తుందో అని పెళ్లికొడుకునుకూడా రావద్దన్నారు. ఇన్స్పెక్టరుపంతులు వచ్చి సీనయ్యను చేత్తో తాకి పరీక్షించి "ఏమీ విపరీతమయినగుణాలు లేవే!" అన్నాడు. కాని ఆయన మాటల్లో ఎవ్వరికీ నమ్మకం లేకపోయింది. ఇంతలో నారాయణసింగుకు వర్తమానం వెళ్లింది.

౫

నారాయణసింగు ఇదివరలో సర్కారులో కంపౌండరునౌకరీ చేసి రిటైరయి ఆ గ్రామంలో కాస్తో కూస్తో ప్రైవేటుగా వైద్యం చేస్తున్నాడు. చిరకాలాన్నుంచి గడించిన అనుభవంచేత అతని మందులు కొందరికి పనిచేస్తున్నవి. కొందరికి పనిచేయటంలేదు. అయినా ఇంజక్షను వైద్యంలో గట్టివాడని ఆ చుట్టుపక్కల అతని కెట్లాగో పేరు వచ్చింది. సీనయ్యకొడుకుపిలుపుమీద స్టెతాస్కోపు తీసుకొని నారాయణసింగు చక్కా వచ్చాడు. విషయం అంతా విన్నాడు. గన్నేరుకాయలు పగులగొట్టి పప్పు తిన్నానని రోగి తానే స్వయంగా ఒప్పుకొంటున్నాడు కాబట్టి కడుపులోకి విషం పోయిన సంగతి అనుమాన మేమీ లేదని స్థిరపరుచుకొన్నాడు నారాయణసింగు. గుండెలు పరీక్షించాడు. కళ్లూ నాలుకా

చూశాడు. తిన్న పప్పు జీర్ణమై ఈపాటికి విషం రక్తంలో కెక్కివుంటుందనీ, ఇప్పుడిక విషం విరుగుడు నిమిత్తం డోసు మందు లిచ్చి ఉపయోగం లేదనీ, ఇంజక్షను ఒక్కటే ఇప్పుడు చేయవలసిన చికిత్సఅని చెప్పాడు. ఇంజక్షనుకు పది హేనురూపాయలవుతుందనీ, అప్పటికీ ఒక మందు అక్కడికి ఆరుమైళ్లదూరానవున్న పట్నంనుంచి తెప్పించవలసిఉంటుందనీ సింగు ఖచ్చితంగా తెలిపాడు. ఇది అంతా విని ఇంజక్షను ఇచ్చేవరకు చాలా ఆలస్య మయ్యేటట్టు ఉన్నదని తలచి "తెల్లవారిన తరువాత ఆలోచిస్తాం లెండి" అని చెప్పి ఆ నారాయణసింగును పంపి వేశారు పెద్దలు.

ఆగ్రామంలో కంసాలి భద్రయ్య గొప్ప నాటు వైద్యుడని పేరు. అతన్ని పిలిపిస్తే ప్రస్తుతం తాత్కాలికంగా ఏదో చిట్కా వైద్యం చేస్తాడని ఎవరో అన్నారు. వెంటనే అతనికోసం మనిషి పరుగెత్తాడు. భద్రయ్య తన మందులసంచి తీసుకొని వచ్చి సీనయ్య నాడి చూశాడు. కడుపు నొక్కాడు. కళ్లు చూశాడు.— పెదవి విరిచాడు. లాభం లేదన్నాడు. సూర్యోదయం అయి పైత్యపు ఎండ ఎక్కిందంటే ఇక మనిషి మీకు దక్కడన్నాడు. సీనయ్యకు మూలు గెక్కువయింది. దాహం అంతకన్న ఎక్కువయింది. తాపం హెచ్చిపోతోంది. ఒగర్పు అధికమయింది. దొర్లాట హెచ్చింది.

"ఈమనిషిని బ్రతికించడానికి నావల్లకా" దంటూ కంసాలి భద్రయ్యా తనసంచి తీసుకొని వచ్చిన దారినే వెళ్ళిపోయాడు. ఇంటిల్లిపాదీ గొల్లుమన్నారు.

తెల్లవారుతోంది. తూర్పు రేఖలు కనబడుతున్నవి. ఉదయం అయిదున్నర దాటింది. సీనయ్యాయింటిదగ్గర రోదనిశబ్దం మిన్నుముట్టింది. సూర్యోదయం అయిన తరువాత ఇక ఘటం నిలవదని భద్రయ్యా చెప్పాడు. సూర్యోదయం ఎప్పు డవుతుందో, ప్రాణం ఎప్పుడు పోతుందో అని చూస్తున్నారు అంతాను. ఆగదిలోనే కింద గడ్డిపరిచి సీనయ్యాను భూశయనం చేశారు. మామా ఏం చెప్పావంటే, మామా ఏం చెప్పావని సీనయ్యా చుట్టూ మూగారు బంధువులు. సీనయ్యా తెలివిగానే వున్నా డింకా! కాని వెర్రిచూపులు చూస్తున్నాడు. వాళ్లంతా తెగ చెమటలు పోస్తున్నవి. ఆరాటం ఇంకా హెచ్చవుతోంది.

ఇన్‌స్పెక్టరుపంతులూ, మొగపెళ్లివారూ సంప్రదించుకొని ఇక ఈ పరిస్థితుల్లో పెళ్లి సంగతి ప్రస్తావన చేయడం బాగుండదని, తరువాతసంగతి చూచుకో వచ్చునని అప్పటికి పెళ్లివా రందరూ ఎవ్వరితోనూ చెప్పకుండా స్వగ్రామానికి చక్కాపోయారు. "ఇంత వెర్రి వెంగళప్ప సీనయ్యాకూతురిని తా నిక పెళ్లిచేసుకో"నని పెళ్లికొడుకుమాత్రం ఏమేమో శాబ్దీల

మరీ వెళ్లిపోయాడు. భార్యనూ, పిల్లవాణ్నీ ఇంటికి పంపి వేసి ఇన్స్పెక్టరుపంతులుమాత్రం తాను సీనయ్యఇంటి వద్దనే నిలిచి పోయాడు. 'శుభం తలిస్తే ఇట్లా వచ్చిం దేమిటిరా' అని విచారించాడు ఇన్స్పెక్టరుపంతులు.

౬

అప్పుడే సూర్యోదయమయి బారెడు పొద్దెక్కింది. కాని సీనయ్య కింకా ప్రాణం పోలేదు. ఏడుస్తున్నవారు కొందరూ, ఓదారుస్తున్నవారు కొందరూనూ.

అంతకుముందు రెండురోజులక్రిందట ఆ ప్రక్క గ్రామానికి ఇద్దరు అత్తరుసాహేబులు వచ్చి అత్తర్లమ్ము కొంటున్నారు. ఉదయాన్నే ఆ గ్రామాన్నుండి బయలు దేరి కరణంగారింట పెళ్లి అని విని అత్తరేమైనా ఖర్చవు తుందేమో అని పందిరిని ఆనమాలుకట్టి కరణంగారి ఇంటికి వచ్చారు. అక్కడ పెళ్లీ లేదు: ఏమీ లేదు. ఏడుపులూ పెడబొబ్బలూను. కరణంగారికుటుంబం అంతా మహాసముద్రంలో మునిగివుంది. ఇక గంటకో అరగంటకో సీనయ్యప్రాణం పోతుందని నిరాశచేసుకొని దుఃఖసాగరంలో మునిగివున్నారు అంతాను.

ఆయిద్దరుసాహేబులలో ఒకడికి కొంచెం యూనానీ [illegible]ం తెలుసును. అతడు జబ్బేమిటి, విషయ మేమి

టని బయట పందిట్లోవున్న సీనయ్యకొడుకు నడిగాడు. రాత్రి జరిగినసంగతులన్నీ చెప్పుతూ, ఇంట్లో తన చెల్లెలు ఆడుకొనే చింతగింజలబుట్టలో గన్నేరుకాయలు ఉంచే, వాటిని బద్దలుకొట్టి పప్పు తిన్నాడని, విషయ మంతా సాహేబుమనస్సుకి వచ్చేటట్టు వివరంగా చెప్పాడు. 'నన్ను చూడనివ్వం' డన్నాడు సాహేబు. సీనయ్యను మంచంమీద పరుండబెట్టించి యివతలికి తీసుకువచ్చారు. సాహేబు ఆపాదమస్తకమూ పరీక్ష చేశాడు. దుర్గుణాలు కనిపించకపోయినా ఉపేక్షచేయ డానికి ఆ సాహేబుకు ధైర్యం చిక్కలేదు. అందువల్ల వెంటనే మందు తయారుచేసి యిస్తాననీ, వేసిన అరగంట కల్లా మందు జవాబిస్తుందనీ నమ్మకంచెప్పుతూ మందు తయారుచేయడానికి ఒక యేబులం బాదంకాయలూ, అయిదుపలాల పుట్టతేనే, అర్ధశేరు ఆవుపాలూ వెంటనే తెప్పించమని సాహేబు ఉత్తరువుచేస్తూ "మీఅమ్మాయి ఆడుకొనే చింతగింజలూ, గన్నేరుకాయలబుట్టాకూడా తెప్పించండి. కావా" లన్నాడు. ఆవుపాలకోసరమూ, పుట్టతేనెకోసరమూ సీనయ్యకొడుకూ, ఇన్స్పెక్టరు పంతులుజవానూ పరుగుపెట్టేరు.

చింతగింజలూ, గన్నేరుకాయలబుట్టాకోసరం సీతమ్మ దక్షిణపుగదిలోకి పోయి మామూలుగా పెట్టే గూటిలో వెతికింది కాని ఆ బుట్ట కనబడలేదు. పె

గాను తెచ్చిన బాదంకాయలబుట్ట ఆ గూటిలోనే వుంటే అది బయటికి తీసుకువస్తూ సీనయ్యపక్క కూర్చున్న తల్లి రంగమ్మతో "అన్నట్టు మరచిపోయినానే అమ్మా! ఆ బుట్ట మళ్లీ తీసుకురానే లేదు-వారంరోజులక్రిందట రెడ్డి గారి చెల్లక్క నాగన్నేరుకాయలబుట్ట తీసుకుపోయింది. ఆ గూట్లో వున్నదల్లా ఈ బాదంకాయలబుట్టే" అని ఆ బుట్ట అక్కడ పెట్టింది.

ఆ బుట్టకేసి చూస్తూ "ఈ బుట్టలో కాయలేనా నేను పగలగొట్టి తిన్నది" అంటూ మంచంమీద పరున్న సీనయ్య లేచి ఒక్క గంతువేశాడు.

# పోలయ్య

విఠలాపురాగ్రహారం వైదీకి బ్రాహ్మణ్యాం పుట్ట. అనాది అగ్రహారం. ఆ అగ్రహారంలోగల రెండువందల బ్రాహ్మణకుటుంబాలలోకీ వెంకటశాస్త్రి మకుటం వంటివాడు. గొప్ప తర్కశాస్త్రపండితుడూ, వైయాకరణీ, నైష్ఠికుడూను. త్రికాలములా సంధ్యావందనం చేసుకోనిదే గంగ తాకడు. సనాతనధర్మం అన్నా, వర్ణాశ్రమధర్మం అన్నా చెవి తెగ్గోసుకొంటాడు. చిన్నతనంలో తల్లిదండ్రుల్ని విడిచి కాశీకి వెళ్లి పదేళ్లుగా గురుకులవాసంచేసి శాస్త్రం పఠించిన పండితశ్రేష్ఠుడు.

ఆయనకు పంచములంటే సుతలామూ సరిపడక పోవడం అంతగా ఆశ్చర్యకరమైన విషయంకాదు. పంచములంటే పనికిరాని బ్రాహ్మణోత్తము లెంతమందో లేక పోలేదు. కాని వెంకటశాస్త్రిమట్టుకు వాండ్ల విషయమై ప్రత్యేకకృషి చేశాడు. గాంధీగారు అస్పృశ్యతా నివారణోద్యమం ఆరంభించినదిలగాయతు పంచములను గురించి అనేకగ్రంథాలు తిరగేసి,కూలంకషంగా గాలించి పంచముల పుట్టుపూర్వోత్తరాలనుగూర్చి గొప్ప పరిశ్రమ చేసిన పరిశోధకుడు. ఆయన అసలు పంచములు హిందూ



మతానికి సంబంధించినవారు కారని ఓంప్రథమంలో ఒక నూతనసిద్ధాంతాన్ని లేవదీశా డీమహనీయుడు!

ఆ బ్రాహ్మడికి వయస్సు ముదిరినకొద్దీ, తాను చేసిన గాఢమైన పరిశోధన ఫలితంగా, చిన్నతనంలో ఆయనకు పంచముల విషయమై ఉండిన అభిప్రాయా లన్నీ వయస్సుతోకూడా ముదిరి, స్థిరపడి, నఖశిఖపర్యం తమూ గాటంగా నాటుకొనిపోయినవి. రానురాను ఈకృషిలో ఆయన కత్యంతమైన విశ్వాసమూ, ఆనం దమూ కలుగుతూ వచ్చింది. అందువల్ల ఆయన కాశీ విడిచి, ఇల్లు చేరుకొని వివాహంచేసుకొన్నది లగాయతు, ఈ ముప్పై ఏళ్లుగా స్వగ్రామంలోనే బ్రాహ్మణవిద్యా ర్థులకు విద్యాదానం చేసుకొంటూ కాలక్షేపంచేస్తూ వస్తున్నాడు.

అస్పృశ్యతను తొలగించవలెననీ, పంచములకు హరిజనులని నూతన నామకరణంచేసి వారికి దేవాలయ ప్రవేశంకూడా ప్రసాదించవలెననీ - ఇట్లాంటి బిల్లులూ, ఉద్యమాలూ, ఉపన్యాసాలూ బయల్దేరేవరకు, ఆయన కాపాదమస్తకమూ ఒళ్లు కంపించిపోయి, తనకళ్లయెదుట సనాతనధర్మం చచ్చిపోతూవుండగా, తనవంటివారు చూస్తూ చేతులు ముడుచుకొని కూర్చోవడం భావ్యం కాదని, సనాతనధర్మోద్ధరణంకోసం నడుం కట్టి రణరం గంలోకి దూకినాడు. ఆక్షణం లగాయతూ నూతనోద్య

మాన్ని రూపు మాపి సనాతనధర్మం స్థాపించే పనిమీద, ఆయన తిరగనన్ని దేశాలూ తిరిగి తిరిగి వేసరిపోతూ ఉన్నాడు.

ఇంటివద్ద సంసారం యావత్తూ చేతి కెక్కివచ్చిన ఇరవైఏళ్ళకొడుక్కి వప్పగించి, మాలమాదిగలను పైకి రానియ్యకుండాచేసే కృషిమీద ఉత్తరహిందూదేశంలో పర్యటననిమిత్తం ఇప్పటికి రమారమి రెండేళ్ళక్రిందట బయల్దేరి వెళ్ళాడు. కాశీ, గయ, ప్రయాగ్, ఢిల్లీ, పంజాబు, బరోడా వగైరా స్థలములలో అనేకమంది పండితులతో పంచములకు సంబంధించిన విషయాలన్నీ చర్చించి, క్రొత్తవిషయాలెన్నో సేకరిస్తూ, తన సిద్ధాంతాలను దృఢపర్చుకొంటున్నాడు. ఆఖరుకు పంచములు హిందూమతం వదలి అన్యమతాల్లో కలుస్తామని తీర్మానించుకొన్నట్టు వదంతి పుట్టేవరకు 'పీడ వదలింద'ని వెంకటశాస్త్రి బ్రహ్మానందపడుతున్నాడు.

ఇల్లు విడిచిన ఇరవై రెండు నెలలకు ఇంటిదగ్గర తనకొడుక్కి కొమారుడు కలిగాడనీ, ఆసంవత్సరం మాఘ శుద్ధపంచమీ మంగళవారం ఉదయం ౯ గంటలకు మనుమడికి భారసాల జరపవలసి ఉందనీ ఆనాటికి పెద్దవాడయిన తాతగారు తప్పక రావలసిందనీ, ఉత్తరాలమీద ఉత్తరాలూ, టెలిగ్రాములమీద టెలిగ్రాములూ రాగా, ఇక ముహూర్తం నాలుగురోజు

దనగా వెంకటశాస్త్రి కాశీలో బయల్దేరి ఏకాయెకీని సోమవారం రాత్రి ౧౧ గంటలకు తనగ్రామానికి సమీపంలో ఉన్న పుంజూరుస్టేషన్‌లో రైలు దిగాడు.

పుంజూరు నెల్లూరికి దక్షిణంగా పోతే మూడో స్టేషన్. ఆస్టేషన్ కొంచెం పెద్దస్టేషన్‌లోనే, అనగా సెకండుక్లాసు స్టేషన్‌లోనే లెఖ అయినప్పటికీ, ఆరాత్రి మట్టుకు వెంకటశాస్త్రితోకూడా ఏ అయిదారుగురో కంటె జాస్తిగా జనం దిగలేదు. వెంకటశాస్త్రి రైలు దిగీ దిగడంతోనే గేటులో టిక్కెట్టు ఇచ్చేసి, కాశీ గంగ చెంబులూ, తనగుడ్డలూ కలిపినమూట నొకచేత్తోనూ, జారీరాగిచెంబు మరొకచేత్తోనూ పట్టుకొని గేటుదాటి బయటికి వచ్చాడు.

పుంజూరుస్టేషన్‌కీ విఠలాపురానికీ షద్దెనిమిది మైళ్లు బరువుగా ఉన్నది. పదహారుమైళ్లు కంకరరోడ్డు మీాదా, రెండుమైళ్లు మట్టిరోడ్డుమీాదా పోవాలె. ఆరోడ్డుమీాద రాత్రి అనకుండా, పగలనకుండా ఎప్పుడూ ఎడతెరపిలేని రహదారీ ఉంటూఉండేది. ఆ రోడ్డు పుంజూరునుండి గంగపట్నంమీాదుగా తూర్పు సోమేశ్వరం వరకూ ముప్పైమైళ్లు పోతుంది. ఏ పొయ్యేళ్లో ప్రయాణంచేసినా భయంలేని రస్తాకాబట్టి, రైలు దిగంగానే బండి కట్టుకుంటే కాకులు కూసేవేళకు అలాగ్గా [illegible] చేరుకోవచ్చుగదా అనుకొని సోమవారం రాత్రి

బండికే వచ్చాడు వెంకటశాస్త్రి. కాని ఏ రైలుకు చూచినా బిలబిలమంటూ ఒంటెద్దుబళ్ళవాళ్ళు ప్రయాణీకుల కాళ్ళ కడ్డం తగిలి చేతిలో మూటలు పెరుక్కోని పొయ్యే సమ్మర్దంగల ఆస్టేషన్ దగ్గర ఆరాత్రి వెంకటశాస్త్రికి ఒక్క ఒంటెద్దుబండైనా కంటిలో కలికానికికూడా కనుపించలేదు.

రాత్రి పదకొండున్నరా, రమారమి పావు తక్కువ పన్నెండూ కావొచ్చింది. వెంకటశాస్త్రి దిగిన రైలు కూతేసి వెళ్ళిపోయి చాలాసేపయింది. తనతో కూడా దిగిన జనం ఎట్లా వెళ్ళారో ఎవరిదారిన వారు వెళ్ళారు. రాత్రి డ్యూటీచేసే రైలుఉద్యోగి గేటుతలుపు బిగించి, పోర్టరూ తనూ అప్పుడే చెరొక బెంచీమీదా నడుములు వాల్చారు. స్టేషన్ నిశ్శబ్దంగా ఉంది. పైన వ్రేలాడకట్టిన లాంతరుదీపం తగ్గింపబడి, మినుకు మినుకు మంటూఉంది.

స్టేషన్ మెట్లు దిగి పడమటగా ఉన్న మైదానం వైపు వెంకటశాస్త్రి పరకాయించి చూచాడు. ఆ ప్రదేశం అంతా నిర్జనంగా ఉంది. తాను రెండేళ్ళక్రిందట చూచినస్థలంతో పోల్చుకొంటే ఇప్పటి ప్రదేశం పాడుపెట్టిన ఇల్లువలె కళావిహీనమై కన్పట్టింది. శుద్ధపంచమి కాబట్టి నెల చాలా లేతలోనే వొరిగిపోయింది. వెంటనే చీకటి అలుముకొని విజృంభించింది. మాఘమా

మంచు కురుస్తోంది. చలి దవడలు నొక్కేస్తూవుంది. బిగ బట్టిన చేతిపిడికిళ్లు విప్పితే శరీరంయావత్తూ పీక్కొని తినే ట్టుగా ఉంది చలి. వెంకటశాస్త్రిది అంత ముసలి వయస్సు కాకపోయినా, ఏభయిదాటి అరవైలో పడ్డ ఘటం. అందువల్ల అంత తీవ్రమైన చలికిగాని, ఎండకు గాని పూర్వంలాగా ఓర్చుకోలేకపోతున్నాడు. ఏమయి నప్పటికీ, తెల్లవారకుండా ఆపద్ధెనిమిదిమైళ్లు ప్రయాణం చేసితీరాలె. విధిలేదు. వెంటనే బయల్దేరితేనేగాని అను కొన్న ప్రకారం ఇంటికి చేరుకోలేడు. ముహూర్తానికి ముందుగా అందుకోకపోతే చేసినప్రయత్నం వృథా అయిపోవడమే కాకుండా తాను రానందుకు ఇంటిదగ్గర ఖంగారు పడతారేమో! బాడుగబండ్లను నమ్ముకొని ప్రయాణం చేశాడు. తాను ఇల్లు విడచిన ఈ రెండేళ్లుగా కాలపురుషుడు కలుగచేసినమార్పు లాయన కేం తెలుస్తై? "స్టేషన్‌కు ఇంటిదగ్గరనుంచి బండిని పంప వలసిందని అబ్బాయికి జాబువ్రాసినా బాగుండిపొయ్యేది. ఎంత పొరపాటు పడ్డాను" అని తనలో తానే పశ్చా యించుకొన్నాడు. కొంతసేపటికి, అసలు ఆ స్టేషన్ పుంజూరు స్టేషనేనా అని ఆయన కనుమానం వేసింది. ప్లాటుఫారంమీదికి వెళ్లి చెక్కమీది అక్షరాలు చదువు కొన్నాడు. "పుంజూరు" అని ఆయనకళ్లకు కనుపించింది: ...షికి అనుమానం తీరింది ; కొంత ధైర్యం కలిగింది.

కాని ఏంలాభం! ప్రయాణం సాగేఎత్తు కన పడడంలేదు. ఒక్కబండిఅయినా లేకుండా ఇంత శూన్యం కావడానికి కారణ మాయనకు గోచరించడంలేదు. ఎవరినైనా అడిగి తెలుసుకొందా మనుకొన్నాడు. కాని ఎక్కడా మనిషిసంచారం లేదు. సర్వమూ నిశ్శబ్దంగా ఉంది. కీచురాళ్ల కూతలూ, ఎక్కడనో దూరంగా మొరిగే కుక్కల అరుపులూ తప్ప మరొకధ్వని శాస్త్రి చెవికి సోకడం లేదు. పోనీ, గ్రామంలోకి పోయి బండ్ల కొరకు విచారిద్దామా అనుకొన్నాడు. కాని ఒక మైలు పోతేనేగాని ఊరు కనపడదు. ఆ అంధకారంలో, ఆ చలిలో, ఆమూట భుజాన వేసుకొని అంతదూరం పోలేక పోయాడు. ఆయన కేమీ పాలుపోకుండా ఉంది. ఏమీ తోచక – మంచులో తిరిగితే రాత్రి నిద్రలేక జలుబు భారం చేస్తుందేమోనని – బయట మైదానంలో తిరిగే మనిషి స్టేషనుహాల్లోకి పోదామని వెనక్కి తిరిగి, నాలుగడుగులు వేశాడు. ఇంతలో పడమటితట్టునుండి ఏదో ఒకబండి వస్తున్నట్టు చప్పుడయింది. శాస్త్రి తటాలున వెనక్కి తిరిగి చూశాడు. ఒంటెద్దుబండి ఒకటి వచ్చి ఆతట్టు ఎడంగా ఉన్న ఒక వేపచెట్టుకిందికి పోయి నిలచింది. వెంకటశాస్త్రికి కొంత ఆశ కలిగింది. పరవా లే దనుకొన్నాడు. వడివడిగా పదిబారలదూరం అడుగు వేసుకొంటూ పొయ్యేవరకు, బండివాడు ఎద్దును

విప్పి, కాడి కింద పెట్టి, చాపకింద గడ్డి తీసి అప్పుడే ఎద్దు ముందర వేశాడు. గడ్డి తినడానికిగాను, బయట నిల బడిన ఎద్దు నాగలదొడ్డిలో ఒకకాలు ముందుకు వేసి, మెడకిందా పొట్టకిందా పుటుకుపుటుకున కుట్టే జోరీగలను మూతితోనూ, చెవులతోనూ, తోకతోనూ తోలు కుంటూ, ఇంకా గడ్డిలో మూతిపెట్టకుండానే నిలబడి ఉన్నది. పండుకొని నిద్రపోదామని బండివాడు ఈతాకుల చాపను బయటికి తీయబోతూ ఉన్నసమయంలో వెంకట శాస్త్రి వెళ్ళి "అబ్బీ! విఠలాపురానికి బండి కడ తావా?" అని అడిగాడు.

"విఠలాపురమూ లేదు, గిఠలాపురమూ లేదు. వెళ్ళవయ్యా" అన్నాడు బండివాడు.

"బాబుకదూ! నా తండ్రికదూ! నేను చాలా తొందరగా పోవాలె. ఇప్పుడు ఎకాఎకీని పోకుంటే నాకు చాలా తొందరపనులు చెడిపోతవి. నాకోసరం కాస్త కష్టపడుదూ నాయనా! పెద్దవాణ్ణి! బహుమంచి వాడివి" అని ప్రాధేయపడ్డాడు శాస్త్రి.

"నాకు నిద్రొస్తోంది తాళవయ్యా! పండుకో వాలె" అని బండివాడు చాప నేలమీద పరిచాడు. నిద్రబద్ధకం తోసుకురావడంచేత చాపమీద నడుం వాల్చాడు.

ఇక ఆ బ్రాహ్మణుడు బండి కట్టమని 'బాబు కాదూ, నాయనకాదూ' అని ఒకటే బ్రతిమాలడం మొదలుపెట్టాడు. బండివాడు కట్టలేనని విసుక్కోవడమూ, బ్రాహ్మణుడు బ్రతిమాలడమూను. చివరకిది పని కాదని "ఇదిగో చూడు. నువ్వు కోరినంత బాడుగిస్తాను. రూపాయిన్నర ఇస్తాను తీసుకో; లే! ఎక్కడా బండి చిక్కలేదు నాకు. గిరాకీగా ఉంది: పోగొట్టుకోబోకు" అని ఆశపెట్టాడు శాస్త్రి.

"ధనమూల మిదం జగత్" కదా! మామూలు బాడుగకంటె అర్ధరూపాయి అదనంగా వచ్చేపాగీ కనపడేవరకు బండివాడికి ఆశ పుట్టింది. వెంటనే వాడు చాప చుట్టి బండిలో వేసి, "ఎంతమంది మనుష్యు"లని అడిగాడు.

"నే నొక్కణ్ణే" అన్నాడు శాస్త్రి.

బండివాడు ఎద్దుముందర వేసిన గడ్డిని బండిలో చాపకింద తురిమి, నొగ ఎత్తి, ఎద్దును అంకెకు తెచ్చుకొని, కాడి అర్రుమీదపెట్టి, మెడపలుపు బిగించాడు. వెంకటశాస్త్రి జారీచెంబు చేత్తో తీసుకొని వెళ్ళి, కాలు ముడిచి అనుమానం తీర్చుకొన్న తర్వాత మూట తెచ్చి బండిలో పెట్టాడు. కాలి చెప్పులు చాపకింద భద్రపరచి, "పట్టుకో" అని బండివాణ్ణి హెచ్చరించి, "రామయ్యతండ్రీ" అంటూ

బండిలో ఎక్కి కూర్చున్నాడు. పదిగజాలదూరం రోడ్డు. ఎక్కేవరకూ బండివాడు నొగ పట్టుకొనే నడిపించి, రోడ్డెక్కిన తర్వాత పగ్గం బండివెదురుదబ్బలకు కట్టి, నొగలో ఎక్కి కూర్చున్నాడు. వాడు కొరడాకోసం ఇంకా తడువుల్లాడుకొంటూ ఉండంగనే ఎద్దు మెల్లగా పరు గందుకొన్నది.

రాత్రి చాలా పొద్దుపోయింది. ఒంటిగంట కావచ్చింది. రెండురోజులుగా ప్రయాణం బడలికచేత పాపం బ్రాహ్మడు డస్సిపోయాడు. కాస్త కన్ను కూర్కుదా మనుకొని, నడుము వాల్చి తలకిందికి మూట లాక్కొన్నాడు. "వెనకబరువు సామీ" అని బండివాడు హెచ్చరించేవరకు మూటతోసహా తాను ముందుకు జరిగాడు. మూటా, మూటమీద పెట్టుకొన్న తనతలా, బండివాని పృష్ఠానికి వెళ్లి తగులుకొన్నవి. "రవంత వెనక్కు అనండి. ముందు బరువయిం" దన్నాడు బండివాడు. బండివాని సహాయంతో మూట కొంచెం వెనక్కు లాక్కొని, బండివాడు "ఆఁ" అన్న తర్వాత, శాస్త్రి కాశ్మీరశాలువ కప్పుకొని, ముసుగు తన్ని, కాళ్లు ముడుచుకొని, ఒత్తిగిలి మూడొంకె వేసి పండుకొన్నాడు.

బండి రెండుమైళ్లు సాగిపోయింది. ఆ బండి పట్టె ...తతుక్కు; ఎప్పటిదో ఇక్ష్వాకులనాటిది. అందులో

అడ్డబండి. బొడుగ బళ్లవాళ్లకు కమానుబళ్లెక్కణ్ణుంచి వస్తాయి? పైన గూడుకు వేసిన ఈతాకులచాప చాలా భాగం శిథిలమై, బండిలో పండుకొని పైకి చూస్తే ఆకాశంలో నక్షత్రాలు అగుపడుతూ ఉన్నవి. బండి చక్రాలకు వేసిన సామాను కులంగలకొయ్య కానందువల్ల, చలికి బిర్రబిగిసి, ఆకులూ, పూటీలూ వంకలుపోయి, ఎగుడుదిగుడుగా బండికి దొడ్డి ఏర్పడింది. కుండల్లోని ఉలవాయిలూ, ఇరుసుకడలూ అరిగిపోయి, కుండ తూముల్లో సందు ఏర్పడి, వదులువల్ల కుండలు రెండూ ఆ పక్కకీ, ఈ పక్కకీ జరిగి కడసీలలకు టక్కుటక్కుమని తట్టుకొంటూ ఉన్నవి. ఆ తట్టుకోవడంలో అసలే దొడ్డిచక్రాలయినందువల్ల బండిచట్టం యావత్తూ ఆపక్కనుంచి ఈ పక్కకీ, ఈ పక్కనుంచి ఆ పక్కకీ ఊపు ఇస్తోంది. అందులో గతుకు లున్నచోట, చక్రం పల్లానికి దిగి మిర్రు కెక్కడంలో, ఎద్దుమెడమీదఉన్న కాడితో సహా బండి అడ్డంగా ఉయ్యాలలూగుతోంది. ఈ ఎగుడు దిగుడు ఉయ్యాలల్లో వెంకటశాస్త్రికళేబరంకూడా ఊగిసలాడుతూ, ఒకపక్కకి ఒత్తిగిలి పండుకొన్నందువల్ల, బండి వెనక్కు మీటినపుడు వెన్నెముకకూ, ముందుకి మీటినపుడు మోకాళ్లచిప్పలకీ బండి వాసికొయ్యలూ, పెండెండబ్బలూ కొట్టుకొని బొమికమీద దెబ్బ తగిలే వరకు – పాపం – ఆ బ్రాహ్మడికి ప్రాణం జిల్లార్చుకొని

పోతోంది. కుడిచెయ్యి తలకింద ఉండడంవల్ల, దెబ్బ తగిలినపుడల్లా "ఇస్సు: అబ్బా!" అని ఆయన ఎడం చేత్తో ఆ స్థలంలో రుద్దుకొంటున్నాడు. కంటిమీద కును కెటువంటిదో ఎరుగడు ఆ మానవుడు. ఇన్నాళ్ళుగా ఇంత దేశం తిరిగాడుకాని, ఇంటువంటి ఉతుకుప్టపు ప్రయాణ సౌఖ్యం ఆయన కెక్కడా లభ్యపడలేదు. ఇక నిద్ర ఎట్లా పట్టుతుం దాయనకు? నిద్రపట్టడంమాట ఎట్లా గున్నా, మోకాళ్ళచిప్పలు బద్దలయ్యేబాధ భరించలేక, కాళ్లు ముడుచుకొన్నమనిషి వెల్లకిలా పొర్లి "శంకరా, మహాదేవా" అంటూ కాళ్లురెండూ చక్కగా చాచు కొన్నాడు. అట్లాకూడా ఆయనకు ఉసి చిక్కలేదు. బండిచట్టం పొడుగు మట్టమైనందున, చాచిన రెండు కాళ్లూ మోకాలికింది పిక్కలలగాయతు పాదాలవరకూ చట్టానికి వెలుపలగా వచ్చినై. దానికితోడు బండిఇచ్చే ఒక్కొక్కఊపుతో ఒక్కొక్కఅడుగు కిందికి జారి పోతూ వచ్చింది ఘటం. ఆ జారిపోవడంలో, తలకింద మూటకీ మూటమీది తలకాయకీ సంబంధం విడిపోయి, రెండూ వేరయిపోతున్నవి. ఇంతలో కాడి పైకి లేచి ఎద్దుకి మెడపలుపు బిర్రుతగిలేవరకు "వెనుక బరువు సామీ, వెనక బరువ"ని బండివాడు మళ్లా హెచ్చరిం చాడు. "నీ పో డేమిటిరా చచ్చిపోతుం టే "అని శాస్త్రి మూట విడిచి తలకాయ కిందికి జరగకుండా ఉండేటట్టు

ఇరుపార్శ్వములాఉన్న పెండెంకొయ్యల్ని చెరొకచే త్తోనూ గట్టిగా పట్టుకొని, బండి చట్టానికి చివర భాగంలో బిగించిన అడ్డకొయ్యకు కాలి మడిమెలు తన్నిపట్టి, మనిషి బిఱ్ఱబిగిసి పైకి ఎగతన్ని పండు కొన్నాడు. ఈ వాటంలో పండుకొనేవరకు మనిషి కిందకి జారిపోవడం నిలిచిపోయింది. కాని నిద్రపోవడానికి సావకాశం చిక్కలేదు. ఆయన చేతులూ, కాళ్లూ, శరీరం యావత్తూ జారిపోకుండా బండిలో నిలబెట్టు కొనే ప్రయత్నంలోనే ఉండవలసివచ్చె! ఏ మాత్రం పట్టు వదలినా వాటం చెడి మనిషి కింద పడిపొయ్యే ట్టుగా ఉండె! ఇక ఆయన నిద్రపొయ్యే దెప్పుడూ?

ఎద్దుకూడా బండికి తగినట్టుగానే ఉంది. ఆబండి వాడు, దానిమొఖాన్న ఎన్నడూ ఇంత పచ్చిగడ్డికాని, ఇంత నున్నపొట్టుకాని కొట్టిన పాపాన్ని పోలేదు. కొరడా కొయ్యతో కొట్టేవరకు, శరీరంలో చర్మంతప్ప కండ లేనందువల్ల, ఎముకలకు తగిలి, కొయ్యమీద కొయ్యతో కొట్టినట్లు చప్పు డవుతున్నది. కడుపులోకి తాగిననీళ్లు తప్ప మరొకబలమైన ఆహారం లేనందువల్ల ఎద్దు లగువు తీసినపుడల్లా, కడుపులో పేగులు అదిరి ఎద్దు పారు కొంటూ వచ్చింది. వాసన భరించలేక గుడ్డ తీసుకొని ముక్కు కడ్డు పెట్టుకొంటూ, పండుకొన్నమనిషి లేచి కూర్చుని, ఆగ్రహపూరితుడై, "అబ్బబ్బ! ఏ

బండిరా, ఈబండీ! నా ప్రాణాలు తీయడానికి వచ్చిం దిది. ఛీ! ఛీ! దీన్ని అగ్గిపుల్ల వెలిగించి మంటపెట్టితే పీడ వదలిపోను" అని పెద్దంగా అరిచాడు శాస్త్రి.

బండివాడికి నవ్వొచ్చింది.

"నా బండి కేంతక్కువ సామీ!" అని అడిగాడు వాడు.

"నా శ్రాద్ధం, నా పిండాకూడూను. శరీరం నఖశిఖ పర్యంతమూ హూనమైపోతోంది."

"బండి బాడుగలన్నీ పోయినవయ్యె. వాడడం లేక బాడుగరాక మరమ్మతు లేకపోయె. ఏం చేయమంటారు సామీ!"

"ఇంతదేశం తిరిగాను కడుపులో నీళ్లు కదలకుండా. ఏ రోడ్డు బట్టినా మోటార్ల మయమైపోతుంటే, ఈ దిక్కుమాలినరోడ్డుమీద మోటారే పడదు. ఛీ! ఛీ! వెధవప్రయాణం. ఎరక్కపోయి ఎక్కానీ ముతనష్టపుబండి" అని శాస్త్రి విసుక్కున్నాడు.

"లేకేమి సామీ! ఎదు రొకటీ, వా లొకటీ – రెండు మోటార్లుండై ఈరోడ్డుమీద."

"అయితే నా కాసంగతి మొదట్లోనే చెప్పావు కాదేం?"

"తెల్లవారి పదకొండుగంటలబండి చూచుకొని గాని తూర్పు కెళ్లేమోటారు బయల్దేరదు. తెల్లవారకుండనే ఇల్లు చేరుకోవా లన్నారుగా తమరు ?"

"రాత్రికూడా ఒక మోటారు తగలబెట్టకూడదూ ఆ మోటారువాళ్లు ?".

"వాళ్లకేం మారాజులు. బాడుగబండివాడనే పురుగు లేకుండా – ఉన్నవాళ్ల నందర్నీ జైలు కేసిన తర్వాత – ఇక పగలూ తిప్పుతాడు, రాత్రిళ్లూ తిప్పుతాడు ఆమారాజు."

"బాడుగబళ్లవా ళ్లేమిటి ? జైల్లో వేయించడమేమిటి ?"

"ఆకథ అంతా శానా ఉండదిలెండి. చెప్పుకొంటే తీరేమంటకాదు" అని బండివాడు, టుర్రుమని ఎద్దును అదలించాడు.

ఎద్దు దవుడుతీసింది.

"ఎవరువేయించారుఈరోడ్డుమీద మోటార్లు?"

"ఉన్నాడులెండి ఒక పుణ్యాత్ముడు. మాప్రాణాలకు శనేశ్వరుడై షట్టి పీక్కొనితింటున్నాడు."

"ఆయనపేరు ?"

"చెంచునాయుడంట."





"ఏ చెంచునాయుడు ?"

"బొల్ల చెంచునాయుడు."

"ఏవూరు ?"

"గంగపట్నం ఆయనగారిది."

గంగపట్నానికీ విఠలాపురానికీ ఒక మైలుదూరం. విఠలాపురం గంగపట్నం మజరాగ్రామమే. చెంచునాయుడుకీ, వెంకటశాస్త్రికీ ప్రాణస్నేహం. చెంచునాయుడు, మోటారు, బళ్లవాళ్లు, జైలు - ఈ మాటలు చెవిని పడేవరకు తన స్నేహితుడు చెంచునాయుడి కేదో ఆపద కలిగి ఉంటుందని శాస్త్రికి కొంత ఆందోళన కలిగింది. తాను కొత్తమనిషివలె నటించి, అచ్చటి విశేషాలేమో బండివానివల్ల తెలుసుకొందామని శాస్త్రికొక ఆలోచన పుట్టి, "అయితే ఎన్నాళ్లయిం దీరోడ్డు మీద మోటార్లు వచ్చి" అని బండివాణ్ణి అడిగాడు.

"అంతా ఒక సంవత్సరం అయింది. మీ దే వూరు సామీ ?" అని బండివాడు ప్రశ్నించాడు.

"మాది దక్షిణాది. విఠలాపురంలో బంధువు లుంటే చూడడానికి పోతున్నా."

బండివాడు పలక్కుండా బండి తోలుతున్నాడు ; కాని వాడు ఊరుకోవడం శాస్త్రికి హితవుగా లేదు.

వాణ్ణి కదిలించి ఇంకా విశేషాలు ఒక్కొక్కటే బయటికి తీయాలని ఆయనకు ఆత్రంగా ఉంది.

“బళ్లవాళ్లను జైల్లో ఎందుకు పెట్టార్రా అబ్బీ?”

“ఈ రోడ్డుకు మోటార్లు వచ్చినప్పటినుంచీ బళ్లవాళ్ల కూడు పడిపోయింది. ఆ మారాజు, ఒంటెద్దు బళ్లవాళ్లతో పోటీచేసి, వీళ్లు అర్ధరూపాయికి తీసుకొని పోతామంటే, వాళ్లు ఆరణాలకే తీసుకొనిపోతామనీ, వీళ్లు ఆరణాలంటే వాళ్లు పావలాఅనీ, వీళ్లు పావలా అంటే, వాళ్లు బేడనీ – ఇట్లా పంతానికి పోటీచేసి ఒక్క పురుగయినా బళ్లవాళ్లకు చిక్కకుండా చేశారా మోటారువాళ్లు.”

“అందుకని ఇద్దరూ కలియబడి కొట్టుకొన్నారా ఏమిటి ?”

“కొట్టుకోనూ లేదు, తిట్టుకోనూలేదు: బలవంతుల మీదికి కూటికి లేని కుంకలు పోగలరా ? సంసారాలకు జీవనోపాధి పడి పోయి, బళ్లమీద చిన్నడబ్బు రాకుండా పోయ్యేవరకు, బళ్లవాళ్లకీ బళ్లను ఆధారంచేసుకొని బతికే అలగాజనానికీ కడుపు మండి, అంతా నూరు మంది తోడయి ఒకరోజు కుమ్మక్కుగా నాయుడి లోగిలి మీద పడి ఆయన గారి ధాన్యపుకొట్లు తాళాలు పగలకొట్టి, తలా పందుం, ఏదుంగింజలు పట్టపగలు దోచుకొన్నారు.”



"అయ్యో!"

"అయ్యో లేదు, కొయ్యో లేదు. మరి ఎన్నాళ్లని కడుపుమంట భరించగలరు చెప్పండి సామీ! ఇంట్లో గడవక బళ్లనీ ఎద్దుల్నీకూడా అయినకాడికి తెగనమ్ముకోవలసివచ్చె. అందులో ఆగంగపట్నం బళ్లవాళ్లందరూ తురకసాహేబులు. సంసారపోషణ యావత్తూ ఒక్క మొగవాడి రెక్కమీదనే జరగాలె. కూలిచేసుకొని బతుకుదామనుకొంటే, వాళ్లకులంలో ఆడది బయటికి రావడానికి వీల్లేకపోయె. చస్తారా! ఆఖరికి ఆ తురకలే ఇంత ప్రయత్నం చేసి, ఇతరకులాలవాళ్లనికూడా లోగట్టుకొని ఇంతపని చేశారు."

" ఇంకా ఇతరకులాలవాళ్లంటే ఎవరు ?"

"అబ్బో, ఈ మోటారు వచ్చినతర్వాత ఎంతమందికి కూడు పడిపోయింది సామీ? బళ్లుచేసే వడ్రంగులకీ, ఎద్దుల బేరగాళ్లకీ, బండికొయ్యలు అమ్ముకొనే వాళ్లకీ, బండిగూడు కొట్టే మేదరోళ్లకీ, ఆఖరికి ఎద్దుకి పచ్చిగడ్డి దొక్కొని రోజుకో అణాడబ్బులు తెచ్చుకొనే మాలమాదిగముండలకీ – ఇంతమందికీ కూడులేకుండాపోయింది సామీ! ఆ తురకసాహేబులే గంగపట్నంలో ఇంతమందినీ కలుపుకొన్నారంట; అబ్బ! వాళ్లు తలుచుకొంటే ఎంతపనైనా చేస్తారు సామీ!

"మంచిపని చేశారు. తగినశాస్త్రి అయిందన్న మాట !"

"ఏ మయిందో. ఏమయి ఏం క్రియ చెప్పండీ! బలవంతుడిదే రాజ్యం ఈ కాలంలో."

"అట్లాగే."

"ఈ వందమందిమీాదా కేసుపెట్టి, ఆఖరికి తలా ఒకటీ, రెండూ, మూడేసేళ్లు శిక్షవేయించి, జైలుకు పంపేవరకూ ఆ నాయుడూ, ఆ పోలీసులూ నిద్రపోలేదు గదా! కానియ్యండి భగవంతుడన్నీ కనిపిస్తాడు" అంటూ బుగ్గనఉన్న పొగాకు తుబుక్కున ఊసి డ్రుచ్చి అని ఎద్దును అదిలించాడు.

చివరికి చెంచునాయుడిదే పైచెయ్యి అయిందని వినేవరకు శాస్త్రిమనస్సుకు ఊరట కలిగింది. బళ్ళ వాళ్ళకీ, నాయుడికీ, ఏదో పెద్ద వ్యవహారమే జరిగి ఉంటుందని ఊహించాడు. నాయుడు పట్టుదలమనిషని శాస్త్రికి బాగా తెలుసు. ఇంకా విశేషాలు ఏమిటో విందామని "అబ్బా! ఎంతకథ జరిగిందిరా అబ్బీ! ఎన్నాళ్ళయింది ఇదంతా జరిగి?" అన్నాడు.

"కేసు జరిగి ఆరునెల్లయింది. ఈ ఆరునెలలుగా విచారణలో ఉండి, అంతా వారంరోజుల కిందటనే జడిజి గారు శిక్ష చెప్పారు."

"ఆ నాయుడు బాగున్నాడా?"

"బాగుండక ఆయన కేంరోగం? బీదవాళ్ళని ఏడిపించడానికి ఇంకా నూరేళ్ళు బతుకుతా డాపుణ్యాత్ముడు."

"ఆయన దేమైనా పెద్దస్థితేనా ఏమిటి?"

"ఆయన కేం సామీ, జమీందారు: గంగ పట్నం సగం పూరంతా కొన్నాడంట. ఇంకా ఎన్నెన్నో ఆయనకు వ్యాపారా లుండై. సాలుకు ఇరవై వేలు వస్తుందని అంటారు."

"అబ్బా! ఇంతడబ్బుగలవాడు మోటార్లు వేసి బీదవాళ్ళని ఏడ్పించకపోతే నేం పాపం?"

"ప్రజల సౌకర్యంకోసరం వేయించాడంట ఈ మోటార్లు. ప్రజ లెవరో, సౌకర్యా లేమిటో ఆయన కసలు తెలుసా?"

"ఎంతసేపూ స్వలాభంకొరకే ఈ దొర్లాట- భాగ్యవంతులకుకూడా."

"పోనీ, కేసు పెట్టితే పెట్టా డనుకోండి. పచ్చి గడ్డిగంప లమ్ముకొనే మాలముండల్నికూడా ఇరికిం చాలా ఆదొర? అయినా మాకులం అంటే ప్రతీవాడికీ అలుసు సామీ" అని అన్నాడు బండివాడు.

బండివాడు "మాకులం" అనేవరకు శాస్త్రికి అర్థం కాలేదు. "మాలకులమనా లేక వాడికులమే

మాలకులమనా దాని అర్థం" అని సందేహం కలిగింది శాస్త్రికి. ఏదో ఆలోచనపడింది మనస్సులో!

బండివాడు తనధోరణి తాను విడవలేదు. ఏదో పరధ్యానంగా ఉండి • నోటికి వచ్చినట్లు మాట్లాడు తున్నాడు. తన బండిలోని మనిషి బ్రాహ్మడని వాడికి తెలియదు. తెలిసినప్పటికీ వాడు బ్రాహ్మలికికూడా ఇది వరలో చాలాసార్లు బండి కట్టాడు. మళ్ళా అందిపుచ్చు కొని "మా మాలకులానికి కయ్యాలా, కాలవలా చెప్పండి సామీ! ఆముండలు బళ్ళవాళ్ళకి గడ్డి అమ్ము కొని బతుకుతున్నారనీ, దోపిడీసమయంలో వాళ్లు కూడా గంపలు చేతపట్టుకొని ఆజనంలో ఉన్నారనీ పది మంది ఆడవాళ్ళనుకూడా కేసులో ఇరికించాడు ఆ నా యుడు. వాళ్ళు పసిబిడ్డల తల్లులంట. ఇంటికాడ పిల్లలు అలోలక్షణా అని అల్లాడిపోతున్నారంట! తలచుకొంటే, దుఃఖం వస్తుంది సామీ!" అని బండివాడు ఆవుద్రేకం మీద ఏమేమో చెప్పబోతుండగా, వాడు మాలవాడని శాస్త్రికి స్పష్టమయింది. దానితో ఆయన ఒళ్ళు జల దరించింది. బండిలో వక్కక్షణంకూడా నిలవ బుద్ధిలేక కిందికి గభాలున దూకాలనిపించింది. చైతన్యం విడిచి కొయ్యబొమ్మ అయిపోయినాడు. బండివాణ్ణి నమిలి మింగేయాలన్నంత ఆగ్రహం వచ్చిం దాయనకు; కాని కర్తవ్యం గోచరం కాలేదు. జీవితానికి పరమావధి

పెట్టుకొని తాను ఇన్నేళ్ళుగా చేసినకృషిఅంతా గంగపాలయిపోయింది. కాశీగంగ చెంబులు బండిలో ఉన్నై. సర్వం జగన్నాథం అయింది. బండివాడి తల రెండుచెక్కలయ్యేటట్టు పగలకొట్టా లనుకొన్నాడు: కాని ధైర్యం చాల్లేదు; చీకటి, అంధకారం. తాను ఒంటరిగాడు: రెండో సహాయం లేదు: బండివాడు ఇరవై, ఇరవై అయిదేళ్ళ వయస్సు గలిగి, మంచి జెబ్బపుష్టిగల మనిషిలా ఉన్నాడు: తిరగబడితే తనవంటి పప్పు బ్రాహ్మలను పదిమందిని కలిపికొట్టేవాడులా కనపడ్డాడు. ఆపరిస్థితులలో తొందరపడకూడ దనుకొన్నాడు. ఊరికి చేరినతర్వాత వాడిభరతం పట్టాలని తీర్మానించుకొన్నాడు. బండివాడి కానుకొనిఉన్న తనమూటను ఎడంగా లాక్కొన్నాడు. బండి సాగింది. ఇక బండివాడి పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవాలని శాస్త్రి, "అబ్బీ! నీ దేవూరురా?" అని అడిగాడు.

"నాది ఉత్తర్వాది - తెనాలండి."

"ఇక్కడి కెందు కొచ్చావు?"

"పుంజూరులో నామేనమామకూతుర్ని పెళ్ళి చేసుకొని ఇప్పటి కారునెలలుగా ఇక్కడే నిలిచిపోయాను. ఈబండి మామామదేనండి."

"నీ పేరు?"

"పోలయ్య."

"గంగపట్నం బళ్ళవాళ్ళను నువ్వెరుగుదువా?"

"కొంతమంది గుర్తేనండి."

"నువ్వు మాలవాడివికదా? నీబండికి జనం వొరుకుతున్నారా?"

"ఇప్పుడెవరూ ఆపట్టింపులు పెట్టుకోవడం లేదండి. అవసరంకొద్దీ అయ్యగార్లుకూడా నాబండి చాలాసార్లు కట్టించుకొన్నారు."

"ఇదివర కెప్పుడైనా విఠలాపురం వెళ్ళావా?"

"విఠలాపురం పోలేదుకాని, గంగపట్నం వెళ్ళాను."

"ఆవూళ్ళో నీకు బంధువు లున్నారా?"

"లేరండి."

"సరే! తొందరగా పోనియ్యి! తెల్లవార వస్తోంది." అన్నాడు వెంకటశాస్త్రి.

తెల్లవారుజామున ఇంకా కనిచీకటి ఉంది. ఇంకా అయిదారుమైళ్ళు పోవాలి బండి. వెంకటశాస్త్రికి స్థిమితం చెడింది. తనంతటిపండితుడు చివరికి మాలవాడి చేతిలో చిక్కుకొన్నందుకు ఆయనకు పట్టరాని ఆగ్రహం కలుగుతూవుంది. అగ్రజన్మమెత్తిన తనయెడల అంత అపచారంచేసిన ఒక తక్కువకులం మాలవాణ్ణి ఆ సమయంలో ఏమీచేయలేని తన నిస్సహాయస్థితికి ఉడు

మోతుతనం ఉబికి ఉబికి పొర్లివస్తోంది ఆయనకు. హృదయం కుమిలి వేడినిట్టూర్పు లధికమైనవి. బండివాడి మీద కలిగిన ఆగ్రహాగ్నికి శరీరంయావత్తూ వేడెక్కి, మాఘమాసంచలి మందగించి, కప్పుకొన్న శాలువ వంటి మీద ఉంచుకోవడానికి ఆయనకు చీకాకనిపించింది. శాలువ విసరి బండిలో ఓపక్కన వేశాడు. ఎప్పు డెప్పుడు ఇంటికి చేరుదామాఅని ఆత్రపడుతున్నాడు ఆ బ్రాహ్మడు.

ఉదయం అయిదు అయిదున్న రయ్యేసరికి బండి కంకరరోడ్డు దిగి మట్టిరోడ్డుకు మళ్ళింది. బాగా తూర్పు రేఖ లారినవి. బండివాడిమొఖం శాస్త్రికి బాగా గోచ రించింది. ఉదయాన్నే ఛండాలుడిమొఖం చూడడాని కసహ్యం అనిపించింది. ఆసంధ్యవెలుతురులో శాస్త్రి మొఖంకూడా పోలయ్యకు పొడకట్టింది. ఆయన బ్రాహ్మడుకాబో లనుకొన్నా డతడు; కాని ఆయన మొఖంలో వికాసం కనిపించలేదు. మని షేదో దీర్ఘా లోచనలో ఉన్నట్టుగా అగుపడ్డాడు. మొఖం ఎర్రంగా జేవురించి,నరాలతోకూడా ఉబికిఉంది. కళ్ళు రెండూచింత నిప్పులవలె కణకణలాడుతూ ఉన్నై. రాత్రి నిద్రలేక ఆయన మొఖం అల్లా ఉం దనుకొన్నాడు బండివాడు.

ఆరుగంట లయ్యేవరకు బండి విఠలాపురంచేరి [illegible]కటశాస్త్రి ఇంటిముందట నిలిచింది. ఆరోజు మను

మడి భారసాల. వీధిగుమ్మానికి మామిడాకులతోరణం కట్టారు. శాస్త్రి ఎప్పుడు వస్తాడా అని ఇంటిల్లిపాదీ కోడికూతతో లేచి ఎదురు తెన్నులు చూస్తున్నారు. వెంకటశాస్త్రి బండి దిగి మూట వీధిఅరుగుమీద పెట్టి బయటనే నిలబడ్డాడు. కాళ్ళు కడుగుకోను భార్య నీళ్ళు తెచ్చియిచ్చింది. మొఖం కడుక్కోను పుల్ల తెమ్మని మొఖం కడుక్కొన్నాడు. శాస్త్రి ఇంకా ఇంట్లో అడుగు పెట్టలేదు. "లోపలికి రం" డని భార్యా, కొడుకూ పిలిచారు. "ప్రయాణపుగుడ్డలు లోపల పెట్టడానికి వీల్లేదు. స్నానం చేసిగాని లోపలికి రా" నన్నాడు శాస్త్రి.

బండివాడు "బాడుగ సామీ" అని అడిగాడు. "ఇస్తాను ఉండరా" అని వాడికి జవాబు చెపుతూ, కొడుకును రహస్యంగా పిలిచి, అర్జంటుగా చెంచు నాయుణ్ణి పిలుచుకొనిరమ్మని పంపాడు.

చెంచునాయుడికి వెంకటశాస్త్రి గురుపదం. పండితుడన్న గౌరవంచేత, ఆయనకు నాయుడు ఇల్లు కట్టించి యిచ్చాడు. నాలుగెకరాలమాగాణి వ్రాసి యిచ్చాడు. ఆయనకొడుకువివాహానికి ద్రవ్యసహాయం చేశాడు. శాస్త్రిగారికుటుంబంమీద నాయుడి కెంతో ప్రీతీ, అభిమానమూను. ఈసంబంధం అనాదిగా పెద్దల తాగాయతూ వస్తూఉన్నది. అందువల్ల తనకు ప

ఉన్నా, శాస్త్రికి పని ఉన్నా, ఏవేళనైనాసరే నాయుడే శాస్త్రిగారిదగ్గరకు స్వయంగా వచ్చి మాట్లాడి పొయ్యే మామూలు. అందువల్ల ఆయనదగ్గరనుండి కబురు వచ్చిందనేవరకు, రెండేళ్లుగా దేశాటనంచేసి వచ్చినందున ఏమి తొందరపనో అని నాయుడు నిద్ర మంచంమీదనుండి లేవడంతోనే తలకు ఫ్లానల్ గుడ్డ చుట్టుకొని, కాలికి చెప్పులు తొడుక్కొని, చేత కర్ర పట్టుకొని, ఎకాయెకీని విఠలాపురం బయల్దేరాడు.

అప్పటి కప్పుడే సూర్యోదయమయి బారెడుపొద్దెక్కింది. అగ్రహారీకులు "చాలాకాలానికి దయ చేశారు శాస్త్రిగారు" అని కొందరూ, "అగ్రహారం మీద శాస్త్రిగారు మరీ శీతకన్నేశారు" అని మరి కొందరూ, "మమ్మల్ని మరిచేపోయారు — శాస్త్రి గారు" అని ఇంకోకొందరూ, "బహుకాలదర్శనం — క్షేమమా?" అని మరికొంతమందీ — ఇట్లా అనేక రకాలుగా పలకరిస్తూ శాస్త్రిగారి ఇంటిముందర జనం మూగారు. ఇంతలో నాయుడు వచ్చి — "సాష్టాంగ దండాలు" అని శాస్త్రికి దణ్ణం పెట్టాడు.

"దీర్ఘాయుష్యమస్తు. వంశాభివృద్ధిరస్తు. ఐశ్వర్యాభివృద్ధిరస్తు" అని శాస్త్రి దీవించి, చాప తెప్పించి అరుగుమీద వేయించి నాయుణ్ణి కూచోమన్నాడు.

"చాలా కాలానికి మావీాద దయ వచ్చిందే శాస్త్రిగారికి —" అని నాయుడు కుశలప్రశ్న చేసి ఏదో అనబోతూ ఉండగా, లోపల కుతకుతలాడే శాస్త్రి ఇక భరించుకోలేక, వెంటనే "విన్నాను. కథ యావత్తూ విన్నాను. ఈ తాగుబోతుగాళ్లు నీకు చేసిన అపకారం అంతా చెవికొచ్చింది. అబ్బా! ఎంత గండం తప్పింది నాయుడూ! నిష్కారణంగా వీళ్లచేతుల్లో నీ ప్రాణాలు పోయిఉండేవి. ఎంతపని జరిగిందీ! ఇట్లా జరిగిందని నాకు ఒకకార్డుముక్కైనా రాశావుకావు. మావాడూ రాశాడు కాడు —" అని నాయుడికి కలిగిన ఆపదకు తన సానుభూతి చూపిస్తూ ఆదరణ మొదలు పెట్టాడు.

"మీాకు వ్రాద్దా మనుకొంటూనే సుస్తీచేశాను. ఇంతకూ భగవంతుడు చల్లంగా చూడాలెకాని — వీళ్ల వల్ల ఏమవుతుందీ వెధవలు?"

"నిజమే! ఇంకా వీళ్లని ముక్కలు ముక్కలుగా తరిగి ఉప్పుపాతర వేయకుండా ఊరుకొన్నావా నాయుడూ?"

"అయితే అంతపనీ చేయకుండా విడిచిపెట్టేనా ఏమిటి? ఒక్కొక్కడికి మూడేసేళ్లు వేయించి వంద మందినీ వెల్లూరుజైలుకు పంపించాను. తమరు విన లేదూ?"

"ఎంతచేసి ఏం ఉపయోగం? మళ్లా కథలంతా మొదటి కొచ్చింది. విన్నావో లేదో! జమీందారు వంటివాడివి నిన్నే లెఖచేయని ఈమాలమాదిగలు మాబోటివాళ్లని లక్ష్యపెట్టుతారా? సేతుహిమాచల పర్యంతమూ తిరిగివచ్చానుకాని ఇంత పరాభవం ఎక్కడా పొందలేదు."

"ఏం జరిగిం దేమిటి?"

"అదుగో చూడు! ఆబండిదగ్గర నిలబడ్డాడు వాడు శుద్ధమాలాడు. నిన్నగాక మొన్న నూరుమందికి శిక్ష వేయించావుకదా నువ్వు, వీడు భయభక్తులు లేకుండా నన్ను పుంజూరునుంచి వితలాపురానికి బండిలో ఎక్కించుకొనివస్తాడా? వీణ్ణి ఏం చేస్తే పాపం ఉందీ?"

"మాలవాడా వీడు?"

బండివాడు పలకలేదు.

శాస్త్రి వాడికేసి చూస్తూ "ఛీ! జవాబు చెప్ప కుండా నిలబడతావు. ఆనోటి మీద వాతలు వేయిస్తా చూడు! రాత్రి తెల్లవార్లూ, ఈనాయుణ్ని నోటికి వచ్చి నట్లు దూషిస్తూ మాట్లాడేవే! ఇప్పు డేమైం దానోరు?"

"దవడపళ్లు రాలేటట్టు కొట్టక పోయినారా అట్లాంటికూతలు కూసినప్పుడూ? ఈ వాంకొడ్డుబళ్ల ... ఏంచేసినా పాపం లేదు" అన్నాడు నాయుడు.

బండివాడు గడగడ వణకిపోతున్నాడు.

"నే నెవరని నీబండిలో ఎక్కించుకు వచ్చావురా నువ్వు? మాదిగవా ణ్ణనుకొన్నావా? మాలవా ణ్ణనుకొన్నావా? మనిషిని గమనించి మరీ బండికట్ట పనిలే?"

"నాకేం తెలుసు సామీ! తమరు బ్రాహ్మలని?" అన్నాడు బండివాడు.

"అయితే బ్రాహ్మ డెవడో మాలవా డెవడో కూడా తెలియకుండా కళ్లకు కావరంఎక్కి ఉన్నావన్న మాట" అన్నాడు నాయుడు.

"అర్ధరాత్రి నేను మనిషిని గుర్తించలేకపోయాను బాబుగారూ!" అన్నాడు బండివాడు.

"అసలు నిన్ను బాడుగబండి పెట్టుకోమని ఎవరు చెప్పారు? నీతాతనా డెరుగుదువా నీ ముత్తాతనా డెరుగుదువా నువ్వు బండెక్కి? చెప్పరానివాడు తన కులవృత్తి మాని ఇంకోవృత్తి చేసుకోవచ్చు నని ఎక్కడ ఉందో చెప్పరా? తెలియక ఒక వేళ నా బోటివాడు బండి కట్టమంటే మాత్రం, ఆ మైన వర్ణాశ్రమధర్మాలు నాశనం చేయడానికి సరేనని తయా రవుతావా? 'నేను చెప్పరానివాణ్ణి సామీ!' అని చెప్పనక్కర్లే?" అని వెంకటశాస్త్రి పండ్లు పటపట కొరుకుతూ పరవళ్లుతొక్కుతున్నాడు.

"చెప్పుతో మూడు పగలగొట్టండి వెధవను. మదం అణుగుతుంది" అన్నాడు నాయుడు.

"తెలియక చేశాను సామీ!" - అన్నాడు బండివాడు.

"ఛీ! మళ్ళా ఆకూతే కూస్తావు. తెలియదంటే నే నమ్ముతానా? పదేళ్ళుగా రక్తమాంసాలు వోడ్చి చదువుకొన్న శాస్త్రం అంతా తగలడిపోయిందే, కాశీ సమారాధన చేసుకొందామని కష్టపడి గంగ తెచ్చుకొన్నాను — అంతా నాశనం చేశాడు వీడు."

"వీడి కన్నీ తెలుసు. — ఇట్లాంటిపని చేయవు కదా అని పండబెట్టి పట్టకారతో రెండుగుడ్లూ ఒత్తిస్తే రోగం కుదురును. — అబ్బబ్బ! నా కేసులో ఆ తురక వాళ్లూ, వీళ్లూ చేరి నా గడ్డి నాకు పెట్టారు శాస్తుర్లూ! ఈ వందమందిమీదా కేసు రుజువుచేయించి, జైలుకు వేయించేవరకు బోళ్ళెడంతయింది నాకు. ఎవరు తిన్నట్టు చెప్పండీ? మీబోటి బ్రాహ్మడి కిచ్చినా దీపంపెట్టుకొని తలుచుకొనేవారు. ఆ జడ్జి ధర్మప్రభువు కాబట్టి వీళ్లెన్ని మాతలసే కూసినా మనవాదనే నమ్మి శిక్ష వేశాడు." అన్నాడు నాయుడు.

ఇంతలో అక్కడచేరిన అగ్రహారీకు లందరూ కబడితె చేతపట్టుకొని తలొకమాట అందు

కొన్నారు. నాయుడికి వేడెక్కింది: కేసు అయింది లగాయతు ఒంటెద్దుబండివా డంటే అసలే మండి పడుతున్నాడు నాయుడు.

"అయితే వీడి కేంశిక్ష చెప్పారు? శాస్త్రుల్గా!" అని ఆ వేడిమీద అడిగాడు నాయుడు.

"ఛండాల్లుణ్ణి తాకితే, బ్రాహ్మడు ఒళ్లు తెగ్గాల్చు కొంటేనేగాని ఆపాపం పద్నాలుగుజన్మాలదాకా పోదు. నాకు కావలసిన ప్రాయశ్చిత్తం వీడికి శిక్ష—" అన్నాడు శాస్త్రి.

నాయుడు వెంటనే ఇద్దరుమనుష్యుల్ని పిలిచి, బండివాణ్ణి పసువులదొడ్లో పగ్గాలతో గుంజకు కట్టించాడు. గంపెడుపిడకలు దాలి చేయించి, బొటనవేలులావు ఇనప కర్ర అగ్నిహోత్రంలో పెట్టించి చేటలతో విసిరిస్తున్నాడు.

బండివాడు ఒకవిపరీతమైనస్థితిలో పడ్డాడు. చినికి చినికి గాలివాన అయింది వ్యవహారం. ఇట్లా జరుగుతుందని తాను కలలోకూడా అనుకోలేదు. వె[illegible]పె పుల్లుల్లో ఒక్కలేడిపిల్ల! ఇంతమంది అగ్రహారీకుల్ని తానొక్కడూ ఎట్లా ఎదుర్కోగలడు? ఎవరితో మొర పెట్టుకొంటాడు? తాను చేసిన తప్పేమిటో అ[illegible] గాకుండా ఉంది. ఇక తనచావు నిజమని [illegible]

కొన్నాడు వాడు. నోటివెంబడిమాట రావడం లేదు. గొంతుక ఎండిపోతున్నది. దాహమవుతున్నది: ఒంటేలుకు పోవలసిన అవసరంగా ఉన్నది: కాని కాలూ చెయ్యీ కదపడానికి వీల్లేనిస్థితిలో ఉన్నాడు. తనకళ్ళ ఎదుట నల్లని ఇనపకచ్రు ఎర్రబడుతోంది. ఉత్తరక్షణం తలుచుకొంటే గుండె నీరయిపోతోంది "ఎంతపాపం చేసుకొన్నానోగదా" అని దుఃఖిస్తూ కళ్లుమూసుకొన్నాడు.

ఇంతలో వెంకటశాస్త్రి నాయుణ్ణి చాటుకు పిలిచి "నాయుడూ! మనం చేసేపని పైకి పొక్కితే, ఆపోలీసువాళ్ళవల్ల తంటా రాదుగదా! కాస్త ఆలోచించు నువ్వు కూడా!" అన్నాడు.

"అంత పిచ్చిపని చేస్తాననుకొన్నావా శాస్తుర్లూ? పోలీసులు మనం కూర్చోమంటే కూర్చోవాలె, నుంచోమంటే నుంచోవాలె!" అని ధైర్యంచెప్పాడు నాయుడు.

"అయితే సరే" అని వెంకటశాస్త్రి ఉత్తర్వు

చా...

...చ్రు ఎర్రబడిందో లేదో చూడమన్నాడు నాయ...

పోలయ్య కొంచెం వ్యక్తిగలమనిషి; కొంచెం ...కొన్నవాడుకూడాను. చిన్నతనంనుండీ పట్నవా

సంలో పుట్టిపెరిగినమనిషి. మంచీ, సెబ్బరా, దేశకాల పరిస్థితులూ కాస్త తెలుసుకొన్నవాడు. కళ్ళు మూసుకొన్న కొంతసేపటి కొకఆలోచన తట్టింది అతగాడికి. “చచ్చేవాళ్ళం ఎట్లాగా చస్తాం.అబద్ధమైతే అయింది, ఈదారి తొక్కి ఒకదొంగెత్తు వేదాం” అని నిశ్చయపర్చుకొని, మొండిధైర్యం తెచ్చుకొని, నాయుణ్ణీ, శాస్త్రినీ ఉద్దేశించి,

“నన్ను మీ రీ ప్రకారం హింసిస్తున్నారు. నేను చచ్చినా, బతికినా ఈ విషయం పైకి పొక్కక మానదు. మాపాదిరీదొరగారికి ఈసంగతి తెలిస్తే, మీరు ఇంతకింతా అనుభవిస్తారు ; మీరే బలవంతులని అనుకోకండి. మేము మీ మతం విడిచి క్రయిస్తవమతం తీసుకొన్నాకూడా మీ రీ ప్రకారం మమ్మల్ని ఏడిపించడం మా ఏసుప్రభువు గమనిస్తూనే ఉన్నాడు” అని పెద్దగా వెర్రిఅరుపు అరుస్తూ కేక పెట్టాడు.

బండివాడినోటినుండి ఈమాటలు వినవచ్చేవరకు, శాస్త్రీ, నాయుడూ ఒకరిమొఖం ఒకరుచూచుకొన్నారు “ఇ దేమిటి, మతం తీసుకొన్నా నంటున్నా ఇద్దరూ కొంత తటపటాయించారు.

“నువ్వు క్రయిస్తవుడవా ?” అని శాస్త్రి గాడు.

"అవును; మా తాత తనహయాంలో మతం పుచ్చుకొన్నాడు" అని బింకంగా జవాబు చెప్పాడు.

"నీ పేరు?"

"పౌలయ్య."

"బండిలో చెప్పడంలో నీపేరు పోలయ్య అని చెప్పావే?"

"లేదు; పౌలయ్యనే చెప్పాను."

"నీ తండ్రిపేరు?"

"జకరయ్య"

వెంటనే కట్టినకట్లు విప్పమని నాయుడు ఉత్తర్వు చేసి, శాస్త్రీ, తనూ గడ్డివామిచాటుకు పోయారు.

వెం — రాత్రి చెప్పడంలో పోలయ్య అని చెప్పా ...య్యా, దొంగవేషం వేస్తున్నాడేమో?

నా — మీరు పొరపాటుగా వినిఉంటారు; పౌ ... బదులు పోలయ్య అని మీకు వినిపించి ఉం ... చూడండి, వాడికి క్రాపింగుకూడా ఉంది. లేదు, వీడు క్రయిస్తవుడే!

వెం — క్రాపింగుకేం గాని క్రయిస్తవుడయితే ... ఆలోచించదగ్గదే.

నా — అమ్మా! ఇంకా నెమ్మదిగా అంటున్నారా! ఈ పాదిరీలకీ, సర్కారువారికీ చాలాదోస్తి ఉంటుందండీ. వాళ్ళు పట్టు పట్టారంటే సీమదాకాకూడా వెళ్ళి తగవు లాడుతారు. కాబట్టి తొందరపడకూడదు.

వెం — సరే! అట్లాగే నీ ఇష్టప్రకారమే కానీ! 'అతి సర్వత్ర వర్జయే' త్తన్నాడు శాస్త్రకారుడు. అదీగాక, నిజంగా వీడు క్రయిస్తవుడే అయితే మన కంత పట్టింపు లేనేలేదు. మన ప్రభువుల మతం అదే అయినపుడు, ఆమతాన్ని నిందిస్తే ప్రభువుని నిందించినట్లే! "నావిష్ణుః పృథివీపతిః;" కాబట్టి రాజు అవలంబించిన మతంలో కూడా విష్ణ్వంశ ఉండితీరుతుంది. — మన మతంలోనే కాని, వాళ్ళమతంలో ఛండాలురంటూ లేనేలేరు. కాని ఎటు వచ్చీ నాసందేహం ఏమంటే, వీడు నిజంగా క్రయిస్తవుడేనా అని?

నా — అయినా కాకపోయినా, ఈ [illegible] మట్టుకు మనం తగ్గడమే శ్రేయం. ఏమో! ఏ[illegible] ఏపాముందో! వాడు ఉత్తరాది తెనా లంట[illegible] అక్కడ వాడి కేంప్రాపక ముందో, ఎ[illegible] డొచ్చారు?

వెం — అవునవును. వా డింకా మం[illegible] కాబట్టే ఇంతదూరం ఊరుకొన్నాడు.

అని శాస్త్రి తృప్తిపడి మళ్ళా బండివాడికంట బడకుండా సందుదారిన దొడ్లో దూరాడు.

నాయుడు పోలయ్యకు కట్టినకట్లు విప్పించి, ఇంటికి తీసుకొనిపోయి రూ. 3–0–0 లు చేతిలోపెట్టి అన్నం పెట్టించి బండివాణ్ని పంపివేశాడు.

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B127 |
| పుస్తకం పేరు | కరుణ కుమార కథలు 01 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 209 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | thasfin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | no |
| పరిస్థితి | good |